భారతదేశము – ప్రజలు

# పెంపుడు జంతువులు

హర్బన్స్ సింగ్

అనువాదకుడు

కె. లక్ష్మణ్ణ



నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా

ISBN 81-237-0846-7

ప్రథమ ముద్రణ 1969 (శక 1891)
ద్వితీయ ముద్రణ 1994 (శక 1916)


DOMESTIC ANIMALS (Telugu)

రూ.:35.00

డైరక్టర్, నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా, ఎ-5 గ్రీన్ పార్క్,
న్యూఢిల్లీ - 110 016 వారిచే ప్రచురించబడినది

# విషయ సూచిక

# తృతీయ ముద్రణకు ఉపోద్ఘాతం

ఈ పుస్తకం మొదటి ముద్రణ ఏప్రిల్ 1966 లో జరిగింది. 1988 రెండవ ముద్రణ తరువాత ఇటీవల సేకరించిన సంఖ్యా సమాచారంతో పుస్తకాన్ని విస్తారంగా మార్పు చేయవలసి వచ్చింది.

చైనా తరువాత మనదేశంలో జనాభా ఎక్కువ. దేశపు అధిక పెంపుడు పశువులసంఖ్య 369.03 మి. తీసుకుంటే ఇద్దరికి కనీసం ఒక పెంపుడు జంతువున్నట్లు అంచనా వేయవచ్చు. 61.96 మి. గేదెలతో కలిపి, మన పెంపుడు జంతువులు 241.96 మి. ఉన్నాయి. గొర్రెలు, మేకలు 116.24 మి గుర్రాలు, కంచరగాడిదెలు, ఒంటెలు 3.16 మి. ఉన్నాయి. 7.6 మి. పందులున్నాయి. దేశపు వ్యవసాయ సంపదకు పశుగణం 10.9 శాతం తోడ్పడుతోంది. రూపాయల లెక్కలో ఇది సంవత్సరానికి రు. 10,000 కోట్లు మించుతోంది. ప్రపంచపు పెంపుడు జంతువుల మొత్తం సంఖ్యలో మనదేశం 12. శాతం కలిగివుంది. మన పశువుల్ని ఒకదాని వెనుక ఒకటి వరుసగా నిలబెడితే భూమధ్యరేఖ గుండా పదకొండుసార్లు తిరిగివస్తాయి. మరోలా చెప్పాలంటే పశువుల వరుస భూమినుంచి చంద్రమండలం వరకూగల దూరమంత వుంటుంది.

మన పశుసంపద ఉత్తర అమెరికా అంత వుంది. ప్రపంచంలో 1/2 శాతం గేదెలు, 1/8 శాతం పశువులు, 1/6 శాతం మేకలు, దేశంలో వున్నా, 1977 లో (లభ్యమయిన జనాభా సంఖ్య ప్రకారం) పాల ఉత్పత్తి 28,355 వేల మెట్రిక్ టన్నులు మాత్రమే. మన పశుసంపద 40 శాతంవున్నా, ఉత్తర అమెరికా మనకంటే మూడురెట్లు అధికం పాలు ఉత్పత్తి చేస్తుంది. సగటున రోజుకి దేశంలో మనిషికి 123గ్రా. పాలు వాడిక అవుతుంది. రోజు 600-750 గ్రా. వాడిక అయ్యే అమెరికా, న్యూజిలెండు, ఆస్ట్రేలియా మొదలైన దేశాలతో పోలిస్తే యిది చాలా తక్కువ.

విదేశాల పశువులతో పోల్చిచూస్తే మనదేశపు పశువులకి పాలు యిచ్చే శక్తి చాలా తక్కువ. సగటున ఒక ఏడాదికి ఒక ఆవు డెన్మార్కులో 4401 కి.గ్రా., స్విట్జర్‌లాండ్‌లో 4156 కి.గ్రా., అమెరికాలో 4773 కి.గ్రా పాలు ఇస్తుంటే మన దేశపు ఆవు 500 కి.గ్రా మాత్రమే ఇస్తుంది. గేదెలు ఆవుల కంటే కొంచెం ఎక్కువగానే యిస్తాయిగానీ మొత్తానికి సగటు ఉత్పత్తి అధికమవాలి.

పాలఉత్పత్తి అధికంచేసే అనేకకార్యక్రమాలు రూపొందుతున్నాయి. 1985-88 లలో 41,000 మెట్రిక్‌టన్నుల ఉత్పత్తని అంచనా వేయబడింది. దేశంలో 80.64 మి కాడి పశువులున్నాయి. వ్యవసాయానికి ఉపయోగపడే భూమి 156.78 మి. హెక్టార్లు. ఈ ప్రకారం 3.9 హెక్టార్ల భూమి ఒక జత ఎద్దులు దున్నగలవు. కాడి పశువుల త్రాణలేమి తక్కువ పంటకి ఒక ముఖ్య కారణం. ఇతర పెంపుడు పశువుల స్థితికూడా అధ్వాన్నంగా వుంది. గొర్రెల విషయంలో మనదేశం ప్రపంచంలో 5వ స్థానం ఆక్రమిస్తుంది. కానీ మనకి లభించే ఉన్ని శ్రేష్టమైనది కాదు. రోమభూయిష్టంగా, ముతకగా, నాణ్యమైన బట్టలు నేసేందుకు పనికిరాదు. సాలీనా గొర్రెకి లభ్యమయ్యే ఉన్ని కూడా స్వల్పం. సగటున 700 గ్రా. మటుకే. అన్యజాతి గొర్రెల నల్ల 5 మొదలు 7 కి.గ్రా. వరకూ బొచ్చు లభిస్తుంది. ఒక మాంసం విషయం చూస్తే సగటున గొర్రె 25-30 కి.గ్రా. బరువు మాత్రం తూగుతుంది. అన్యజాతి గొర్రెలు ఇంతకు మూడు రెట్లకి పైగా తూగుతాయి.

ఇక కోళ్ల, బాతుల వంటి పక్షుల మాట అయితే, దేశంలో 159.22 మి. మటుకే వున్నాయి. 540 గల డెన్మార్కు, 373 గల కెనడా, 286 గల అమెరికా, 179 గల యునైటెడ్ కింగ్‌డమ్, 150-200 గల ఇతర యూరపు దేశాలతో పోలిస్తే మన దేశంలో వందమందికి 25 మాత్రమే వున్నాయి. చతురపు కి.మీ. ఒక్కొంటికిగల పౌల్ట్రీ పక్షుల సంఖ్య చూస్తే, మనదేశం, ప్రపంచంలో రెండో అధమస్థాం గలది.

ఏడాడికి కోళ్లు బాతులు మొదలైనవాటి మాంసం దేశంలో 136 వేల మెట్రిక్ టన్నులు - అంటే ప్రపంచపు మాంసం ఉత్పత్తిలో 0.47 శాతం మాత్రమే. దేశంలో మొత్తం 775 వేల టన్నుల గ్రుడ్లు ఉత్పత్తి అవుతున్నాయి. అనగా ప్రపంచపు గ్రుడ్ల ఉత్పత్తిలో 2% శాతం మాత్రమే అభివృద్ధి చెందిన దేశాల సాలీనా కోడిగ్రుడ్లు పెట్టే శక్తితో పోలిస్తే మనదేశపు శక్తి సగం మటుకే.

పశువుల పెంపకం దేశంలో అనేక ప్రతికూల శీతోష్ణ వాతావరణ పరిస్థితులతో సాగించబడుతోంది. వ్యవసాయం చిన్న వ్యవసాయదార్ల పైనే ఆధారపడి వుంది వీరిలో చాలామంది పౌల్ట్రీ పెంపకం వ్యవసాయానికి తోడుగా వుండే వృత్తి. సామాన్యంగా ఇతను పేదవాడూ, ద్రవ్య సంపాదన సాధనాలు లేనివాడూ అయివుంటాడు రెండు హెక్టార్లయినా వుండని చిన్న కమతాలను సేద్యం చేసుకుంటూ రెండు మూడు పశువులను వుంచుకుంటాడు. కొన్ని యూరపుదేశాలలో సగటున యాభై పైగా పశువుల మందలుంటాయి. వానాకాలం లో తప్ప పశువులకు సరిపడంత మేతదొరకదు. వర్తకపు సౌకర్యాలు బొత్తిగా తక్కువ 95 శాతం పశువులు గ్రామాలలో ఉన్నాయి. తమఅవసరాలకి పోగా మిగి లిన పాలని గ్రామీణులు తక్కువ లాభదాయకమైన నెయ్యి రూపేణా అమ్ముతారు. అదైనా ఉత్పత్తిదారుడికి సమమైన ధరరాదు. సార్థకమైన వర్తకపు సంస్థలు లేకపోవడం మూలాన్ని, పశువుల సంఖ్య తక్కువగా వుండడం మూలాన్ని, ధనికులైన మధ్యవర్తులు జొరబడి, పశువులు కలవారి ధనాభావం దొరకబుచ్చుకుని, వారికి వెళ్లవలసిన లాభాలు చాలా వరకు తాము స్వంతం చేసుకుంటారు ఈవిధంగా సేద్యగానికి పశువుల పెంపకంలో ఉండవలసిన ప్రోత్సాహం లేకుండా పోతుంది.

భారతదేశంలో పశువుల పెంపకానికీ వృద్ధికీ గల ఆటంకాలు కేవలం ప్రతికూల శీతోష్ణ, వాతావరణ పరిస్థితులే కావు. అతిపరిమితంగా లభించే మేతలూ, కసవులూ, పశువులయొక్క అల్ప వీర్యశక్తిని కూడా ప్రాథమిక కారకాలు. పశువుల నిసర్గగుణాలు ఏమి అయినప్పటికీ ఆ పశువులకి కావలసినంత మేత సవ్యంగా లభింపజేస్తేగానీ ఫలసాయం విషయంలో సార్థక్యం చేకూరదు. మేత కసవుల కొరతే, బహుశః, భారతదేశ పశువుల యొక్క సమర్థాభివృద్ధికి నిరోధకంగా వున్న ముఖ్య కారణాలు. ఆహారపు ధాన్యాలకు తదితర పంటలకు ప్రస్తుతం వినియోగం అవుతూన్న భూముల్లో నూటికి నాలుగు పాళ్లకన్నా తక్కువ భాగం పశువుల మేతకోసం వినియోగం అవుతూంది. అధికంగా వున్న పశువుల్ని పోషించడానికి ఇది చాలా తక్కువ.

భారతదేశంలో వ్యవసాయం వల్ల వచ్చే రాబడిలో 10.9 శాతం మాత్రం పెంపుడు పశువుల వల్ల లభిస్తోంది. అత్యధికంగా వున్న పశు సంఖ్యని బట్టి చూస్తే, యీ ఆదాయం చాలా తక్కువ. పశ్చిమదేశాల్లో చాలావరకు వ్యవసాయం వల్ల

వచ్చే రాబడిలో పశువుల పెంపకం వల్ల వచ్చే భాగం చాలా ఎక్కువగా ఉంటుంది. ఉదా : డెన్మార్కులో 82 శాతం, ఐరాండులో 81 శాతం, స్వీడన్‌లో 79 శాతం, నార్వేలోనూ, యునైటెడ్ కింగ్‌డమ్‌లోనూ 78 శాతమునూ. భారతదేశంలో పశువుల పెంపకం సక్రమంగా వైజ్ఞానిక పద్ధతులలో నడిపించినట్టయితే మన పశువుల పటుత్వం పెంపొంది, దేశపు ఆర్థిక సంపదకు వీటివల్ల ఇతోధికమైన లాభం కలిగేటట్లు చెయ్యడానికి వీలుంది.

ఈ పుస్తకంలో ఇచ్చిన సమాచారం చదువరులకి దేశంలోగల పశుసంపదను గురించి పరిచయం చెయ్యడమే కాకుండా భిన్నజాతులకి చెందిన పశువుల అలవాట్లూ, వాటి అవసరాలూ, వాటి పటుత్వం ఇతోధికం చెయ్యడానికి కావలసిన కార్యసాధనా. వీటిని గురించి నిర్దుష్టమైన జ్ఞానం ప్రసాదిస్తుందని ఆశిస్తున్నాను.

నిరాశాజనకమైన మనదేశస్థితిని మెరుగుపరిచే అనేక మార్పులు ప్రారంభమయాయి. సహకార సంఘాలు నెలకొన్నాయి. పటిష్టమైన విక్రయ సాధనాలు ఏర్పడ్డాయి. పెంపుడు పశువుల పోషణ, ఆహారం, ఉత్పత్తి, విక్రయముల క్షేత్రాలలో ఎంత వృద్ధిరాగలదో చూపెడుతున్నాయి.

కొత్తఢిల్లీ
ఏప్రిల్ 13, 1986

హర్బన్స్ సింగ్

# నాలుగవ ముద్రణకు ముందుమాట

సాధ్యమైనంత వరకు సేకరించిన స్టాటిటిక్స్ ద్వారా ఈ పుస్తకాన్ని రివిజన్ చేయబడింది. ఇది సామాన్య పాఠకునికి చాలా ఉపయోగంగా ఉంటుందని భావిస్తాను. ఈ గ్రంథ రచయిత హర్బన్స్‌సింగ్ స్వర్గస్థులైన కారణంగా ఎన్.బి.టి. వారు దీనిని రివిజన్ చేయమన్నప్పుడు నేను సంతోషించి అంగీకరించాను. పాఠకునికి అర్థమయ్యే రీతిలో సింగ్‌గారి సరళ భాషలో ఈ పుస్తకాన్ని మీ ముందుంచుతున్నాను.

న్యూఢిల్లీ
13 ఆగస్టు, 1992

బి.పి.యస్. పురి

# I. పశువులు

## ముందు మాట

నాగరికత ప్రాథమిక దశలలోనే మానవుడు పశువులను మచ్చిక చేసుకొని పెంచడం జరిగింది. యుగయుగాల్లోనూ అవి పూజా వస్తువులుగా పురాణాల లోనూ పూజలలోనూ ఇవి చోటు చేసుకున్నాయి. ఈజిప్టు దేశంలోనూ, భారతదేశంలో గల గుహల కుడ్యాలపైన గీచిన బొమ్మలలోనూ, చెక్కిన చిత్రాల లోనూ, పశువులు కాడి పశువులుగా చూపించబడ్డాయి. మొహెంజొదారో-హరప్పాలలో త్రవ్వి తీసిన శిథిలాలని బట్టి, 5000 సంవత్సరాలకి పూర్వమే భారతదేశంలో పశువుల ఉపయోగం తెలుసుకొన్నట్లు వ్యక్తం అవుతోంది. సీజర్ తన రచనల్లో పేర్కొన్న "ఓరోక్స్" అనబడే మహా వృషభమే ఇప్పటి డైరీ పశుసంతతుల యొక్క మూల పశువులలో ఒకటిగా పరిగణించబడింది.

గేదెలు పెంపుడు జంతువులుగా కనబడే కొద్ది దేశాలలోనూ భారతదేశం ఒకటి బహుళ సంఖ్యాకంగా గేదెలు కలిగిన తదితర దేశాలు చైనా, తాయ్‌లాండు, పాకిస్తాన్, నేపాల్, ఇండోనేషియా, మలేషియా ఫిలిప్పీన్సున్నూ సాధారణంగా భారతదేశంలో కానవచ్చే గేదెలు యూరపుదేశాలలో అవుపించవు. అమెరికాలో ఉన్న గేదె వాస్తవంగా బైసన్ జాతికి చెందింది. అడవి గేదెలు సాధారణంగా చిత్తడినేల ప్రాంతాలు గల చిట్టడవుల్లో ఉంటాయి. అడవి గేదెలకు పెంపుడు గేదెలకు గల భేదం ఏమిటీ అంటే అడవి గేదెకన్నా పెంపుడు గేదెకి శరీరం, కొమ్ములూ చిన్నవి.

భారతదేశపు మొత్తం పశు సంఖ్యలో 22.6 శాతం గేదెలు. దేశం మొత్తం మీద లభించే పాలలో 56 శాతం వీటివల్ల లభిస్తుంది. సగటున గేదె ఆవుకన్నా ఇంచుమించుగా మూడు రెట్లు అధికంగా పాలు ఇస్తుంది. ఆవు పాలకన్నా గేదె పాలు ఎక్కువ పుష్టికరం; ఆవు పాలకన్నా గేదె పాలల్లో 50 శాతం ఎక్కువగా కొవ్వు పదార్థం ఉంటుంది. ఎనుము బలిష్ఠమైన పశువు. దాని చలనం నెమ్మదిగా ఉన్నప్పటికీ, అది అమితమైన బరువును మిక్కిలి దూరం లాగగలదు.

భారతదేశపు గ్రామీణ ఆర్థిక సంపదకి పశువులు ఆయువు పట్టు. వ్యవసాయపు పనులలో సంచారక శక్తి ప్రధానంగా ఎడ్లవల్ల లభిస్తుంది. చాలామంది ఆహారంలో పాశ్విక ప్రొటీన్లు పాలవల్లనే లభిస్తాయి. పశువుల గెత్తం వల్ల పొలాలు పునఃసారవంతం అవుతాయి; పశువు చనిపోయిన పిమ్మటకూడా దాని తోలూ, చర్మమూ ఉపయోగపడతాయి. కృషీవలుడికి భూమి తరువాత, అతి అమూల్యమైన ఆస్తి పశువులు. అవి అతనికి అనేక విధాలుగా ఉపయోగపడతాయి. వాటిని అతడు దున్నడానికీ, దంతి తోలడానికీ, నూర్పుకీ, పంటకోతల పనులకు నీరు తోడడానికీ, పలు దినుసులు బజారుకు రవాణా చెయ్యడానికీ వినియోగించుకుంటాడు. పొలం పనులకు, ఇతర వ్యవసాయ సంబంధమైన పనులకు గాను మొత్తం మీద సాలీనా 12,000 మిలియన్ల గంటల పని ఎడ్లవల్ల జరుగుతుందని అంచనా కట్టబడింది.

గత కొద్ది ఏళ్ళ ధోరణిని బట్టి చూస్తే, రోడ్డు రవాణా పనులకు ఎడ్లకి బదులుగా యాంత్రిక వాహనాలు ఎక్కువగా వాడుక అవుతూన్నట్లు తెలుస్తుంది. అయితే అచిర భవిష్యత్తులో వ్యవసాయానికి ట్రాక్టర్లను అధిక సంఖ్యలో ఉపయోగించడానికి చిన్న చిన్న కమతాలు ఇంధనమూ ఉక్కూ పరిమితంగా ఉండడం, వ్యవసాయేతర వృత్తులు లేకపోవడం మొదలయిన - ప్రతిబంధకాలు కనిపిస్తున్నాయి. భారతదేశంలోని వ్యవసాయ రంగంలో ఎడ్లు ఎక్కువగా ఉపయోగించబడుతున్నాయి. 1987-88 సం॥ లో భారతదేశంలో పాల ఉత్పత్తి 45.5 మి.టన్నులు. పాలల్లో ఎక్కువభాగం, అనగా 8 136 మి.టన్నులు ఉత్తరప్రదేశ్‌లో ఉత్పత్తి అయ్యాయి. రాష్ట్రాలవారీగా పంజాబు 4.132 మి.టన్నులూ, రాజస్థాన్ 4.0 మి.టన్నులూ, మధ్యప్రదేశ్ 3.22 మి.టన్నులూ, గుజరాత్ 2.997 మి.టన్నులూ, ఆంధ్రప్రదేశ్ 2.98 మి టన్నులూ ఉత్పత్తి అయ్యాయి. హర్యానా, కర్నాటక, మహారాష్ట్ర మరియు తమిళనాడు మొదలైన రాష్ట్రాలలో పాల ఉత్పత్తి సక్రమంగా ఉన్నట్లు కనబడుతుంది. 1991-92 సం॥ లో దేశంలోని మొత్తం పాల ఉత్పత్తి 54.5 మిలియన్ టన్నులు. 2000 సం॥ లకు భారతదేశంలోని పాల ఉత్పత్తి 50 శాతం పెరగగలదని అంచనా వేయబడింది.

1982 సం॥ ము పశువుల సెన్ససు ప్రకారం, భారతదేశంలో 262.23 మిలియన్ల పశువులు ఉన్నాయి. వీటిలో గేదెలూ (ఎనుములు) వాటి సంతతీ

69.78 మిలియన్లు. ఆవులూ, ఎడ్లూ, దూడలూ 1977 లో కంటె 6.83 శాతమున్నూ, గేదెలూ వాటి సంతతీ 12.5 శాతమున్నూ పెరిగిందని ఈ లెక్కల్ని బట్టి తెలుస్తోంది. మూడేళ్లకి పైబడ్డవి 58.68 మిలియను ఆవులూ, 32.39 మిలియను గేదెలూ ఉన్నాయి. వీటిలో 26.59 మిలియను ఆవులూ, 17.99 మిలియను గేదెలూ పాడి పశువులు.

రాష్ట్రాలవారీగా చూసినట్లయితే పశువుల సంఖ్య 13.22 మిలియన్లు ఆంధ్రప్రదేశ్‌లోనూ, 6.75 మిలియన్లు అస్సాములోనూ, 16.21 మిలియన్లు బీహారులోనూ, 6.99 మిలియన్లు గుజరాత్‌లోనూ, 2.34 మిలియన్లు హర్యానాలోనూ, 2.17 మిలియన్లు హిమాచల్‌ప్రదేశ్‌లోనూ, 2.33 మిలియన్లు జమ్మూ,కాశ్మీర్‌లోనూ, 11.3 మిలియన్లు కర్నాటకలోనూ, 27.17 మిలియన్లు మధ్యప్రదేశ్‌లోనూ, 16.16 మిలియన్లు మహారాష్ట్రలోనూ, 12.93 మిలియన్లు ఒరిస్సాలోనూ, 3.26 మిలియన్లు పంజాబులోనూ, 13.5 మిలియన్లు రాజస్థానులోనూ, 10.37 మిలియన్లు తమిళనాడులోనూ, 26.15 మిలియన్లు ఉత్తరప్రదేశ్‌లోనూ, మరియు 15.66 మిలియన్లు పశ్చిమబెంగాలు లోనూ ఉన్నాయి.

ఈ రీతిగానే అధిక సంఖ్యాకంగా మహిష సంపద 8.7 మిలియన్లు ఆంధ్రప్రదేశ్‌లోనూ, 0.56 మిలియన్లు అస్సాములోనూ, 4.64 మిలియన్లు బీహారులోనూ, 4 44 మిలియన్లు గుజరాత్‌లోనూ, 3.37 మిలియన్లు హర్యానాలోనూ, 0.62 మిలియన్లు హిమాచల్‌ప్రదేశ్‌లోనూ, 0.56 మిలియన్లు జమ్మూ,కాశ్మీర్‌లోనూ, 3.65 మిలియన్లు కర్నాటకలోనూ, 0 41 మిలియన్లు కేరళలోనూ, 6.44 మిలియన్లు మధ్యప్రదేశ్‌లోనూ, 3.97 మిలియన్లు మహారాష్ట్రలోనూ, 1.33 మిలియన్లు ఒరిస్సాలోనూ, 4.59 మిలియన్లు పంజాబులోనూ, 6.04 మిలియన్లు రాజస్థాన్‌లోనూ, 3.21 మిలియన్లు తమిళనాడులోనూ, 15.79 మిలియన్లు ఉత్తరప్రదేశ్‌లోనూ, మరియు 0.99 మిలియన్లు పశ్చిమబెంగాలులోనూ ఉన్నాయి.

## పశువులలో ముఖ్యమైన జాతులు

ప్రపంచంలో గల గోజాతుల సంఖ్య ఆశ్చర్యం గొలిపేటంత అధికంగా ఉంది. యూరపు దేశంలోనే 40-50 విస్పష్టమైన జాతులవరకూ ఉన్నాయి.

ఒక్క గ్రేటుబిటనులో అక్కడి అవసరాలని పురస్కరించుకొని జనింపచేసినవి పదకొండు జాతులున్నాయి.

భారతదేశపు గోవులు చాలావరకు జాతి పశువులు కాకపోయినా, స్పష్టంగా నిర్ణీతం అయినవి 26 గోజాతులూ, 6 మహిషజాతులూ దేశం అంతటా వ్యాపించి ఉన్నాయి. / వీటిని పాడిపశువులూ, కాడి పశువులూ, ఉభయ జాతులకీ చెందినవి అని విభజించవచ్చును. ఉభయజాతులకి చెందిన వాటిలో పాడిపశువులు పాలు ఇంచుమించుగా అధికంగానే యిస్తాయి. ఎడ్లు కాడిపనులకి బాగా ఉపయోగపడతాయి. ఎర్రసింధీ, సాహివాల్, థర్పార్కర్ జాతుల అసలు పుట్టుకస్థానం పాకిస్తానులో ఉంది. కాని ఈ జాతిల నుంచి జనింపచేసిన ఎన్నో మందలు ప్రస్తుతం భారతదేశంలో పెంచబడుతున్నాయి

అమృతమహల్ జాతి మైసూరు రాష్ట్రానికి చెందిన ప్రత్యేకపు కాడి పశువు జాతి. ఈ పశువులు ఉద్ధృతంగానూ, చురుకుగానూ ఉంటాయి. సహన శక్తికి ఇవి పెట్టింది పేరు: ఈ జాతి ఎడ్లు ముఖ్యంగా త్వరితగమనానికీ, శీఘ్రపు రవాణాపనులకీ అనుగుణంగా ఉంటాయి. సామాన్యంగా యీ జాతి ఆవులు పాలు ఎక్కువ ఇవ్వవు.

అమృతమహల్ జాతి పశువుల తల సన్నగా సుందరాకారంలో ఉంటుంది నుదుటిపై లోతుగా ముడతలు ఉంటాయి. వీటి కళ్లు చురుకుగా ఉంటాయి; ఒక్కొక్కప్పుడు ఇవి ఎర్రవాగుగా ఉండడం కూడా కద్దు. వీటి పొట్ట పొడవుగా గుండ్రంగా ఉంటుంది. బొడ్డుచర్మం బాగా పైకి మణిగి ఉంటుంది. వీటికాళ్లు అంత పొడవూ మరీ పొట్టిగానూ కాకుండా మధ్యమ పరిమాణంలో శరీరానికి ఒప్పి ఉంటాయి. డెక్కలు సన్నటి చీలికలతో నల్లగా గట్టిగా ఉంటాయి. దీని తోక నాతిలంబంగా సుందరంగా ఉంటుంది. వీటిది ఇమిడిక అయిన చిన్న పొదుగు; సిరాల చిన్నవీ, గట్టివిన్నీ. సాధారణంగా యీ జాతి పశువులు తెల్లగా ఉంటాయి. ఒక్కొక్కప్పుడు బూడిద రంగులో కూడా ఉండడం కద్దు.

బచుఆర్ అన్నది బీహారులో సితామర్హి జిల్లాకి చెందిన మధ్యమ రకపు కాడి పశువు జాతి. నాసిరకపు మేత ఉన్నా కూడా యీ పశువులు పెంపొందుతాయి. ఈ జాతి ఎడ్లు పనిపాటులకి బాగా ఉపకరిస్తాయి. ఈ ఆవులు పాలు అట్టే ఇవ్వవు.

ఈ జాతి పశువుల ముఖ్య లక్షణాలు అంత మరీ పెద్దదీ మరీ చిన్నదీ కాక మధ్యమ పరిమాణంలో ఉండే తల, విశాలమైన నొసలు, వంగి ఉండే పెద్ద చెవులు; ముందుకి వంగి లావుగా పెరిగిన కొమ్ములు, వ్రేలబడే గంగడోలు; దృఢమైన శరీరం, పైకి అణిచిపెట్టి అల్పంగా ఉండే కోశం, బలంగా సౌష్ఠవంగా ఉండే కాళ్లూ, నల్లటికుచ్చుతో లావుగా ఉండే కురుచనైన తోక. ఈ జాతి పశువులు సామాన్యంగా బూడిదరంగులో వుంటాయి.

బర్గూరు పశువులు మద్రాసురాష్ట్రంలో గల కోయంబత్తూరు జిల్లాలోని బర్గూరు కొండ ప్రాంతాలనుంచి వచ్చేయి. వీటికి హాల్లికార్ పశువులకి దగ్గర పోలికలున్నాయి. ఈ జంతువు చిన్నది. దృఢమైనది. ఆకర్షణీయంగా ఉంటుంది. ఉద్వృతస్వభావం కలిగి ఉండడం చేత వీటిని లొంగదీయడం కష్టం. ఈ జాతి పశువుకి సహనశక్తి ఎక్కువ. త్వరితగమనానికి ఇవి పేరుపడ్డాయి. ఈ జాతి ఆవులు పాలు ఎక్కువ ఇవ్వవు.

ఈ జాతి పశువులకి తల పెద్దది. విశాలమైన నొసలు. ఆ నొసలు, కొమ్ముల మధ్య నున్న ప్రాంతంలో, లోతైన ముడుత ఉంటుంది. వీటి కొమ్ములు, మొలిచిన చోటు నుంచి వెనుకకు పెరిగి ఊర్ధ్వముఖంగా వంకర తిరిగి ఉంటాయి. ఎర్రబారిన కళ్లు, దృఢమైన శరీరం, కాస్త పల్చనికోశం; గట్టి డెక్కలుగల పొట్టి కాళ్లు, ఆదోకగా ఉండే కురచని తోక ఉంటాయి. దీని పాడుగు బాగా ఎదిగి ఉండదు. సిరాలు చిన్నవి. సామాన్యంగా వీటి శరీర వర్ణం తెలుపు. బూడిదరంగులో ఉన్నవికూడా ఉన్నాయి.

డాంగీ మధ్యమ పరిమాణం గల పశువు. ఇది అహమ్మదనగరులో గల అకోలాతాలూకా, నాసిక్‌ఘాట్ ప్రాంతాలూ, థాణా కొలాబా జిల్లాలూ, పూర్వపు బరోడా డాంగ్సు సంస్థానాల నుంచీ వచ్చింది. ఈ జాతి పశువు చాలా దృఢమైనది. వర్షాలు ఎక్కువ పడే తావులలో బాగా వృద్ధి అవుతుంది. ఈ జాతి ఎద్దు ముఖ్యంగా వరి పొలాల్లో పనిచెయ్యడానికి బాగా పనికివస్తాయి. కాని ఈ జాతి ఆవులు పాలు ఎక్కువ ఇవ్వవు.

ఈ జాతి పశువుల లక్షణాలు : చిన్నతల, గుబురుగా ఉండే నొసలు, పొడుగాటి ముఖము, లావుగా కురచగా ఉండే కొమ్ములు, పొడవుగా భారీగా ఉండే శరీరం, కురచనైన కాళ్లు, బలిష్ఠములైన మక్కలున్నూ. సాధారణంగా యీ జాతి పశువు లక్కరంగులోనో, గోధుమ రంగులోనో, లేదా నలుపూ తెలుపు మచ్చలు కలిసో ఉంటుంది.

దేవణీ జాతి పశువు మాధ్యమిక పరిమాణం కలది. ఈ జాతి ఆంధ్రప్రదేశ్ యొక్క పశ్చిమ, వాయువ్య ప్రాంతాల నుంచి వచ్చింది. ఈ జాతి పశువులు చాలా వరకు గీర్ జాతి పశువుల్ని పోలి ఉంటాయి.

ఈ జాతి పశువుల తల మధ్యమ పరిమాణంలో ఉంటుంది. కొంచెం ఎత్తైన నొసలు, వాలి ఉండే చెవులున్నూ, ఊర్ధ్వముఖంగా వెనుకకి పెరిగే లావుపాటి కొమ్ములు, ఉలి ఆకారంలో ఉండే పొట్ట, ఆదోకగా ఉండే పొడుగాటి తోక, చక్కగా అమిరిఉన్న సిరాలతో అంత మరీ పెద్దదీ అంత మరీ చిన్నదీ కాని దృఢమైన పొదుగు వీటికి ఉండే లక్షణాలు. ఈ జాతి పశువులు భిన్నభిన్న వర్ణాలలో ఉంటాయి; తెలుపూ, నలుపూ; ఎరుపూ - తెలుపు రంగులు వీటిలో సాధారణంగా కానవస్తాయి.

గౌలౌ జాతి, కాడిపశువులూ పాడిపశువులూ అనే రెండు రకాలకీ చెందిన జాతి. ఈ జాతిపశువులు మధ్యప్రదేశ్‌లో గల వార్ధా, చింద్వారా జిల్లాలలో కానవస్తాయి.

ఈ జాతి పశువు ముఖ్యలక్షణాలు : సన్నని పొడుగాటి ముఖం; కురచైన కొమ్ములు; పొట్టిచెవులు; సన్నగా పొడుగ్గా వుండే శరీరం; కురచనై కండర పుష్టితో వున్న అవయవాలు; సమప్రమాణంలో వున్న కోశం; పొట్టిగా వుండే తోక, ఆవులు సాధారణంగా తెలుపురంగులో వుంటాయి. ఎడ్లు, గళభాగం, మూపురం, ముక్కలూ బూడిదరంగు గలిగి వుంటాయి.

గీర్ జాతి మధ్యమ పరిమాణంలో వుండే పశువు ఇది దక్షిణ కథియవారులో గల గీర్ వనప్రాంతాలలోనూ, జునాఘర్ లోనూ కానవస్తుంది పశ్చిమ రాజస్థానంలోనూ, మహారాష్ట్రపు వుత్తర భాగాలలో కూడా యీ జాతి కనిపిస్తుంది. ఈ జాతి ఆవులు అధికంగా పాలు యిస్తాయి

ఈ పశువులకి లావాటి తల, బాగా విశాలమైన నొసలు, ముట్టుకుపోయిన ఆకులాగ కనిపిస్తూ పొడుగ్గా వేలబడి వుండే చెవులూ, ఆ చెవి కొసని ఒక గంటూ వుంటాయి. వీటి కొమ్ములు కొంచెం దళంగా వుండి, ఊర్ధ్వముఖంగా వెనక్కి పెరిగి, ముందుకు వంగి ముట్టుకుపోయి వుంటాయి. వీటి పొట్ట పొడవుగా, లావుగా, గుండ్రంగా వుంటుంది. వీటికాళ్లు సౌష్ఠవం కలిగి సమపరిమాణంలో వుంటాయి. చక్కగా అమిరిన సిరాలతో దీని పొదుగు పూర్ణంగా వుంటుంది. గీర్‌జాతి పశువులు భిన్నభిన్న వర్ణాలతో వుంటాయి

కాని సాధారణంగా వీటిరంగు లక్కరంగు, లేదా నలుపు, తెలుపు-ఎరుపు, తెలుపు కలిసిన రంగు. ఎరుపు-తెలుపు మచ్చలతో వున్నవికూడా వున్నాయి.

హల్లికర్ జాతి మైసూరురాష్ట్రంలో హస్సన్, తుమ్కూరు జిల్లాలలో కానవస్తుంది. దక్షిణదేశంలో కాడిపశువులలో పేరుపడ్డ జాతి ఇది. పొలం పనికీ, రోడ్డు రవాణా పనులకికూడా ఇవి వుపయోగపడతాయి. ఈ జాతి ఆవులు పాలు ఎక్కువగా ఇవ్వవు.

ఈ జాతి పశువుల లక్షణాలు : పొడుగాటి తల, విశాలమైన నొసలు, నొసటమధ్యని స్పష్టంగా ఒక ముడత. దీని కొమ్ములు దగ్గరిగా వుంటాయి. తలనుంచి అవి తిన్నగా వెనుకకి పెరిగి, మెడకి ఇరుప్రక్కలా సొంపుగా ప్రసరించి, సూదిగా వున్న కొనలతో కాస్త ఊర్ధ్వముఖంగా లేచి వుంటాయి. నాభి చక్కగా పైకి మణిచిపెట్టి వుంటుంది. వీటి శరీరం పొడవుగానూ దృఢంగానూ వుంటుంది. వీటికాళ్లు సన్నగా పొడవుగా వుంటాయి. వీటి తోక అందంగా వుంటుంది. పొదుగు చిన్నదీ, దృఢం అయినదిన్నీ. ఈ పశువులు కృష్ణవర్ణంలో గాని, లేత బూడిదరంగులోగాని వుంటాయి. ముఖం దగ్గర, గంగడోలు పైనా తెల్లటి మచ్చలు వుంటాయి.

హరియానా జాతిలో కాడిపశువులూ పాడి పశువులూ వున్నాయి. ఇది పంజాబులో గల రోహతక్, కర్నాల్, హిస్సార్, గుర్‌గావ్ జిల్లాలలోనూ, ఢిల్లీ ప్రాంతాలలోనూ, ఉత్తరప్రదేశ్ పశ్చిమ భాగంలోనూ కానవస్తుంది. ఈ జాతి ఎద్దు బలిష్ఠమైన పశువులు. ఇవి రోడ్డు రవాణా పనులకీ, త్వరిగతిని పొలం దున్నడానికీ పనికివస్తాయి. ఈ జాతి ఆవులు పాలు ఎక్కువగా ఇస్తాయి.

ఆ జాతి పశువుల తల చిన్నగా వుంటుంది. సన్నటి పొడుగాటి ముఖం వుంటుంది. కొమ్ములు కురచగానూ ఇంచుమించుగా తిన్నగానూ పెరిగి వుంటాయి. ఎద్ల కొమ్ములు, ఆవుల కొమ్ముల కన్న పొడవుగా వుండి, ఊర్ధ్వ ముఖంగా పెరిగి లోపలికి వంగివుంటాయి. ఈ పశువుల పొట్ట పొడవుగా, దృఢంగా వుంటుంది. చక్కటి డెక్కలతో కాళ్లు బలంగా పొడవుగా వుంటాయి. వీటి తోక కురచగా అందంగా వుంటుంది. ఈ జాతి ఆవుల పొదుగు, స్ఫుటమైన సిరాలతో పూర్ణంగా ఎదిగివుంటుంది. ఈ పశువులు సాధారణంగా తెలుపురంగులో కాని, లేత బూడిదరంగులో కాని వుంటాయి.

కంగాయం జాతి మధ్యమ పరిమాణంలో వుండే పశువు. కాడి జాతికి చెందిన పశువు ఇది. మద్రాసు రాష్ట్రంలో గల కోయంబత్తూరు జిల్లా యొక్క

ఆగ్నేయపు తాలూకాలలో కానవస్తాయి యీ జాతి పశువులు. ఈ జాతి ఎడ్లు బలిష్ఠం అయినవీ, చురుకైనవిన్నీ. భారమైన కాడి పనులకీ, రోడ్డు రవాణా పనులకీ ఇవి పనికివస్తాయి. ఈ జాతి ఆవులు పాలు ఎక్కువగా ఇవ్వవు.

కంగాయం జాతి పశువులకీ తల పొట్టి, నొసలు విశాలమున్నూ. వీటి కొమ్ములు ఊర్ధ్వముఖంగా వెనక్కి పెరిగి, ఇంచుమించుగా పూర్ణ వర్తులాకారంలో కొనల వద్ద కలుసుకుంటాయి. వీటి పొట్ట దృఢంగా, అనతిదీర్ఘంగా వుంటుంది. కాళ్లు పొట్టి; కోశం చిన్నది. తోక సమపాళంలో పొడవుగా వుంటుంది. ఈ జాతి ఆవుల పొదుగు, చిన్న సిరాలతో మధ్యమ పరిమాణంలో వుంటుంది. ఈ జాతి ఆవుల పొదుగు, చిన్న సిరాలతో మధ్యమ పరిమాణంలో వుంటుంది. ఈ పశువులు సాధారణంగా తెలుపు రంగులో కాని, లేదా మోకాళ్లపైన, చీలమండల వెనక తట్టున నల్లటి మచ్చలతో బూడిదరంగులో కాని వుంటాయి. దూడలు, పుట్టినప్పుడు ఎరుపురంగులో వుండి, సుమారు నాలుగు నెలల వయస్సు పైబడిన తరువాత, తెలుపురంగులోకి మారతాయి.

కంక్రెజ్ జాతి మిక్కిలి పెద్దదిగానూ, మిక్కిలి పటువుగానూ ఉండే పశుజాతుల్లో ఒకటి. ఈ జాతి పశువు కచ్చి బాడవయొక్క ఆగ్నేయ భాగంలోనూ, తూర్పున దెస్సా మొదలు పశ్చిమాన్ని పూర్వపు రాధన్పూరు రాష్ట్రపు చివరివరకు గల ప్రదేశంలోనూ కానవస్తుంది. ఈ జాతి ఎడ్లు త్వరితమైనవీ, చురుకైనవీ, బలమైనవిన్నీ. పొలం దున్నడానికీ, బండి లాగడానికీ కూడా ఇవి పనికి వస్తాయి. ఈ జాతి ఆవులు పాలు ఇంచుమించుగా ఎక్కువగానే ఇస్తాయి.

ఈ జాతి పశువులకి ముఖం సన్నగా ఉంటుంది. కొంచెం లోతైన వెడల్పయిన నొసలు పెద్ద కళ్లు వుంటాయి. కంటి రెప్పలపైన ముడుతలుంటాయి. వీటి కొమ్ములు బలంగా, ఒకదాని కొకటి అనురూపంగా ఉండి, ఎత్తుగా పైకి బయటికి పెరిగి, పిదప కొనదేరి లోపలికి చుట్టుకొని వుంటాయి. పొట్ట పొడవుగా, లావుగా, దృఢంగా వుంటుంది. కాళ్లు గట్టి డెక్కలు గలిగి బలంగా తిన్నగా వుంటాయి. పొదుగు చక్కటి ఆకారంలో మధ్యమ పరిమాణంలో వుంటుంది. ఈ జాతి పశువులు సాధారణంగా లేత బూడిదరంగులో కాని గాఢమైన బూడిదరంగులో గాని వుంటాయి. ఎడ్లకన్నా

ఆవులది లేతరంగు. కొత్తగా పుట్టిన దూడలకి ముఖము సాధారణంగా ఎరుపు రంగులో వుంటుంది. కాని ఆరు నెలలు వచ్చేసరికి ఆ రంగు పోతుంది.

కెంకథా (కెంవరీయ) జాతి పశువులు ఉత్తరప్రదేశ్‌లో బుందేల్‌ఖండ్ జిల్లాలోనూ, బండా జిల్లాలో గల "కెన్" నదీ ప్రాంతాలలోనూ కానవస్తాయి. వింధ్యప్రదేశ్‌లో పన్నా, బిజెపూర్, చర్‌ఖారీ జిల్లాల్లో కూడా ఇవి వున్నాయి. ఈ జాతి ఎడ్లు తేలిక అయిన కాడిపనికి పనికివస్తాయి. ఈ జాతి ఆవులు పాలు తక్కువగా యిస్తాయి.

ఈ జాతి పశువుల ముఖ్యలక్షణాలు : పొట్టిగా వుండే తల, విశాలం అయిన నొసలు; తలనుంచి ముందకు పెరిగే కొమ్ములు; లావుగా దృఢంగా వుండే శరీరం, మధ్యమ పరిమాణంలో వుండే కోశం, కురచగా బలిష్ఠంగా వుండే కాళ్లు, కాస్త పొడుగు అనిపించే తోక. ఈ పశువులు సాధారణంగా గాఢమైన బూడిదరంగులో వుంటాయి.

ఖేరీగర్ జాతి ఉత్తరప్రదేశ్‌లో లఖ్కింపూరు ఖేరీజిల్లాలో కానవచ్చే పశుజాతి. ఈ ఎడ్లు తేలిక పనులకి బాగా వుపయోగపడతాయి. ఆవులు పాలు ఎక్కువగా ఇవ్వవు

ఈ జాతి పశువుల లక్షణాలు : మధ్యమ పరిమాణంలో వుండే తల, సన్నగా బాగా పొడుగుగానూ నిలువుగానూ వుండే కొమ్ములూ, వెడల్పుగా స్థూలంగా వుండే కడుపూ, తేలికగా వుండే అవయవాలూ, సన్నగా పొడవుగా వుండే తోక. ఈ పశువులు సామాన్యంగా తెలుపురంగులో వుంటాయి.

ఖిల్లారీ అనేది మధ్యమ పరిమాణంలో వుండే దృఢమైన కాడిపశువు జాతి. ఇది పూర్వపు బొంబాయి రాష్ట్రంలో గల సాత్పూరా పర్వత ప్రాంతాల లోనూ, షోలాపూరు సతారా జిల్లాలలోనూ కానవస్తుంది. మోటుగా వుండే స్కంధభాగం, పెద్దదిగా వుండే ఆకారం తప్పిస్తే, ఈ పశువులు అమృతమహల్ జాతి పశువులని పోలి వుంటాయి. ఈ జాతి ఎడ్లు వడీ, పటుత్వమూ గల కాడి పశువులు. ఈ జాతి ఆవులు పాలు అధికంగా ఇవ్వవు.

ఈ జాతి పశువులకి లావుపాటి తల వుంటుంది. నొసలు మధ్య భాగంలో లోతుగా ముడుత ఒకటి వుంటుంది. వీటి కొమ్ములు తలనుంచి పైకి పెరిగి ఒక దానికి ఒకటి దగ్గరగా, పొడవుగా, సూదిగా వుంటాయి. వీటి కడుపు పొడవుగానూ, దృఢంగానూ వుంటుంది. బలిష్ఠమైన కాళ్లూ, చిన్నకోశం, సన్నగా కురచగా వుండే తోక వుంటాయి. ఈ జాతి ఆవులకి

పొదుగూ, సిరలూ చిన్నవి. సాధారణంగా యీ జాతి పశువులు బూడిదరంగు కలిసిన తెలుపు రంగులో వుంటాయి.

కృష్ణాలోయ (కృషావాలీ) జాతి మునుపటి బొంబాయి రాష్ట్రపు దక్షిణ భాగాల్లోనూ, హైదరాబాదులోనూ గల కృష్ణానదీ లోయ ప్రాంతాలలో కానవస్తుంది. చాలావరకు యీ పశువులు షోలాపూరు, మిరజ్, సాంగ్లి, బెల్గాం, సతారా, ధార్వారు జిల్లాలలో ఎక్కువగా కానవస్తాయి. నల్లరేగడి మట్టిగల భూములలో పని చెయ్యగల శక్తి యీ జాతి ఎడ్లకి వుండడం వల్ల, వీటికి ఎక్కువ నాణ్యత. ఈ జాతి ఆవులు పాలు కాస్త అధికంగానే యిస్తాయి.

ఈ జాతి పశువులకి తల చిన్నదిగా వుంటుంది; విశాలం అయిన నొసలు. వీటి కొమ్ములు ఊర్ధ్వముఖంగా వెలుపలికి పెరిగి కురచగానూ లావుగానూ వుంటాయి. కడుపు లోతుగానూ, కాళ్లు కండరపుష్టి గలిగి బలిష్ఠంగానూ వుంటాయి. దీని తోక సన్నగా వుండి, ఇంచుమించు గుదికాలుని అంటుతూ వుంటుంది. సామాన్యంగా యీ పశువులు బూడిదరంగు కలిసిన తెలుపు రంగులో వుంటాయి. ఎడ్లలో మాత్రం ఈ రంగు, ముఖపృష్ఠ భాగాలలో ఇంకా ముదురుగా వుంటుంది.

మాల్వీ జాతి మధ్యమ పరిమాణంలో వుండే కాడి పశువుల జాతి. వెనుకటి గ్వాలియరు, ఇందూరు, భోపాలు సంస్థానాలూ, మధ్య భారతదేశాన్ని అంటి వున్న ప్రాంతాలూ కలిసి మాల్వా అనబడే ఈ ప్రదేశంలో యీ జాతి కానవస్తుంది. ఈ జాతి ఎడ్లు కాడిపనులకి, ముఖ్యంగా నల్లరేగడి మట్టిలో పని చెయ్యడానికి పేరుపడ్డాయి. ఈ జాతి ఆవులు పాలు ఎక్కువగా ఇవ్వవు.

ఈ జాతి పశువుల లక్షణాలు తల చిన్నది; లోతైన ముఖం; కొమ్ములు తలనుంచి పైకి మొలచి, వెలుపలికి వంకర తిరిగి వుంటాయి; లావుపాటి దృఢం అయిన శరీరం; బలంగానూ, కురచగానూ, పటువుగానూ వుండే కాళ్లు; ఇంచుమించుగా చీలమండలకి తగిలే పొడవాటి తోక, సాధారణంగా ఈ పశువులు బూడిదరంగులో వుంటాయి; మెడపైన స్కంధ భాగంపైన, మూపురం మీదా, మక్కలమీదా నల్లటిమచ్చలు వుంటాయి. వయస్సు పైబడిన కొద్దీ పశువు రంగు మారుతుంది.

మేవతి (కోసి) జాతి మధుర జిల్లాలో వున్న కోసి ప్రాంతంలోనూ, పూర్వపు భరతపూరు, అల్వారు సంస్థానపు ప్రాంతాలలోనూ కానవస్తుంది. ఈ జాతి ఎడ్లు పొట్టిగా వుంటాయి – అయినప్పటికీ, బరువైన నాగలి పనికీ,

బండి పనులకి వుపయోగపడతాయి. ఈ జాతి ఆవులు ఇంచుమించుగా పాలు యెక్కువ గానే యిస్తాయి.

ఈ పశువుల తల మధ్యమ పరిమాణంలో వుంటుంది. విశాలమైన నొసలు; కొమ్ములు లావుగా వుంటాయి. ఇవి తల నుంచి వెలుపలికి తిన్నగా పెరిగి వంకరలు తిరిగి వుంటాయి. కడుపు పొడవుగా, లావుగా వుంటుంది. కాళ్లు పొట్టిగా అందంగా వుంటాయి. తోక సన్నగా, పొడవుగా వుంటుంది. సిరాలు మధ్యమ పరిమాణంలో ఉంటాయి. సాధారణంగా ఈ పశువుల తల, మెడ, స్కంధభాగం, మక్కలవద్ద నల్లగా వుండి, మిగతా శరీరం అంతా తెల్లగా వుంటుంది.

నగోర్‌జాతి రాజాస్థానంలో గల నగోర్, జోద్పూరు జిల్లాలకి చెందిన కాడి పశువుజాతి. ఈ జాతి ఎడ్లు భారీగానూ, పటువుగానూ, చురుకుగానూ వుంటాయి. వీటికి దట్టంగా ఇసుక వున్న నేలల్లో బరువులు లాగే సమర్థత వుంది. ఇవి బాగా చురుకుగా పరిగెత్తగలవు. అంచేత, త్వరితంతో కూడుకొన్న రోడ్డు పనులకి వీటి నాణ్యత ఎక్కువ. ఈ జాతి ఆవులు పాలు అధికంగా ఇవ్వవు.

ఈ జాతి యొక్క ముఖ్య లక్షణాలు : చిన్న తల; బల్లపరుపుగా వుండే నొసలు; వెలుపలికి తిన్నగా పెరిగి, వెనుకకి తిరిగి పోయేలాగ చుట్టుకొని వుండే లావుపాటి కొమ్ములు; పొడవుగా, దృఢంగా వుండే శరీరం; బలిష్ఠమైన కాళ్లు; అణిగివున్న కోశం; పొట్టి తోక. సామాన్యంగా ఈ పశువులు తెలుపు రంగులో వుంటాయి.

నిమారీ అనే కాడి పశువు జాతి నర్మదా నదీ ప్రాంతాలలో కానవస్తుంది. ఈ పశువులు చాలా చురుకైనవి. ఈ జాతి ఎడ్లు కాడి పనులకి నాణ్యత కెక్కాయి. ఆవులు పాలు అధికంగా ఇవ్వవు.

ఈ జాతి పశువులకి పొడవైన తల, ఉబికి ఉన్నట్టుండే నొసలున్నూ-వీటి కొమ్ములు మధ్యమ పరిమాణంలో పైకి వక్రువగా లేచి, వెలుపలికి వ్యాపించి, కొనల వద్ద వెనుకకు వంగి వుంటాయి. వీటి శరీరం పొడవుగానూ, స్థూలంగానూ వుంటుంది. పొదుగు బాగా ఎదిగి వుంటుంది. ఎడ్లకి కోశం కాస్త వ్రేలాడుతూ వుంటుంది. అవయవాలు బలిష్ఠంగా వుంటాయి. ఈ జాతి పశువులు, వివిధ భాగాలలో తెల్లటి మచ్చలు గలిగి, ఎర్ర రంగులో ఉంటాయి.

ఒంగోలు (నెల్లూరు) జాతి ఆంధ్రదేశంలో నెల్లూరు, గుంటూరు జిల్లాలలో కానవస్తుంది. కృష్ణా గోదావరీ మెరక తాలూకాలలో కూడా ఈ జాతి ఎడ్లు భారీ అయినవి; శక్తివంతం అయినవిన్నీ. ఇవి బండి లాగడానికీ, బరువైన నాగలి పనులకీ ఉపయోగపడతాయి. సామాన్యంగా వీటిని శీఘ్రగమనపు పనులకై వినియోగిస్తారు. ఈ జాతి ఆవులు సామాన్యంగా పాలు అధికంగా ఇస్తాయి.

ఈ జాతి పశువులు ముఖ్య లక్షణాలు : మధ్యమ పరిమాణంలో ఉండే తల; విశాలమైన నొసలు; కురచగా లావుగా వుండే కొమ్ములు. ఇవి పైకి ఊర్ధ్వముఖంగా పెరిగి లోనికి వంకర తిరిగి వుంటాయి. స్థూలమైన కడుపు; బలిష్ఠమైన కాళ్లు, పొడవుగా ఆదోకగా ఉండే తోక. ఈ జాతి పశువుల కొమ్ములు వాడులుగా వుండడం పరిపాటి. ఆవులకి పొదుగు మధ్యమ పరిమాణంలో, చక్కగా అమిరి వున్న సిరాలతో వుంటుంది. ఈ జాతి లక్షణమైన రంగు తెలుపు, లేదా లేత బూడిదరంగులో గాని, నల్లటివి గాని గాఢమైన బూడిదరంగులో గాని మూపురం పైన, మెడమీదా, మక్కల ఈద మచ్చలుండి మిగిలిన భాగం తెల్లగా వుంటుంది. లేగదూడలు తెల్లగా వుంటాయి; వీటికి అక్కడక్కడ ఎర్రవాగుగా ఉన్న గోధుమ రంగు మచ్చలుంటాయి. కాని సుమారు ఆరు మాసాలు వచ్చేసరికి ఇవి కూడా తెలుపు రంగులోకి మారిపోతాయి.

పొన్వార్ అనే కాడి పశువు జాతి ఉత్తరప్రదేశ్‌లో గల లఖ్కింపూర్-ఖేరీ, పిల్లిబిత్తు జిల్లాలలో కానవస్తుంది. ఈ జాతి ఎడ్లు చురుకుగా వుండి కాడి పనులకి పనికి వస్తాయి. ఈ జాతి ఆవులు పాలు ఎక్కువగా ఇవ్వవు.

ఈ జాతి పశువులకి మొద్దుగా వుండే తల, సన్నటి ముఖము, లోతుగా వుండే నొసలు, పైకి పెరిగి వెనుకకు తిరిగి వుండే పొడుగాటి సన్నని కొమ్ములు, పొడవుగా స్థూలంగా వుండే కడుపూ, బలిష్ఠమైన పొట్టికాళ్ళు, బిగువైన కోశము, ఆదోకగా వుండే పొడుగైన తోక వుంటాయి. నలుపు తెలుపు కలిసివుండడం ఈ జాతికి సామాన్యమైన రంగు.

రథ్ జాతి మధ్యమ పరిమాణానికి చెందినది. రాజస్థానులో గల అల్వారులో ఉత్తరభాగమందు, పశ్చిమోత్తర భాగమందు కానవస్తుంది. ఈ పశువులు పరిమాణంలో చిన్నవి. వీటిని పెంచడం లాభదాయకం. ఈ జాతి ఎడ్లు దృఢంగా, చురుకుగా వుంటాయి. ఆవులు పాలు కాస్త బాగానే ఇస్తాయి.

ఈ జాతి పశువులకి నొసలు బల్లపరుపుగా వుంటుంది. వీటి కొమ్ములు చిన్నవి. అవి తల నుంచి పక్కలకి పెరిగి కొనల వద్ద లోనికి తిరిగి వుంటాయి. వీటి శరీరం కాస్త పొడుగుగానే వుంటుంది. కండరపుష్టి గలిగి అవయవాలు పొట్టిగా వుంటాయి. కోశం పైకి మణిచిపెట్టి చిన్నదిగా ఉంటుంది. వీటి తోక పెద్దది. ఈ పశువులు సామాన్యంగా తెలుపు రంగులో కాని బూడిదరంగులో కాని వుంటాయి.

సింధీ (ఎఱ్ఱ సింధీ) పశ్చిమ పాకిస్తానులో గల కరాచీ ప్రాంతాలూ, బెలూచీస్తాన్ కలిసిన కరాచీ వాయువ్య ప్రాంతాలూ ఈ జాతికి అసలు వునికితావులు. బెలూచిస్థాన్ ప్రాంతాలలో విశుద్ధమైన ఈ జాతి సంతతి ప్రత్యేకంగా పెంపొందించబడింది. ఈ జాతి సింధునదీ పశ్చిమ తీరాన్ని ఎక్కువ భాగంలో వ్యాపించి వుంది. ఈ పరంపరకి జెందిన జాతి పశువుల మందలు మైసూరులోనూ, మద్రాసులోనూ, తిరువాన్కూరులోనూ, ఒరిస్సాలోనూ, పంజాబులోనూ కానవస్తాయి. అన్యస్థలాలలోకూడా సులువుగా అలవాటుపడిపోయే స్వభావం వీటికి వుండడం వల్ల, పరస్థలాల్లో కూడా చక్కగా పెంపొందుతాయి. ఈ జాతి ఎడ్లు చిన్నవి; తేలిక పనులకి వుపయోగపడతాయి. ఈ జాతి ఆవులు పాలు అధికంగా ఇస్తాయి.

సింధీ జాతి పశువుల నొసలు సామాన్య పరిమాణంలో విశాలంగా వుంటుంది. వీటి కొమ్ములు పొట్టిగా లావుగా వుండి, తలనుంచి ఇరుపార్శ్వాలకి పెరుగుతాయి. ఇవి పైకి మొలిచి, ముందుకి వ్యాపించి, లోనికి చుట్టుకొని వుంటాయి. వీటి కొనలు మొద్దుబారి వుంటాయి. వీటి కడుపు పొడవుగా, స్థూలంగా పులి ఆకారంలో వుంటుంది. వీటికి కాళ్లు పొట్టి; తోక పొడుగు. ఈ జాతి ఆవుల పొదుగు, మధ్యమ పరిమాణంలో గల సిరాలతో, చక్కగా ఎదిగి వుంటుంది. ఈ జాతి పశువులు సర్వసామాన్యంగా ఎఱ్ఱరంగులో వుంటాయి; కాని కొన్నింటికి అక్కడక్కడ తెల్లటి మచ్చలుండవచ్చు.

సాహీమల్ (మాంట్‌గోమరి) అన్నది మధ్యమ పరిమాణంలో వుండే పశువు. పశ్చిమ పాకిస్తానులో మెరక ప్రాంతాలు గల మధ్య, దక్షిణ భాగాలలో, రావినది వద్ద, ముఖ్యంగా మాంటుగోమరి జిల్లాలో ఈ సంతతి పెంచబడుతోంది. పంజాబులో గల ఎన్నో పెద్ద పట్టణాల్లో కూడా ఈ జాతి పశువులు పెంచబడుతున్నాయి. ఈ పరంపరకి చెందిన జాతి పశువుల మందలు పంజాబులోనూ, ఉత్తరప్రదేశ్‌లోనూ, బీహారులోనూ, ఢిల్లీలోనూ

కానవస్తాయి. తేమ ఎక్కువగా వుండే వాతావరణాలలో ఈ పశువులు వృద్ధి జెందవు. ఈ జాతి ఎడ్లు మత్తుగా, మందంగా వుంటాయి. ఆవులు పాలు ఎక్కువగా ఇస్తాయి.

ఈ జాతి పశువుల ముఖ్య లక్షణాలు : పొడుగాటి తల, మధ్య పరిమాణంలో వుండే నొసలు; తలనుంచి పార్శ్వముల వైపు పెరిగే లావుపాటి కొమ్ములు. పొట్ట ఉలి ఆకారంలో వుంటుంది. నాభివద్ద వుండే వొదులైన చర్మంతో యిది వొదులుగా కలిసి వుంటుంది. వీటి వీపు పొడవుగా వుంటుంది. ఇది, మెడ చివర స్కంధ భాగం నుంచి మక్క ఎముకల ప్రదేశం వరకూ ఎత్తుగానూ, అక్కడి నుంచి చివరకి ఏటవాలుగానూ వుంటుంది. ఈ జాతి పశువులకి కాళ్లు పొట్టి, ఆవుల పొదుగు ఏపుగా ఎదిగి, వెనుక భాగం నుంచి ముందుకి త్రోయబడినట్లుగా వుంటుంది. సిరాలు మంచి పరిమాణంలో వుంటాయి. సాహీవల్ జాతి పశువులు సామాన్యంగా ఎర్ర రంగులోనూ, లేత ఎరుపు రంగులోనూ వుంటాయి. కొన్ని పశువులకి తెల్లటి మచ్చలు వుండడం కూడా కద్దు.

సిరీ జాతి డార్జిలింగు, సిక్కిం, భూటాను యొక్క కొండ ప్రాంతాలలో కానవస్తుంది. ఈ పశువుల చర్మంపైని ఒత్తుగా బొచ్చు వుంటుంది; అది అమితమైన చలివల్లా, వర్షాలవల్లా పశువు బాధపడకుండా రక్షణ నిస్తుంది. ఈ జాతి ఎడ్లు భారీ అయినవి. కొండలపైన, రోడ్ల మీద భారీగా వున్న బరువులని సులభంగా లాగడానికి ఇవి ఉపకరిస్తాయి. చదును ప్రదేశాలలో ఇవి రాణించవు.

ఈ జాతి యొక్క ముఖ్య లక్షణాలు : తల చిన్నదిగా వుంటుంది. బల్ల పరుపుగా ఉండే నొసలు; సూదిగా వుండి, ముందుకు ప్రసరించి, కొంచెం ఊర్ధ్వ ముఖంగా పెరిగే కొమ్ములు; భారీ అయిన పూర్ణశరీరం; బలిష్ఠమైన పొట్టి కాళ్లు; పొట్టిగా వుండే తోక. సామాన్యంగా వీటి రంగు తెలుపూ-నలుపూ కాని, ఎరుపూ-తెలుపూ గాని వుంటుంది.

థర్పార్కర్ జాతి మధ్యమ పరిమాణంలో వుండి, కాడి-పాడి పశువుల జాతికి చెందిన జాతి ఇది. పశ్చిమ పాకిస్తాన్‌లో గల థర్పార్కరు జిల్లా - ఇది పొడిగా, ఇంచుమించుగా ఎడారివలె నుండే ప్రదేశం - దీని ఉనికి. ఈ జతి పశువులు భారతదేశంలో కూడా పలుతావులలో, ముఖ్యంగా జోద్పూరు, కచ్ఛి, జెసల్మీరు ప్రాంతాలలో పెంచబడుతున్నాయి. ఈ జాతి ఆవులకి అధికంగా

పాలు యిచ్చే శక్తి ఉంది. ఈ జాతి ఎడ్లు నాగలి పనికీ, బండి లాగడానికీ కూడా పనికి వస్తాయి.

ఈ పశువుల తల మధ్యమ పరిమాణంలో ఉంటుంది. నొసలు విశాలంగా ఉంటుంది. కొమ్ములు బాగా ఎడంగా ఉంటాయి. ఇవి పైకి పెరిగి ముందుకీ, తల ఉన్నవైపుకే, వ్యాపించి ఉంటాయి. ఈ కొమ్ములు అట్టే పొడుగు ఉండవు. ఇవి మొదలు అయినచోట లావుగా ఉండీ, కొనలు మొద్దుబారి ఉంటాయి. కడుపు దృఢంగా ఉలి ఆకారంలోఉంటుంది. వీటి కాళ్లు పొట్టి. తోక సన్నగా పొడవుగా ఉంటుంది. పొదుగు, మంచి పరిమాణం గల సిరాలతో, బాగా ఎదిగి పెద్దదిగా ఉంటుంది. ఈ పశువులు సామాన్యంగా తెలుపూ, లేత బూడిదరంగులో ఉంటాయి.

జప్ఫర్‌బాడీ గేదెలు కథియవార్‌లోగల గీర్ వన ప్రాంతాలలో, అందులోనూ ముఖ్యంగా జప్ఫర్‌బాదు వైపు పెంచబడుతున్నాయి. ఈ పశువులు పాలు చాలా ఎక్కువగా ఇస్తాయి. కొన్ని గేదెలు రోజుకి 15 మొదలు 20 కిలోగ్రాముల పాలు యిచ్చేయి ఈ పాలల్లో వెన్న-కొవ్వు పదార్థం ఎక్కువగా ఉంటుంది.

ఈ జాతి పశువుల ముఖ్య లక్షణాలు : బరువైన తల, పైకి ఉబికి ప్రధానంగా కనిపించే నొసలు; వెడల్పుగానూ, బల్లపరుపుగానూ ఉండే కొమ్ములు. ఇవి మెడకి ఇరుప్రక్కలా వాలి, కొనలవద్ద వఱువగా పైకి లేచి, వొదులుగా మెలిదిరిగి ఉంటాయి. వీటి శరీరం ఉలి ఆకారంలో ఉంటుంది. పొదుగు పెద్దదీ, బాగా ఎదిగినదిన్నీ. ఈ పశువులు సామాన్యంగా, ముఖంపైన కాళ్లమీదా తెల్లటి మచ్చలతో, నలుపు రంగులో ఉంటాయి.

మెహ్‌సాను జాతి ఉనికి బరోడా, తత్ప్రాంతాలున్నూ. ఈ పశువులు మధ్యమ పరిమాణంలో ఉంటాయి. ఈ జాతి గేదెలు పాలకీ, నెయ్యి ఉత్పత్తికీ లాభదాయకంగా పరిగణింపబడుతున్నాయి. శీఘ్రంగా ఎదకి వస్తాయనీ, తప్పని సరిగా పాలు ఇస్తాయనీ, క్రమం తప్పకుండా ఈనుతాయనీ, ఈ పశువులను హెచ్చుగా ఎన్నిక చేస్తారు.

ఈ పశువుల తల బరువుగానూ, ముఖము పొడవుగానూ ఉంటాయి. కొమ్ములు స్థూలంగా ఉండి, వొదులుగా మెలిదిరిగి ఉంటాయి. వీటి శరీరం ఉలికి ఆకారంలో ఉంటుంది. అవయవాలు భారంగా ఉండకుండా తేలికగా

ఉంటాయి. పొదుగు చక్కగా ఎదిగి ఉంటుంది. ముఖంపైనా, కాళ్లమీదా, తోక చివరా తెల్లటి మచ్చలతో ఈ పశువులు మొత్తంమీద నల్ల రంగులో ఉంటాయి.

ముర్రాజాతి దక్షిణ పంజాబులోనూ, ఢిల్లీ ప్రాంతాలలోనూ పెంచబడు తోంది. పంజాబులో రోహతక్, హిస్సార్, జింద్, నాభా, పటియాలా జిల్లాలలో ఈ జాతియొక్క ఉత్తమమైన సంతతి పెంచబడుతోంది. ఈ పశువులు పాలకీ, నేతికీ పేరుపడ్డాయి. ఈ పశువులని భారతదేశంలో చాలా భాగాల్లో ప్రవేశపెట్టి పెంచుతున్నారు. వట్టిపోని కాలంలో, ఈ జాతి గేదె సగటున 1500 మొదలు 2,000 కిలోగ్రాముల పాలు యిస్తుంది. ఇందులో వెన్న-కొవ్వు పదార్థం ఏడు శాతం ఉంటుంది. కొన్ని పశువులు రోజుకి 25 మొ॥ 30 కిలోగ్రాముల వరకూ పాలు యిచ్చేయి.

ఈ జాతియొక్క ముఖ్య లక్షణాలు శుభ్రమైన చిన్నతల; కాస్త ప్రస్ఫుటంగా వుండే నొసలు; బల్లపరుపుగా పొట్టిగా వుండే కొమ్ములు. ఇవి వెనక్కి ప్రసరించి, పైకి లేచి లోపలికి సుడితిరిగి వుంటాయి. ఈ పశువుల శరీరం భారీగానూ, పొడవుగానూ, లోతుగాను ఉలి ఆకారంలో ఉంటుంది. వీటి పొడుగు బాగా ఎదిగి చక్కటి పరిమాణంలో ఉంటుంది. సిరాలు పెద్దవిగా ఉంటాయి. ఈ పశువుల రంగు నలుపు; తోకమీదా, కుచ్చుదగ్గిరా తెల్లటి మచ్చలుంటాయి.

నాగపురి (ఎల్లిచ్‌పురి) జాతి గేదెలు విశేషంగా భారతదేశపు మధ్య భాగంలోనూ, దక్షిణభాగంలోనూ కానవస్తాయి. ఈ జాతిపోతులు మందంగా నడుస్తాయి. చాలావరకు వీటిని కాడిపనులకి ఉపయోగిస్తారు. ఈ జాతి గేదెలు పాలు కొంచెం ఎక్కువగానే ఇస్తాయి. ఒక గేదె రోజుకి సగటున 6 మొదలు 8 కిలోగ్రాముల పాలు ఇస్తుంది.

ఈ పశువులకి తల పొడుగు; నొసలు విశాలంగా ఉంటుంది. వీటి కొమ్ములు పొడుగుగా, వంకర తిరిగి, మెడలకి ఇరుప్రక్కలా వ్యాపించి ఉంటాయి. తరచుగా యీ కొమ్ములు స్కంధభాగం వరకూ వ్యాపించి ఉండడం కనిపిస్తుంది. వీటి శరీరం, తేలికైన అవయవాలతో, పొడవుగా లోతుగా ఉంటుంది. తులనాత్మకంగా చూస్తే, వీటి తోక పొట్టి అనే చెప్పాలి. ముఖము మీద, కాళ్ళపైన, తోకచివర తెల్లటి మచ్చలతో నాగపురిగేదెలు నల్లరంగులో ఉంటాయి.

నీలీ జాతి గేదెలు పశ్చిమపాకిస్తాన్‌లో గల మాంట్గోమరి జిల్లాలోనూ, పంజాబులో గల ఫిరోజపూరు జిల్లాలోనూ కానవస్తాయి. లోతైన సట్లెజ్‌నది నీటి రంగును బట్టి ఈ జాతికి నీలిజాతి అని పేరు వచ్చింది. ఈ జాతిపోతులని భారీ అయిన కాడిపనులకి సామాన్యంగా ఉపయోగిస్తారు. ఈ జాతిగేదెలు పాలు అధికంగా ఇస్తాయి. పాలుయిచ్చే 250 రోజుల్లోనూ 1700 కిలోగ్రాముల పాలు సగటున ఈ గేదెవల్ల లభిస్తాయి.

ఈ జాతి పశువులకి నొసలు ఉబికినట్లు ఉంటుంది. కళ్లు తెల్లకళ్లు - కొమ్ములు బాగా బిగువుగా మెలితిరిగి పొట్టిగా ఉంటాయి. వీటి చర్మం, అల్ప రోమాలతో, మృదువుగా ఉంటుంది. శరీరం పొడవుగా, లోతుగా మధ్యమ పరిమాణంలో ఉలి ఆకారంలో ఉంటుంది. వీటికాళ్లు పొట్టి, తోక పొడవు, పొదుగు బాగా ఎదిగి ఉంటుంది. నుదుటిపైనా, ముఖము, ముట్టెకాళ్లు, తోక కుంచెవద్దనూ తెల్లటి మచ్చలతో ఈ పశువులు సామాన్యంగా నల్లరంగులో ఉంటాయి

సుర్తీ జాతి గేదెలు గుజరాతులో గల కైరా, బరోడా జిల్లాలు కలిసిన చారోత్తరు ప్రదేశం నుంచి వచ్చేయి. ఈ జాతి యొక్క ఉత్కృష్టమైన సంతతి ఆనంద్, నడియద్, బర్సాద్, పెట్లాడ్ ప్రాంతాలలో కానవస్తుంది. ఈ గేదెల వల్ల తక్కువ పెట్టుబడితో పాలు లాభదాయకంగా చేకూర్తాయి. ఈ గేదెలు అసంఖ్యాకంగా బొంబాయి పట్టణానికి దిగుమతి చేయబడు తున్నాయి. పోషణ బాగుంటే, యీ గేదెలు వట్టిపోని కాలంలో సగటున 1,700 మొ।। 2,000 కిలోగ్రాముల వరకూ పాలు యిస్తాయి. ఈ జాతిలో శ్రేష్ఠమైనవి 2,500 మొ।। 2,700 కిలోగ్రాముల వరకూ యిస్తాయి.

సుర్తీజాతి పశువులకి పొడుగ్గా, విశాలంగా ఉండే తల; ఉబ్బినట్టుండే నొసలు; బల్లపరుపుగా కొడవలి ఆకారంలో వుండే కొమ్ములు; ఉలి ఆకారంలో ఉండే శరీరం; మధ్యమ పరిమాణంలో వుండే కాళ్లూ ముఖ్య లక్షణాలు. వీటి పొదుగు చక్కగా ఎదిగి ఉంటుంది. తోక పొడవుగా, సన్నగా ఉంటుంది. ఈ పశువులు నల్లి రంగులో కాని, గోధుమరంగులో కాని ఉంటాయి. వీటి రోమాలు తెల్లగా గాని, గోధుమవర్ణంలో గాని ఉంటాయి. శ్రేష్ఠమయిన పశువులకి రొమ్ము వద్ద, దవడ దగ్గిర తెల్లటి చారలుంటాయి.

## భారతదేశంలో ఉపయోగింపబడుతూన్న పరజాతి పశువులు

దేశవాళీ ఆవుల యొక్క పాలు యిచ్చే సమర్థత ఇతోధికం చెయ్యడానికి, భారీ ఎత్తున అనేకములైన పరదేశి డైరీ పశువులు భారతదేశంలో వినియోగించబడ్డాయి. వీటిలో అతి ముఖ్యమైన జాతులు ఏవి అంటే; జెర్సీ, హోల్‌స్టెయిన్ - ఫ్రిజియన్. ఐర్‌షైర్, బ్రౌన్‌స్విస్, గుర్న్‌సీ జాతులు. ఇటీవల తగు మాత్రంగా జర్మన్ ప్లెక్వియే (స్పొటెడ్ మౌంటెన్) జాతి పశువులు పశ్చిమ జర్మనీ నుంచి దిగుమతి చేయబడ్డాయి. పరదేశి జాతులన్నింటిలోకీ హోల్‌స్టెయిన్ - ఫ్రిజియన్, జెర్సీ జాతి పశువులు విశేషంగా ఉపయోగించడ్డాయి. ఈ మధ్య జెర్సీజాతి ఆబోతులకి దేశంలో ఆవశ్యకత పెరిగింది.

ఈ జెర్సీజాతి అనేది. ఇంగ్లీషుకాలువలో ఉన్న జెర్సీద్వీపంలో పెంపొందించ బడుతుంది. ఇది డైరీ జాతులన్నిటిలోకీ చిన్న పశువు. అతి మితవ్యయంతో దీనివల్ల పాలు లభిస్తాయి. ఈ జాతి పశువులకి మూపురం ఉండదు. మక్కలు సమతలంగా ఉంటాయి. మెడ మొదలు మక్కల వరకు ఉండే భాగం సన్నగా ఉంటుంది. ఈ జెర్సీజాతి పశువుల పొదుగు ప్రశస్తంగా ఉంటుంది. ఆకారంలోనూ, ముందు వెనుకా అమరి ఉండడంలోనూ, వీటి పొదుగు శ్రేష్ఠంగా ఉంటుంది. లేత మట్టిరంగు మొదలు నల్లరంగు వరకూ, తెల్లటి మక్కలతో ఉండడం దగ్గర్నుంచీ గాఢం అయిన రంగువరకూ, అనేక రంగుల్లో ఉంటాయి జెర్సీజాతి పశువులు. కుంచె నల్లగా గాని, తెల్లగా గాని ఉంటుంది. ముట్టె నల్లగా ఉంటుంది. దాని చుట్టూ గుండ్రంగా సన్నటి మచ్చ ఉంటుంది.

భారతదేశంలో జెర్సీజాతి పశువులు చాలా బాగా ఉపయోగపడుతున్నాయి. మొట్టమొదటగా జెర్సీజాతి ఆబోతులతో దేశవాళీ ఆవులని జత కట్టించగా లభించిన సంతతివల్ల, తల్లి ఆవులవల్ల లభించిన పాలకంటె సుమారు రెండున్నర రెట్లు అధికంగా పాలు లభించేయి. ఈ సంతతికి యుక్త వయస్సుకి రావడానికి పట్టే వ్యవధీ, ఈనిన తరువాత మళ్లీ ఎదకి వచ్చేకాలమూ బాగా తగ్గేయి.

హోల్‌స్టెయిన్-ఫ్రిజియన్ పశువులు హాలండు నుంచి వచ్చేయి. జున్ను తయారు చెయ్యడానికి గాను ఎక్కువ పరిమాణంలో పాలు లభించడం కోసం యీ జాతి ప్రత్యేకించి పెంచబడింది.

ఈ జాతి పశువులు మోటుగా ఉంటాయి. ఇవి ఎక్కువ మేత మేస్తాయి. వీటి పొదుగు పెద్దదిగా ఉంటుంది. తల పొడవుగా, సన్నంగా, తిన్నగా ఉంటుంది. ఈ జాతి ఆవులు చాలా సాధువైనవి. హోల్‌స్టెయిను జాతి పశువులు నలుపూ-తెలుపూ కలిసిన రంగులో ఉంటాయి. ఈ రంగుల కలయిక, తెల్లటి శరీరం మీద కొద్దిగా నల్లటి మచ్చలు మొదలు, ఇంచుమించుగా శరీరం అంతా నల్లగా ఉండేటంత పర్యంతమూ ఉంటుంది. తోక కుంచె మాత్రం అన్నింటికీ తెల్లగానే ఉంటుంది.

భారతదేశంలో పార్వతి అనే సంకరజాతి ఆవు రోజుకి 46 కిలోగ్రాముల పాలు యిచ్చింది. ఇది ఫ్రిజియన్ ఆబోతుకీ దేశవాళీ ఆవుకీ జనించిన సంతతి.

ఐర్‌షైర్ జాతి స్కాట్లాండులో పెంచబడింది. డైరీ జాతులలో ఇది చాలా చక్కనిదని పరిగణించబడుతోంది.

ఈ ఆవులకి మూపురం ఉండదు. మక్కలు సమతలంగా ఉంటాయి. పొదుగు యోగ్యంగా ఉంటుంది. కొమ్ములు నిటారుగా పైకి మొలిచి ఉంటాయి. ఈ పశువులు చాలా చురుకైనవి. ఒక్కొక్కప్పుడు వీటిని అదుపులో ఉంచడం కష్టం అయిపోతుంది. ఇవి తెల్లటి మచ్చలతో ఎరుపు రంగులో కాని, ఎర్రటి మచ్చలతో తెలుపు రంగులో కాని ఉంటాయి. వీటి ఎరుపుదనం లేతగాగాని, లేదా నల్లరంగు అనిపించేటంత చక్కని రంగుగాని అయి ఉండవచ్చును.

బ్రౌన్‌స్విస్ జాతి పశువులు స్విట్జర్లాండు పర్వత ప్రాంతాలలో పెంచబడినవి. స్విట్జర్లాండులో వీటిని పాలకీ, కాడి పనులకీ, మాంసానికీ పెంచుతారు. అంచేత ఇవి మిగతా జాతులలాగ నాజూకైనవి కావు.

ఈ జాతి ఆవులకి పెద్ద ఎముకలూ, పల్లంగా ఉండే పెద్దతలా, లావుగా వొదులుగా ఉన్న చర్మమూ ఉంటాయి. ఈ జాతి పశువులు నెమ్మదైనవీ, సాధువైనవిన్నీ. వీటిని సంబాళించడం సులభం. వీటి రంగు లేత మట్టిరంగు మొదలు ఇంచుమించుగా నలుపే అనిపించేటంత వరకూ భిన్న భిన్నంగా ఉంటుంది. వీటి ముట్టె, వెన్నెముక పొడుగునా ఉండే భాగాలూ లేత రంగులో ఉంటాయి; ముక్కూ, తోక కుంచే, కొమ్ముల కొనలూ నల్లగా ఉంటాయి.

గుర్న్సీ జాతి ఫ్రాంసుదేశ తీరాన్ని గల గుర్న్సీ అనే చిన్న ద్వీపంలో పెంచబడింది. ఈ పశువులు హాల్స్టెయిన్ అంత మోటుగా ఉండవు కాని, జెర్సీ పశువులకంటె మోటుగానే ఉంటాయి.

ఈ జాతి ఆవులకి మక్కలు కరకుగానూ, రొండి (నడుము) బలహీనంగానూ ఉన్నట్టు కనిపిస్తాయి. వీటి పొదుగు జెర్సీజాతి వాటి పొదుగులంత అనురూపంగా ఉండదు. గుర్న్సీ పశువుల ముఖము బాగా పల్లంగా ఉంటుంది. కాని జెర్సీ జాతి వాటికంటె పొడవు. గుర్న్సీ జాతి ఆవులు చాలా చురుకుగా ఉంటాయి. వీటిని సంబాళించుకోవడం సులభం. ఈ జాతి పశువులు లేత మట్టిరంగు మొదలు ఇంచుమించుగా ఎరుపురంగు వరకూ, భిన్న భిన్నం అయిన రంగుల్లో ఉంటాయి. ముఖంపైనా, కాళ్లమీదా, తోకవద్దా, మక్కలమీదా మచ్చలు ఉంటాయి.

జర్మన్ - ఫ్లెక్వీ (స్పాటెడ్ మౌంటెన్) జాతి జర్మనీ యొక్క దక్షిణ, నైఋతి ప్రాంతాలలో, యూరపుఖండపు శీతోష్ణ పరిస్థితులలో - ముఖ్యంగా ద్రాక్ష మొలిచే వాతావరణం మొదలు ఆల్ప్రయిను కొండల శీతలం వరకూ గల భిన్న భిన్న శీతోష్ణ పరిస్థితులలో - పెంపొందించబడింది. ఈ రీతిగా పలువిధములైన శీతోష్ణస్థితులలో పెంపొందించబడడం చేత, ఈ జాతి పశువులకి అన్య వాతావరణాలకి కూడా సులభంగా అలవాటు పడిపోయే ముఖ్య లక్షణం ఉంది. ఈ విషయం, యూరపు దేశాలకి తదితర ఖండాలకి ఎగుమతి చేయబడ్డ, ఈ జాతి పశువుల వల్ల నిరూపితం అయింది. ఈ పశువులు ముఖ్యంగా కటువైన కొండ వాతావరణ పరిస్థితుల్లో పెంపొందడానికి యోగ్యంగా ఉంటాయి. భారతదేశంలో వీటిని హిమాచల్ప్రదేశ్లో ప్రవేశపెట్టేరు.

## పశువుల పెంపకం

పశువు ఎంతకాలానికి జతకట్ట కలిగిన యుక్త వయస్సుకి రాగలదో అన్న విషయం, పశువు యొక్క జాతి, దాని ఆహార పరిమాణం, ఆరోగ్యస్థితి, పరిసర పరిస్థితులూ మొదలైన అనేక అంశాలపై ఆధారపడి ఉంటుంది. భారతదేశపు గ్రామీణ పరిస్థితులలో పశువులు సామాన్యంగా మూడేళ్ల ప్రాయానికి ఋతుధర్మాన్ని పొందుతాయి.

ఆవు 19 మొదలు 21 రోజులకి ఒకసారి ఎదకి వస్తుంది. ఎదకాలం 12 గంటలు మొదలు 24 గంటలవరకూ ఉంటుంది. ఎద వచ్చిన ఉత్తమస్థాయి

మొదలుకొని అంతిమస్థాయి వరకూ ఉండేకాలం, జత కట్టడానికి అత్యుత్తమమైన సమయం. సగటున ఆవు 280 రోజుల చూలుతో ఉంటుంది. గేదెల విషయంలో ప్రతీ 21 రోజు మొదలు 23 రోజులకి ఒకసారి గేదె ఎదకి వస్తుంది. ఎదకాలం 18 ము।। 36 గంటల వరకూ ఉంటుంది. ఎదకి వచ్చిన ఉత్తమస్థాయి మొదలు అంతిమ స్థాయివరకూ ఉండేకాలం, జత కట్టడానికి మిక్కలి యోగ్యమైంది. సగటున గేదె 310 రోజులు చూలుతో ఉంటుంది.

జత కట్టించడానికి వినియోగించే ఆబోతులని చాలా జాగ్రత్తగా ఎంచుకోవలసి ఉంటుంది; ఎంచేతంటే మంద తాలూకు సొష్టవం సగభాగానికి పైగా ఆబోతునిబట్టే ఉంటుంది. అంచేత, ఉన్నవాటిలో అతిశ్రేష్ఠమైన ఆబోతుని ఎంచుకొని వినియోగించుకోవాలి. ఆ ఆబోతు మేలుజాతికి చెందినదీ, పాలు ఎక్కువగా యిచ్చే జాతికి పుట్టినదీ అయివుండాలి. పాలు యిచ్చే సమర్థత దూడలకి జాతి పశువుల వలన సంక్రమిస్తుంది. కాబట్టి పాలు అధికంగా యిచ్చే పశు కుటుంబంలో వచ్చిన ఆబోతునే వినియోగించుకోవలసి ఉంది.

బాగా యుక్తవయస్సు వచ్చేవరకూ, ఆబోతులని జతకట్టడానికి వినియోగించకూడదు. మరీ తప్పనిసరి పరిస్థితులలో మూడేళ్ల లోపు ప్రాయం గల ఆబోతులని వినియోగించవచ్చును; కాని అటువంటి పరిస్థితులలో కూడ వీటిని అరుదుగా వినియోగించాలి. సామాన్యంగా ఒక ఆబోతుగాని (దున్నపోతుగాని), యుక్త వయస్సు వచ్చిన 60, 70 ఆవులని (గేదెలని) జత కట్టించడానికి చాలును. చక్కని పాలన, మేత పరిస్థితులూ సమకూడిన సందర్భంలో ఒక వంద వరకూ యీ ఆడ పశువుల సంఖ్య పెంచవచ్చును.

జత కట్టడానికి ఎన్నిక చేసిన పాడి ఆవుగాని గేదెగాని వీర్యవంతంగాని ఆరోగ్యంగానూ ఉండాలి. దాని శరీరం పొంకంగా, కొవ్వుబారే లక్షణాలు లేకుండా ఉండాలి. శాంత స్వభావమూ, సాధువూ అయి ఉండాలి.

పాడి పశువుకి చక్కని స్తనమండలం ఉండాలి. పొదుగు అనురూపమైన ఆకారంలో, వి శాలంగా పెద్దదిగా ఉండి, తొడల మధ్య ఎత్తుగా ఉండి బొడ్డు వైపుకి ముందుకు ప్రసరించి ఉండాలి. యోగ్యమైన పొదుగు మెత్తగా ఉంటుంది; పాలు తీసిన తరువాత కుంచించుకుపోతుంది. పొదుగు అడుగు

భాగం సమతలంగానూ; వెనుకతట్టు గుండ్రంగా వంపు తిరిగి ఉండాలి. సిరాల ఆకారం చక్కగా, ఏకరీతిగా ఉండి, సిరాలు మంచి పరిమాణంలో ఉండాలి. అవి వర్తుల స్తంభాకారంలో ఒకదాని కొకటి సమదూరంలో ఉండాలి. పొదుగు మీద పాలనరాలు స్ఫుటంగా, ఎక్కువ శాఖోపశాఖలుగా ఉండాలి. పొదుగు మీద నరాలు స్ఫుటంగా ఉంటే పొదుగుకి రక్తస్రావం బాగుందనీ, పాలు అధికంగా లభిస్తాయి అనీ అర్థం.

ఎదకి వచ్చినప్పుడు ఆవు (గేదె) ఇటూ అటూ కదులుతూ ఉంటుంది. ఆకలి మందగిస్తుంది. పాలు తక్కువ అవుతాయి. భగరంధ్రం నుంచి పారదర్శకమైన ద్రవం ఊరుతుంది. భగం ఉబ్బి గౌణంగా ఉంటుంది.

సరిఅయిన సంరక్షణా, పోషణా ఉంటే ఆవు, ఈనిన 100 రోజులకి ఎదకి వస్తుంది. అనవసరంగా ఎక్కువ కాలం జత కట్టించకుండా ఉండడం మంచిదికాదు. ఈనడానికీ ఈనడానికీ మధ్య ఎంత తక్కువ వ్యవధి ఉంటే పశువుల వల్ల పాల మూలకంగా అంతలాభం ఉంటుంది.

ఆవుని మామూలుగానైనా జత కట్టించవచ్చును; లేదా దానికి కృత్రిమ పద్ధతులలో, ఇంజక్షన్ల ద్వారా, బీజారోపణ చేయించవచ్చును. కృత్రిమ పద్ధతులలో బీజారోపణ చేయించడం వలన అనేక లాభాలున్నాయి. ముఖ్యంగా మంద చిన్నదైనప్పుడు, ఆబోతుని పెంచడం కంటే యీ పద్ధతి లాభదాయకం. దూర ప్రాంతాలలో ఉన్న మేలుజాతి ఆబోతుల వీర్యాన్ని ఈ విధంగా విరివిగా ఉపయోగించుకోవచ్చును. ఇంతేకాకుండా, కృత్రిమ పద్ధతి ద్వారా బీజారోపణ చేస్తే, కొన్ని కొన్ని వ్యాధులు అరికట్టబడతాయి.

ఆవుగాని గేదెగాని చూలుతో ఉన్నప్పుడు, ఇంక ఒకటిన్నరా, రెండు నెలలకి ఈనుతోందనగా, పాలు తియ్యడం ఆపెయ్యాలి. ఇలా చేస్తే, తిరిగీ పాలు యిచ్చే ముందు పశువుకి తగినంత విశ్రాంతి లభిస్తుంది. చూలుతో ఉన్న పశువుని ఎక్కువ దూరం నడిపించడం కాని, తొందరగా పరిగెత్తించడం కాని చెయ్యకూడదు. మిగతా పశువులు దాన్ని కుమ్మకుండా చూసుకోవాలి.

ఆవుగాని గేదెగాని ఇంక ఈనబోతుందనగా కనిపించే చిన్నెలు ఏమిటి అంటే; ఆకలి మందగించడం, భగం ఉబ్బి గౌణంగా ఉండడం, అందులోంచి పసుపుపచ్చటి జిగట ద్రవం స్రవించడమున్నూ, తరచుగా పశువు కొద్దికొద్దిగా మూత్ర విసర్జన చేస్తుంది. పొదుగు ఉబ్బి ఉంటుంది. మక్క ఎముకల దగ్గిర భాగం క్రుంగి ఉంటుంది. పశువు ఒంటరిగా ఉండాలని చూస్తుంది. తరచుగా

తోక ఆడిస్తూ, కాస్సేపు పడుకొనీ, కాస్సేపు నిలుచునీ, విశ్రాంతి లేకుండా ఉంటుంది.

పశువు ఈనే సమయంలో అనవసరంగా జోక్యం కలుగజేసుకోకూడదు. సాధ్యమయినంతవరకూ, స్వాభావికంగా, ఈనడానికి వదలివెయ్యాలి. ఈనే ముందూ, యీనిన పిమ్మటా పశువుకి గోరువెచ్చటి కుడితి పెట్టాలి. దూడ పుట్టిన వెంటనే, తల్లి, దూడని నాకేటట్లు చూడాలి. ఏ కారణం చేతనయినా అలాగ నాకకపోతే, దూడ నోటినుంచీ ముక్కు పుటాల నుంచీ వెలువడే జిగట పదార్థం తుడిచివేసి శుభ్రపరచాలి. పాడిగా అయ్యేవరకూ దూడ శరీరాన్ని నెమ్మదిగా గోనెగుడ్డతో తుడవాలి. దూడ యొక్క నాభి రజ్జువు 2.5 సెంటీమీటర్ల దూరంలో ముడివేసి, ముడికి సుమారు ఒక సెంటీమీటరు క్రిందుగా కత్తిరించాలి.

మామూలుగా ఆవుగాని, గేదెగాని యీనిన 5, 6 గంటలలోగా మావి వేస్తుంది. మావి పడిన వెంటనే తీసెయ్యాలి. లేకపోతే పశువు దానిని తినెయ్యొచ్చు. ఆరోగ్యంగా పుట్టిన దూడ 20 లేక 30 నిమిషాలలో లేచి నిలుచుంటుంది. అవసరం అయితే, పొదుగునుంచి పాలు తాగడానికి వీలుగా దూడకి సహాయం చేయవచ్చును.

మంచి ఆవు లేక గేదె తొమ్మిది, పది నెలల వరకూ పాలు యిస్తుంది. సగటున ఆవు పాలల్లో 3.39 శాతం మాంసకృత్తులు, 3.68 శాతం క్రొవ్వు పదార్థం, 4.94 శాతం చక్కెర, 0.74 శాతం ఖనిజాలు, 87.27 శాతం నీరూ ఉంటాయి. గేదె పాలల్లో 4.37 శాతం మాంసకృత్తులు, 7.65 శాతం క్రొవ్వు పదార్థం, 4.82 శాతం చక్కెర, 0.94 శాతం ఖనిజాలూ, 82.22 శాతం నీరూ ఉంటాయి. పాలు యిచ్చే కాలం దగ్గిర పడుతూన్న కొద్దీ పాలల్లో క్రొవ్వు పదార్థం ఎక్కువ అవుతుంది.

## పశువులకు మేత

పశువులు శాకాహారులు. మానవుని ఉపయోగం కోసం అవసరమైన పాలూ, మాంసం, పని చెయ్యడానికి శక్తి, ఇవన్నీ శాకాహారం వల్ల వాటికి లభిస్తాయి. అంచేత చక్కని ఫలసాయం కలగాలి అంటే, పశువులకి చాలినంత

సుపోషకమైన మేత పెట్టాలి; ఇది నాణ్యమైనదిగానూ, కావలసినంత పరిమాణంలో తృప్తి నిచ్చేదిగానూ ఉండాలి.

నెమరు వేసే ఇతర జంతువులకిలాగే పశువులకి పొట్టలో నాలుగు భాగాలుంటాయి. మొదటి మూడు ఆహారనాళం యొక్క విస్తృతి. వీటి మూలంగా పశువు ఒకేసారి ఎక్కువగా ఆహారం తీసుకోగలుగుతుంది. ఆ తరువాత దీన్ని నెమరుకు తెచ్చుకొని తీరికగా నములుతుంది. ఆహారకోశపు మొదటి భాగంలో మేత చిన్న చిన్న ముక్కలుగా చేయబడి, చొంగతో కలిసి సంగ్రహించబడి ఉంటుంది. రెండవ భాగంలో నీరు సంగ్రహించబడి ఉంటుంది. పశువు మేత మెయ్యడం అయినపోయిన తరువాత, ఈ మొదటి రెండు భాగాలూ దగ్గరగా నొక్కుకొని పోవడం చేత, ఘనపదార్థంగా ఉన్న యీ ఆహార పదార్థం తిరిగీ నోట్టోకి వస్తుంది. దానిని మళ్ళీ బాగా నమిలి మెత్తగా ముద్దలా చేసిన తరవాత, ఆ ముద్ద తిన్నగా మూడవ భాగంలోకి పోతుంది. ఈ మూడవభాగంలో ఉన్న ముడుతల వల్ల ఆహారం బాగా మర్దించబడుతుంది. ఆ పిమ్మట అది నాలుగవ భాగంలోకి వెళుతుంది. అక్కడ జీర్ణరసాలు దానిని పచనం చేస్తాయి.

పశువుల మేత విషయంలో, ఏడాది పొడుగునా వాటికి సుపోషకమైన ఆహారం లభించేటట్టు శ్రద్ధ తీసుకోవాలి. ఆహారం కొద్ది కాలం పాటు తక్కువ అయినా కూడా, ఆవు తన మామూలు పరిమాణంలో పాలు ఇవ్వడానికి చాలా కాలం తీసుకొంటుంది. ఒక్కొక్క పశువు యిచ్చే పాలని బట్టీ, లేదా అది చేసే పనిని బట్టీ దానికి తగినట్లుగా ఆహారంలో ధాన్యజాతులు వాడాలి. పశువుకి మేత రుచికరంగా ఉండాలి. ఆ మేతలో గడ్డి మొదలయిన కరకు పదార్థం ఎక్కువగా ఉండాలి. పశువుకి ఎప్పుడూ రకరకాల మేత మెయ్యాలని ఉంటుంది; అంచేత పలురకములైన మేతలు కలిపి పెడితే ఫలితం బాగా ఉంటుంది. స్వతహాగా విరోచనకారియైన మేతలు పెట్టడం శ్రేష్ఠం. అటువంటి మేత పశువుని ఆరోగ్యంగా ఉంచుతుంది. మేతలో మార్పులు కలిగించినప్పుడు, అట్టి మార్పు నెమ్మదిగా చేస్తే, పశువు మార్పుకి అలవాటు పడుతుంది. ధాన్య జాతులు ముదుకగా విసిరి, మేతపెట్టేముందు, కొంతసేపు నానబెట్టాలి. ఇలా చేస్తే మేత సులభంగా జీర్ణం అవుతుంది.

సాధ్యమైనంతవరకూ పాడి పశువులకి ఏడాది పొడుగునా రసపుష్టి గల పచ్చిగడ్డిని లభింప జెయ్యాలి. పచ్చి గడ్డి ఎక్కువ రుచిగా ఉండా ఆకలి

ఇనుమడింప చెయ్యడమే కాకుండా, పాలు ఎక్కువ యిచ్చేటట్లు చేస్తుంది. పశువులకి అవసరమైన విటమిన్లకి పచ్చిగడ్డి అత్యుత్తమమైనది. చాలినంత పచ్చిగడ్డి లభించని పశువులు యిచ్చే పాలలో ముఖ్యమైన మూలపోషక పదార్థాలు లోపించి ఉంటాయి. లెగుమినస జాతి పచ్చి గడ్డి రకాలు – బెర్సీమ్, ల్యూసెర్న్, అలసందలు వంటివి – పాడి పశువులకి మిక్కిలి యోగ్యమైనవి. వీటివల్ల మాంసకృత్తులు ఖనిజాలు, కారోటీను లభిస్తాయి. – కాయ ధాన్యాల వల్ల లభించిన గడ్డిని, గాలి సోకకుండేటట్లు పదిలపరచి, పులియబెట్టి, మేతగా వాడుతారు. దీనిని సైలేజ్ అంటారు.

పచ్చికసవు దొరకనప్పుడు సైలేజి వాడటం శ్రేష్ఠం. వేసవికాలంలో పచ్చికసవు లభించనప్పుడు, సైలేజివల్ల పశువులు ఎప్పట్లాగే పాలు యిస్తాయి. సైలేజి సుపోషకమైనది. పశువులు దీనిని సులభంగా జీర్ణం చేసుకోగలవు. ముతకగా ఉన్న మొక్కల కాడలతో తయారయిన సైలేజిని కూడా పశువులు దుబరా కాకుండా తింటాయి.

సగటున ఆవుకి రోజుకి నాలుగు, యిదు కిలోగ్రాముల ఎండుగడ్డీ, పదిహేను ఇరవై కిలోగ్రాముల వరకూ పచ్చికసవూ, ఒక కిలోగ్రాము కాయధాన్యాదులూ కావాలి – దీనికి ఒకటిన్నర రెట్లు ఎక్కువగా గేదెకి కావలసి ఉంటుంది. ఇవిగాక, పాడిఆవుకి, అది యిచ్చే పాలని బట్టీ, ప్రతి $2\frac{1}{2}$ కిలో గ్రాముల పాలకి ఒక కిలోగ్రాము చొప్పున, పాడిగేదెకి ప్రతీ 2 కిలో గ్రాముల పాలకి ఒక కిలోగ్రాము చొప్పున పౌష్టికమైన మేత పెట్టాలి.

చూలున్న పశువులకి చివరి రెండు నెలలలోనూ ఒక కిలోగ్రాము కాయధాన్యపు మేత అదనంగా పెట్టాలి. చూలుండే కాలం పాలివ్వడానికి సరి అయిన పోషణ లేకపోతే పాలు ఎక్కువగా యివ్వలేదు; దూడకూడా బలిష్ఠంగా ఆరోగ్యంగానూ ఉండజాలదు.

జతకట్టించే కాలంలో ఆబోతుకి మామూలుగా పెట్టే మేతగాక, రెండు కిలోగ్రాముల కాయధాన్యపు మేత అదనంగా లభింపజెయ్యాలి. ఈ రీతిగానే సామాన్యపు పనులు చేసే ఎడ్లకి రోజుకి ఒక కిలోగ్రామున్నూ, అధికంగా పనులు చేసేవాటికి మూడు కిలోగ్రాములున్నూ, గింజలు అదనంగా పెట్టాలి.

ఈ కాయధాన్యపు మేతల కూర్పు చాలవరకు స్థానికంగా లభించే వస్తువుల పైనా, వాటి ధరలపైనా ఆధారపడి ఉంటుంది. మామూలుగా, చక్కటి సేంద్రీయపు మిశ్రమములో ఒక పాలు పాడిచేసిన ధాన్యపు గింజలు, రెండు

పాళ్లు తవుడు (లేక ఊక), ఒక పాలు తెలకపిండి ఉండాలి. 25 పాళ్లు పత్తి గింజలూ, 55 పాళ్లు మొక్క జొన్న, 20 పాళ్లు గోధుమ పొట్టు కలిసిన ఒక కిలోగ్రాము కాయధాన్యపు రేషను పెడితే, ఆవుకి 2.5 కిలోగ్రాముల పాలు యిచ్చే సమర్థతా గేదెకి 2 కిలోగ్రాముల పాలు యిచ్చే సమర్థతా చేకూరుతుంది.

దూడ పుట్టిన తరువాత, దానికి ముర్రిపాలు నాలుగైదు రోజుల దాకా యివ్వాలి. ఇవి లభ్యం కాకపోతే దూడకి, వెన్న తియ్యని పాలు, కొంచెం ఆముదంగాని, చేపనూనెగాని కలిపి, కోడిగుడ్డు సొనచేర్చి యివ్వాలి. ఒక నెల వరకూ దూడకి రోజుకి 2-7 కిలోగ్రాముల పాలు అవసరం. ఆపైన నెమ్మది నెమ్మదిగా 24 వారాల వరకూ వెన్నతీసిన పాలు ఇవ్వవచ్చును; ఆ తరవాత పాలు ఇవ్వడం మానివెయ్యవచ్చును. రెండు మూడు వారాలలో దూడ మెత్తటి గడ్డిని కొరక నారంభిస్తుంది. వట్టి గడ్డి వేసేటట్టయితే, శ్రేష్ఠమైన గడ్డి వెయ్యాలి. దూడ పుట్టిన రెండు మూడు వారాలయ్యేక, దానికి గింజల మిశ్రమాన్ని పెట్టవచ్చును. ఆరు నెలల వయస్సు వచ్చేసరికి రోజుకి ఒక కిలోగ్రాము వరకూ గింజలను క్రమంగా ఎక్కువ వెయ్యవచ్చును.

దూడలకి యోగ్యమయిన కాయధాన్యపు రేషను 30 పాళ్లు గోధుమ పొట్టు. 20 పాళ్లు బార్లీ, 20 పాళ్లు గంటెలు, 20 పాళ్లు మొక్కజొన్న, 10 పాళ్లు అవిసెపిండి కలిపి తయారు చేయవచ్చును.

తతిమ్మా ఎదిగిన జంతువుల విషయంలో, యీ గింజలతో యాభై, అరవై గ్రాముల ఉప్పు కూడా చేరుస్తూ ఉండాలి. దూడలని యథేచ్ఛగా ఉప్పు నాకనివ్వాలి; లేదా వాటికి రోజుకి 25, 30 గ్రాముల ఉప్పు యితరత్రా లభింపజెయ్యాలి. బాగా పాలిచ్చే పాడి పశువులకీ, మేలు జాతులకి పుట్టి, ఎదుగుతూన్న చిన్న పశువులకీ అదనంగా ఖనిజాలు లభింపచెయ్యడం అవసరం. మెత్తగా పొడి చేయబడి, సూక్ష్మక్రిములు నశింపచేసిన, ఎముకల పొడి 45 పాళ్లు, సుద్దగుండ 10 పాళ్లు, డైకాల్షియం ఫాస్ఫేటు 12 పాళ్లు, ఉప్పు 30 పాళ్లు, అరపాలు పసుపుపచ్చని లోహభస్మం, 2.25 పాళ్లు పొటాషియం అయొడైడు, 0.75 పాళ్లు సోడియం కార్బొనేటు, 0.75 పాళ్లు పిండి పదార్థం (స్టార్చి), 1.75 పాళ్లు సోడియం థయో సల్ఫేటు కూర్చి ఈ ఆహారం తయారు చెయ్యవచ్చును. ఈ విధంగా తయారు చేసిన ఖనిజ మిశ్రమానికి 100 కిలోగ్రాములకి 50 గ్రాములు పొడి చేసిన కోబాల్టు క్లోరైడు,

250 గ్రాములు మైలుతుత్తం, 300 గ్రాములు మ్యాంగనీసు సల్ఫేటు కూడా చేర్చాలి. ఈ విధంగా తయారు చేసిన ఖనిజ మిశ్రమం, ప్రతీ 100 కిలోగ్రాముల గింజలతోను 2 కిలోగ్రాముల చొప్పున చేర్చి వాడితే, పశువులకి కాల్షియం, ఫాస్ఫరసు వంటి ముఖ్య మూల వస్తువులలో కొరతనే కాక, ట్రేసు ఎలిమెంట్సు అనబడే రాగి, కోబాల్టు, మ్యాంగనీసు, అయోడిన్ అనే వాటి యొక్క లోపాలని కూడా తీరుస్తుంది.

వరి పండే తావులలో, పశువులకు కరకుమేత చాలావరకు వట్టి గడ్డి రూపేణా లభిస్తుంది. దీనికి పోషకశక్తి చాలా తక్కువ. అయితే కొద్దిగా కాయధాన్యపు పచ్చి కసవులు చేర్చి దీనిని రుచికరంగానూ, సుపోషకంగాను తయారు చెయ్యవచ్చును.

పశువులకి సన్నగా కోసిన మేత పెట్టడం ఎక్కువ లాభదాయకం. మేత సన్నగా తరగడం వల్ల దుబరా తగ్గుతుంది; ఇంతే కాకుండా యీ మేత పశువులు బాగా నమిలి జీర్ణం చేసుకోగలవు. అంచేత పశువులకి త్రాణ ఎక్కువయి, పాలు ఎక్కువగా ఇస్తాయి; అధికంగా పనిచెయ్య గలుగుతాయి.

పశువు యొక్క దేహ ధర్మ కార్యాలకి, అనగా జీర్ణించుకోవడం, పోషక పదార్థలని గ్రహించడం, మలమూత్ర విసర్జన ఇత్యాదులకి నీరు అత్యావశ్యకం. నీరు, శరీరపు ఉష్ణతని సక్రమంగా ఉంచుతుంది. పశువులు మేత లేకపోయినా కొంతకాలం తట్టుకోగలవు గాని, నీరు లేకపోతే ఉండలేవు. ఎదిగిన పశువుల శరీరపు బరువులో సగభాగం నీరు, పాలలో 81 మొ॥ 85 శాతం వరకూ నీరు ఉంటుంది. అంచేత తగినంత నీటి సదుపాయం పశువులకి ఎప్పుడు లభించేటట్లు చూడడం అవసరం. లేగదూడలు పాలు తాగుతాయి కనక వాటికి నీరు అవసరం లేదు అనుకోవడం పొరపాటు. సామాన్య పరిస్థితుల్లో పాడి ఆవుకి రోజుకి 32 లీటర్ల నీరు కావలసి ఉంటుంది. ఇదిగాక అది యిచ్చేపాలను బట్టి ఒక లీటరు పాలుకి 2 లీటర్ల చొప్పున నీరు అదనంగా ఇవ్వవలసి ఉంటుంది. కాడి ఎద్దుకి రోజుకి 32 లీటర్ల నీరు అవసరం. సోమరి పశువుకి 22 లీటర్ల నీరు కావాలి.

## పశువుల పాలన

పశువులని ఎప్పుడు కూడా దయతో ఆప్యాయంగా పెంచాలి. వాటికి భయం ఉద్రేకం కలగనివ్వకూడదు. మేత పెట్టడంలోనూ, పచ్చిక బీళ్లకి

తోలుకు వెళ్లడంలోను, పాలు తియ్యడంలోనూ, రోజూ ఒకటే నియమిత కాలానికి, వేళల క్రమం తప్పకుండా చేస్తే ఎంతో లాభదాయకంగా ఉంటుంది. పాడి పశువుల విషయంలో యీ కాల నియమం అతి ముఖ్యం.

## పాలు తియ్యడం

సరి అయిన పద్ధతిలో తియ్యకపోతే పాడి పశువులకి చేటు కలుగుతుంది. పాలు పితకడం త్వరగానూ, మృదువుగాను జరగాలి. పాలు పూర్తిగా పిండాలి. అరిచేతినంతా ఉపయోగించి పాలు పితకడం మంచిది. పాలు పితికినప్పుడు చేతులు పొడిగా ఉండాలి. బొటనవ్రేలు సిరానికి తగులుతే, సిరా దెబ్బతింటుంది. కనక, బొటనవ్రేలు మడిచి సిరానికి తగిలేలాగ పట్టుకొని పితకకూడదు.

కంటికి కనిపించే ఏ కల్మషమూ లేకపోయినంతమాత్రాన, పాలు పరిశుభ్రంగా ఉన్నాయి అనుకోడానికి వీలులేదు. జబ్బులను వ్యాపింపజేసే క్రిములు పాలలో వుండకూడదు. టైఫాయిడు, జగట విరేచనాలు, డిఫ్తీరియా, గొంతు నొప్పి, స్కార్లెటు ఫీవరు, క్షయ మొదలయిన మానవ రోగాలు. పాలలోని క్రిముల వల్ల సంక్రమిస్తాయి. పరిశుభ్రమైన పాలకంటే అపరిశుభ్రమైన పాలు వేగంగా పులుస్తాయి. అశుభ్రత సంక్రమించిన పాలని తిరిగీ శుభ్రపరచడానికి వీలుపడదు. అందుచేత పాలు అశుభ్రం కాకుండా వుండడానికి ఎంతో శ్రద్ధ తీసుకోవాలి.

పాలు పితికే సాల ఎప్పుడూ పరిశుభ్రంగా వుంచాలి. పాలు పితికే గిన్నెలు సూక్ష్మక్రిములు నశించేటట్టు శుభ్రపరచాలి. పాలు పితికే ముందు పశువు యొక్క పొదుగు బాగా కడగాలి. పాలు తీసేమనిషి ఏ విధమైన అంటు వ్యాధులు లేకుండా వుండాలి. ప్రతీ సిరం నుంచి పిండిన మొట్టమొదటి ధారలో క్రిములు ఎక్కువగా ఉంటాయి కనక, ఆ పాలు మిగతా పాలతో కలవనియ్యకూడదు.

పశువుని రోజూ బాగా కడిగి తోమాలి. ఇందువల్ల చర్మంపైని ఉన్న విడిరోమాలూ, మురికీ పోతాయి. తోమడం వల్ల పశువుకి రక్తస్రావం ఉత్తేజితం అయి, దాని ఆరోగ్యం బాగుంటుంది.

## దూడలకి తల్లిపాలు మానిపించడం

కొన్ని దేశాల్లో దూడ పుట్టిన దగ్గిర్నుంచీ స్తన్యం మానిపించెయ్యడం సామాన్యంగా ఆచరణలో ఉంది. దూడలేకుండా పాలు పితకడం ఎక్కువ ఆరోగ్యకరం అయినది. తల్లిపాలు మానిపించిన దూడలకి పోషణ ఎక్కువ క్రమపద్ధతిలో జరిగించడానికి వీలవుతుంది. ఇటువంటి దూడలని, వెన్న తియ్యని పాలకి ప్రత్యామ్నాయంగా లభించే వస్తువులలో, లాభదాయకంగా పెంచవచ్చును. దూడలకి స్తన్యం మానిపించినట్టయితే, పాలు పితికే కాలం కూడా కలిసివస్తుంది; ఆవు యిచ్చే పాల పరిమాణం బట్టి దానికి తగిన మేత వెయ్యడానికీ, ఆ సంబంధమైన రికార్డు సరిగ్గా వ్రాసుకోడానికి పశుపాలకుడికి వీలుగా ఉంటుంది. ఇంతే కాకుండా, స్తన్యానికి అలవాటు పడ్డ సందర్భాలలో, దూడ చచ్చిపోతే ఒక్కొక్కప్పుడు పాలు తియ్యడం కష్టం అయిపోతుంది. దూడకి స్తన్యం అలవాటు చెయ్యకపోతే యిటువంటి యిబ్బంది రానేరాదు.

దూడలకి స్తన్యం మాన్పించడం జయప్రదంగా జరగాలి అంటే దూడ పుట్టగానే తల్లి పశువు దూడని చూడకుండా ఉండేటట్లు చెయ్యాలి. అంటే ఈనినవెంటనే దూడని తల్లినుంచి వేరుచెయ్యాలి. తొలిచూలు పశువులలో ఇలాగ చెయ్యడం ఎక్కువ సులభం.

స్తన్యం మానిపించే దూడల విషయంలో వాటి ఆరోగ్యానికి భంగం రాకుండా చాలా జాగ్రత్తగా చూసుకోవాలి. దేహపు ఉష్ణతతో సమానంగా ఉండేటట్టు పాలు వెచ్చబేసి, ఆ పాలను స్తన్యం మాన్పించిన దూడలకి పట్టాలి. ఆదిలో దూడకి పాలు తపేలాదాంట్లో త్రాగించవచ్చును. చెయ్యి పాలల్లో ముంచి వేళ్లు దూడని చీకనివ్వాలి. క్రమేణా వేళ్లు చీకడం మానిపించెయ్య వచ్చును. పాలు తాగేటప్పుడు తరచుగా లేగదూడ తలతో కుమ్ముతుంది. క్రొత్తగా పుట్టిన దూడకి ఇది సహజ లక్షణం; అలాగ తల్లి పొదుగు కుమ్మడం వలన పాలు కిందికి, సిరాల్లోకి వస్తాయి. కాబట్టి పాలు ఒలికిపోకుండా తపేలా భద్రపరచాలి. పాలు తాగించిన తరువాత దూడమూతి శుభ్రంగా కడిగి, కాస్సేపటివరకు ఆ మూతికి చిక్కం కట్టి ఉంచాలి. లేకపోతే దూడలు ఒకదానిమూతి ఒకటి నాకడం అలవాటు చేసుకొంటాయి.

## కొమ్ములు తీయడం

సామాన్యంగా పాడి పశువులకి, ముఖ్యంగా డైరీ మందలు పెద్దవిగా ఉన్నప్పుడు, కొమ్ములు తీసివెయ్యడం కలదు. కొమ్ములు ఉన్న పశువుల కంటే; కొమ్ములు తీసివేసిన వాటిని ఎక్కువ సులభంగా సంభాళించు కోవచ్చును. దూడలు పుట్టిన ఒకటి రెండు వారాలలో కొమ్ములు తీసివేయవచ్చును.

కొమ్ములు తీసేటప్పుడు దూడ కదలకుండా ఉండేటట్లు చూడాలి. తలకి ఇరుప్రక్కల, కొమ్ముల మొలకలు వచ్చినచోట, చుట్టూ ఉన్న రోమాలని కత్తిరించాలి. ఆ గుండ్రటి పై అంచులకి వేసలీను రాయాలి. కొమ్ముల మొలకలు స్పిరిటుతో శుభ్రపరచి, యవక్షారముతోనో లేక కాస్టికపటాసు ముక్కతోనే వర్తులంగా ఒకటి రెండు నిమిషాలు రుద్దాలి. అప్పు డు ఆ భాగం గుండ్రంగా ఎర్రగా ఏర్పడుతుంది. రక్తం రాకుండా జాగ్రత్త పడాలి. కొమ్ములు తీసివేస్తే యీ ప్రక్రియ జరిగిన తరవాత, ఆ భాగాలకి అపాయం కలగకుండా ఉండేటందుకు దూడని ఒకటి రెండు రోజులు కట్టివేసి ఉంచాలి.

## కోడెదూడలు – విత్తులు కొట్టడం

పశువులలో పునరుత్పత్తి నిరోధక మార్గాలలో ఎక్కువ సులభ సాధ్యం అయినటువంటిది విత్తులు కొట్టడం. శ్రేష్ఠం కాని ఆబోతులు జతకట్టడం వల్ల సంతతిలో పునరుత్పత్తి శక్తి సన్నగిల్లుతుంది. అంచేత జత కట్టించడానికి అయోగ్యమైన కోడెదూడలకి విత్తులు కొట్టడం ప్రపంచం అంతటా ఆచారంలో ఉంది. అయోగ్యమైన పశువులని ఎంచి తీసివేసే ఇతర మార్గాలు భారతదేశంలో లభించడం లేదు. అంచేత, అవాంఛనీయమైన సంతతి రాకుండా అరికట్టడానికి, బహుశా, విత్తులు కొట్టడం ఒక్కటే ఉపాయం.

ఇంతేకాకుండా, కోడెదూడలకి విత్తులు కొట్టడం వలన, ఎడ్లు బాగా పుష్టికరంగానూ, ఎక్కువ సాధువగానూ పెంపొందుతాయి. విత్తులు కొట్టిన పశువుని పెంచడం, సంబాళించుకోవడం కూడా సులభం. జత కట్టడానికి ఉద్దేశింపబడని కోడెదూడలకి సాధ్యమైనంత త్వరలోనే, అనగా 15 మొదలు 18 నెలల లోపు గానే విత్తులు కొట్టవలసి ఉంటుంది. లేత వయస్సులో

విత్తులు కొట్టివేస్తే పశువు సరిగా ఎదగదని, ఆ కారణం చేత పశువు చిన్నదిగా ఉండిపోయి దృఢం తక్కువ అయి వుంటుందనీ పశువులని పెంచేవారిలో కొందరికి ఓ నమ్మకం ఉంది. కాని ఇటువంటి అభిప్రాయానికి ఆధారం కానరాదు; సరికదా యుక్త వయస్సులో విత్తులు కొట్టడం వల్ల పశువు యొక్క సాధుత్వం, చురుకుదనం వృద్ధి పొందుతాయని కనిపెట్టబడింది.

ఏడాదిలో ఎప్పుడైనా విత్తులు కొట్టవచ్చును; అయినప్పటికీ వర్షాకాలంలో ఈ పని చెయ్యకూడదు. దేశంలో వివిధ ప్రాంతాలలో, వేరువేరు కాలాల్లో విత్తులు కొడితే మంచిది అని భావిస్తారు. సామాన్యంగా పల్లెటూళ్లలో విత్తులు కొట్టడానికి ఉపయోగించే పద్ధతులు అనారోగ్యకర మైనవిగానూ, పశువుకి బాధ కలిగించేవిగానూ ఉంటున్నాయి. ఈ విషయంలో "బుర్డిజ్జో" సాధనం మిక్కిలి ప్రయోజనకరం అయినది.

ఈ ప్రక్రియ ఆచరించేముందు పశువుని పక్కవైపుగా పడుకోబెట్టి, కాళ్లు గట్టిగా కట్టివెయ్యాలి. వీర్యనాళం జారిపోకుండా ఉండేటట్టు గట్టిగా పట్టుకుని, దానికి యిరువైపులా రెండు గంట్లు పెట్టాలి. మొదటి గంటుకన్నా రెండవది కొంచెం క్రిందుగా పెడితే పశువుకి అనవసరమైన బాధ తప్పుతుంది. "బుర్డిజ్జో" సాధనం నాళానికి చాలా దిగువగా ఉంచి ప్రయోగించకూడదు. వృషణాలు చితికిపోయే ప్రమాదం ఉంది. వీర్యనాళం పైన గంట్లు, వృషణాలకి ఇరుప్రక్కలా ఉండే నాళాలపైన పెట్టాలి. ఈ గంట్లు సమానంగానూ, త్వరగానూ పెట్టాలి. గంట్లు కురుపులై పోకుండా టించర్ అయొడిన్ రాయాలి. పశ్చిమ దేశాలలో దూడ చాలా చిన్నదిగా ఉన్నప్పుడే, చిమ్టా సహాయంతో ఒక బలిష్ఠమైన రబ్బరు రింగు గట్టిగా వీర్యనాళం చుట్టూ చుడతారు. ఈ రబ్బరు రింగు ఎల్లప్పుడూ నాళాన్ని నొక్కి ఉంచుతుంది. వృషణాలు ఎండిపోయిన తరువాత రబ్బరు రింగు పడిపోతుంది.

## పశువుల వయస్సు నిర్ణయం

పశువుల వయస్సు వాటి పళ్లవల్ల తెలుసుకోవచ్చును. పశువులకి పై దౌడకి ముందు పళ్లు ఉండవు - పుట్టినప్పుడు దూడ క్రింద దౌడకి తాత్కాలికమైనవి రెండు పాలపళ్లు (కత్తెర పళ్లు) ఉంటాయి. ఒక వారం అయ్యేసరికి నాలుగు, రెండు వారాలకి ఆరు, నాలుగు వారాలకి ఎనిమిది పాలపళ్లు ఉంటాయి. రెండేళ్ల ప్రాయం వచ్చేసరికి కత్తెరపళ్లు రా నారంభిస్తాయి. సాధారణంగా 2

మొదలు $2\frac{1}{2}$ ఏళ్ల ప్రాయానికి రెండు స్థిరమైన కత్తెర పళ్లు ఉంటాయి. మూడేళ్ల ప్రాయానికి నాలుగు, నాలుగేళ్ల ప్రాయానికి ఆరు, అయిదేళ్ల ప్రాయానికి ఎనిమిది స్థిరమైన కత్తెర పళ్లు ఉంటాయి.

అయిదేళ్లు పై బడ్డ తరవాత, పశువుల వయస్సు, పళ్ల యొక్క అరుగుదలని బట్టి నిర్ణయించవచ్చును.

## పశువుల సాలలు

పశువుల వల్ల ఉత్తమస్థాయిలో ఫలసాయం లభించాలంటే, అననుకూల వాతావరణం నుంచి వాటికి రక్షణ ఇవ్వడం ముఖ్యం. నీరు, తదితర సౌకర్యాలూ కలిగి, గాలీ – వెలుతురూ బాగా వచ్చేటట్టు ఆరోగ్యప్రదంగా ఉన్న సాలల్లో వాటిని ఉంచాలి. మురికి నీరు బయటకి పోవడానికి వీలుగా, పరిసరాల కన్న సాల ఎత్తుగా ఉండాలి. పశువులని సంబాళించుకోడానికీ, వాటికి మేత పెట్టడానికీ అనుగుణంగా ఉండేటట్టు పశువుల సాల ఏర్పరచాలి. సామాన్యంగా గాలి వీచేవైపు, పశువులకి గాలి దెబ్బ తగలకుండా, కట్టుదిట్టం చెయ్యాలి. సాధ్యం అయినంత వరకూ పశువుల సాల ఇళ్ల సమీపంలో ఉండకూడదు. ఇటువంటి పశువుల సాల నిర్మించడానికి విశేషించి డబ్బు వ్యవసరచ నవసరం లేదు కాని, సాలమట్టుకు పశువులకి సౌఖ్యప్రదంగానూ, ఆరోగ్యకరంగానూ ఉండాలి.

పశువుల సంఖ్యని బట్టి సాల పరిమాణం ఉంటుంది. సంఖ్య తక్కువగా ఉంటే, వరసగా పశువులు నిలుచోడానికీ, ముందరి వైపున నీటితొట్టె ఉంచడానికి, వెనుక భాగాన్ని మురికి నీరు పోయే కాలువకీ జాగా ఉంటే చాలును.

దూడలని వేరే ఉండే ఏర్పాటు చేసి, ఒక్క పాలు పితికినప్పుడే తల్లి పశువు దగ్గరకి తీసుకురావాలి. లేగదూడలని, ఎదిగిన దూడలనీ వేరు వేరుగా ఉంచాలి. ఆరు నెలల ప్రాయం వచ్చేక, కోడెదూడలనీ ఆవుదూడలనీ వేరు వేరు ఆవరణలలో ఉంచాలి.

ఆబోతుకి ఉద్దేశించబడిన సాల, పశువు యథేచ్ఛగా తిరిగి, వలసినంత వ్యాయామం పొందడానికి వీలుగా పెద్ద ఆవరణలో ఉండాలి.

పశువుల కొట్టం నేల గట్టిగా వుండాలి. ఈ పనికి సిమ్మెంటు–కాంక్రీటు అతి ఉపయుక్తమైనది. ఇటువంటి నేల అయితే రోజూ కడిగి శుభ్రపరచడానికి

వీలవుతుంది. నేల జారుగా ఉండకూడదు; ఇందుకై రఫ్ కాంక్రీటుగాని తదితర నిర్మాణ పద్ధతి గాని ఉపయోగించవచ్చును. - పశువుల సాలకి మురికినీటి కాలువ చాలా ముఖ్యం. గోమయం, గోమూత్రం - యీ రెండూ కాలువ ద్వారా పదేపదే వేరే తావులకి పోయే యేర్పాటుకి వీలుగా, కాలువ వెడల్పుగా ఉండాలి:

వీలయితే పశుమూత్రం కాలువగుండా ఒక గోతిలోకి తిన్నగా పోయేటట్టు ఏర్పాటు చెయ్యడం మంచిది. లేనప్పుడు పశువుల క్రింద వట్టి గడ్డి పరచాలి. ఈ గడ్డి మూత్రాన్ని పీల్చుకొంటుంది. తరవాత గోమయంతోపాటు సులువుగా ఊడ్చి, ఎరువు తయారయ్యే గోతిలో వెయ్యడానికి వీలవుతుంది.

పల్లెటూళ్లలో గోమయం, తదితర చెత్త అంతా కుప్పలు పోసి ఉంచుతారు. ఇది మంచిపని కాదు; ఎంచేతనంటే గాలివల్లా, వానవల్లా, మొక్కలకి కావలసిన పోషక పదార్థాలు ఈ ఎరువు కుప్పల నుంచి వృథాగా పోతాయి. పైగా యీ పద్ధతి అనారోగ్యకరం కూడాను. ఎరువు ఒక గోతిలో పదిలపరచడమే సక్రమమైన పద్ధతి. ఎరువుల కల్లా ముఖ్యం అయిన మూత్రం కూడా సక్రమంగా పదిలపరచాలి.

సామాన్యంగా ఆవుకి ఆరు చతురపు మీటర్ల జాగా కావాలి. గేదెకి ఇంకా ఎక్కువ అవసరం. పశువుల సంఖ్య అధికంగా ఉన్నట్టయితే, పశువుకీ పశువుకీ మధ్య అడ్డంగా కర్రరాటలో ఇనుపగొట్టాలో కట్టి, ఒక్కొక్క పశువుకీ దాని ఆవరణ ఏర్పరచాలి. ప్రతీ పశువుకీ తన ఆవరణలో ముందు భాగాన మేతకి సదుపాయం, కుడితి మొదలైనవి పెట్టే తొట్టె లేక గోలెం ఉండాలి. పశువు నిలుచోడానికి తగినంత జాగా ఉండాలి. వెనక తట్టున మురికి నీరు పోయే కాలువ ఉండాలి. పశువులని, ముఖాముఖీగా గాని, తోకాతోకా ఎదరగా ఉండేటట్టు గాని, రెండు వరసలలో ఉంచవచ్చును.

## పశువుల అనారోగ్యపు చిన్నెలు

పశువులకి అనేకమైన జబ్బులు వస్తూ ఉంటాయి. ప్రతియేటా జబ్బుల వల్ల విపరీతంగా పశునష్టం జరుగుతోంది. వ్యాధువల్ల పశువులకి పటుత్వం తగ్గుతుంది; యజమానికి ఆర్థికంగా నష్టం వస్తుంది.

మామూలుగా ఆరోగ్యంగా ఉన్నప్పుడు పశువులు కళగా ఉంటాయి. వాటి కదలికలలో చురుకుదనం కనబడుతుంది. అవి చక్కగా తిని హాయిగా నిద్ర పోతాయి. నెమరువేత మానెయ్యడం, పాలు తక్కువ ఇవ్వడం అనారోగ్యపు మొదటి చిన్నెలు. తరవాత కన్ను పుసికట్టి నీరు కారడం, ముక్కు అదే పనిగా ఓడడం, నోటివెంట చొంగ కారడం జరుగుతాయి. పశువు తరచుగా ఆ ప్రక్కకీ ఈ ప్రక్కకీ దొర్లుతూ, విశ్రాంతి లేకుండా ఉంటుంది. ఇతర ముఖ్యమైన లక్షణాలు ఏమిటంటే; కళ్లు మందంగా కాంతి విహీనంగా వుండడం. చెవులు వేలాడబడిపోవడం, ముట్టె పొడి ఆర్చుకుపోవడం. చర్మం బిరుసుగా అయిపోవడం. ఆయాసం, జ్వరం నాడిరేటూ శ్వాసరేటూ అధికం అవడమున్నూ.

సాధారణంగా పశువుల యొక్క శరీరపు ఉష్ణత 38.3 డిగ్రీలు సెంటిగ్రేడు (101 డిగ్రీ ఫారన్‌హీటు). పశువుకి ఎంత జ్వరం వచ్చిందో, గుదభాగంలోకి థర్మామీటరు జొనిపి, తెలుసుకోవచ్చును. నాడి నిమిషానికి 40-60 సార్లు కొట్టుకుంటుంది. తోక మొదట అడుగు భాగాన చెయ్యి పెట్టి వీటి నాడి తెలుసుకో వచ్చును. శ్వాసరేటు నిమిషానికి 15 మొదలు30 దాకా ఉంటుంది. గేదె విషయంలో మామూలుగా ఉండే శరీరపు ఉష్ణత 37.2 మొదలు 38.8 డిగ్రీలు సెంటిగ్రేడు (99 మొ ।। 102 డిగ్రీలు ఫారన్‌హీటు) - నాడి రేటు నిమిషానికి 40-45; శ్వాసరేటు 16 మొదలు 18 వరకు ఉంటుంది.

పశువులకి వచ్చే అంటువ్యాధులు చాలావరకు, సకాలంలో టీకాలు వేయించడం వల్లనూ, జబ్బు రాకుండా ముందుగానే తగిన రీతిని జాగ్రత్త పడడం వల్లనూ, నివారించవచ్చును. రోగం వచ్చిన తరువాత కుదర్చుకోవడం కన్నా రోగం రాకుండా కాపాడుకోవడం ఉత్తమం అన్న సంగతి పశువుల విషయంలో ఎల్లప్పుడు గుర్తుంచుకోతగ్గ విషయం.

అంటువ్యాధి సోకినదని తెలియగానే పశువుల నన్నింటినీ జాగ్రత్తగా పరీక్ష చేయించాలి. అసాధారణమైన చిన్నెలు కనిపించిన పశువులని వెంటనే వేరు పరచాలి. వ్యాధి సోకిందేమోనని అనుమానం తగిలినప్పుడల్లా, పరిసరాలు క్రిమినాశక మందులతో శుభ్రపరచాలి.

వ్యాధి సోకిన పశువులని వేరుగా ఉంచాలి. వాటి సంరక్షణకి మనుష్యులు ప్రత్యేకంగా ఉండాలి; అలాగ వీలుకాని పక్షంలో ముందు ఆరోగ్యం గల పశువుల పనులు చూచుకున్న తరువాత, వారు వ్యాధి సోకిన పశువుల విషయం

చూడాలి. వ్యాధితో ఉన్న పశువుల పనులు అయిన పిమ్మట కాళ్లూ చేతులూ క్రిమినాశక మందులతో పరిశుభ్రపరచుకోవాలి.

అంటువ్యాధి వ్యాపించినప్పుడు, ఆరోగ్యంగా ఉన్న పశువులని, పశువుల సంతలకీ, పశువులు కలిసి మేసే పచ్చిక బీళ్లకీ తోలుకెళ్లకూడదు. వ్యాధి సోకిన పశువులు మేసినంతమేర, పచ్చికబీళ్లు దున్ని, కాల్చిన సున్నపునీళ్లు జల్లాలి. కొన్ని నెలలవరకూ ఆ బీళ్లని మరి ఉపయోగించకూడదు. వ్యాధి సోకి చనిపోయిన పశువులనీ, వాటివద్ద నుండే చెత్తా-చెదారం అంతా తగులబెట్టించాలి; లేదా లోతుగా పూడ్చిపెట్టించాలి. పశువుల యొక్క కళేబరం కాల్చివెయ్యడానికి వీలు కానప్పుడు, దాన్ని 2 మీటర్ల లోతుగా తవ్విన గోతిలో, పైన సున్నం వేసి, పూడ్చాలి.

## పశువులకి సంక్రమించే ముఖ్య వ్యాధులు

దొమ్మ పశువులకి సంక్రమించే అంటువ్యాధి. ఇది సోకిన త్వరలోనే ప్రాణాంతకంగా పరిణమిస్తుంది. ఈ వ్యాధి మనుష్యులకి కూడా సోకుతుంది.

ఈ వ్యాధి ముఖ్య లక్షణాలు : ఎక్కువగా జ్వరం రావడం 46 డిగ్రీలు సెంటిగ్రేడు (101 డిగ్రీలు ఫారన్‌హీటు); కంటిపైనా నోటియందు కానవచ్చే పొరలలో రక్తం గడ్డ కట్టుకుపోయి బాగా గౌణంగా ఉండడం; శరీరపు వివిధ భాగాలలో వాపులు; ఈ వాపులవల్ల నొప్పిగాని, మంటగాని ఉండదు. మూత్రస్థానం, గుదస్థానం మొదలయిన సహజ రంధ్రాల ద్వారా రక్తస్రావం కలుగదు. ఇవి ఈ వ్యాధి ముఖ్య లక్షణాలు. వ్యాధి సోకిన 10 మొదలు 36 గంటలలోగా పశువు చనిపోతుంది.

నివారణోపాయం : ఆరోగ్యంగా ఉన్న పశువులని వెంటనే వ్యాధి సోకిన వాటి నుంచి వేరు చెయ్యాలి. వ్యాధికి గురి అయిన పశువు కళేబరాన్నీ, దాని చుట్టు పక్కల ఉండే గడ్డీ గాదవా అంతా పూడ్చిపెట్టాలి లేదా తగులబెట్టాలి. ఆ ప్రదేశం అంతా క్రిమినాశకమందుతో పరిశుభ్రం చెయ్యాలి. చనిపోయిన పశువుల చర్మం తియ్యకూడదు. ఈ అంటువ్యాధి బాగా వ్యాపించిన ప్రాంతాలలో, వర్షాకాలానికి ముందుగా పశువులకి టీకాలు వేయించాలి. వ్యాధి వచ్చిన పశువుల స్పర్శ సోకిన పశువులకి ఆంటీ-ఏంథ్రాక్సు సీరం ఇంజక్షన్లు ఇప్పించాలి.

జబ్బవాపు ఇది పశువులకి ఎక్కువ ప్రాణహాని కలిగించే తీవ్రమైన అంటు వ్యాధి. ఆర్నెల్లు మొదలు రెండేళ్ల ప్రాయం లోపుగా ఉన్న లేగ పశువులకి ఇది సులభంగా సోకుతుంది. ఈ వ్యాధి మట్టి ద్వారా సంక్రమిస్తుంది. కొన్ని కొన్ని తావులకే పరిమితం అయి ఉంటుంది. సామాన్యంగా యీ వ్యాధి వర్షాకాలంలో వస్తుంది. ఇది త్వరగా అలుముకుపోయే వ్యాధి అవడం చేత వ్యాధి వచ్చిన కొద్ది రోజుల్లో పశువు చనిపోతుంది.

ఈ వ్యాధి యొక్క ముఖ్యమైన లక్షణాలు : జ్వరం తీక్షణంగా రావడం, కుంటుతనం, మంటా, నొప్పి పెట్టే వివిధ పరిమాణాల్లో బొబ్బలు లేవడం; ఈ బొబ్బలు సాధారణంగా ముక్కులమీదా, మెడపైనా, కండర పుష్టి గల భాగాలలో కనిపిస్తాయి. ఈ భాగాలలో చర్మం ఎండిపోయి, నల్లపడి, నొక్కితే బీటలువారేటట్టుగా ఉంటుంది.

వ్యాధి నిరోధక మార్గాలు : ఆరోగ్యంగా ఉన్న పశువులని, వ్యాధి కలుగజేసిన పచ్చిక బీళ్లనుంచి దూరంగా ఉంచాలి. అట్టి పచ్చిక బయళ్లు వ్యవసాయపు పనులకి ఉపయోగించాలి. వ్యాధి వచ్చి చనిపోయిన పశువు కళేబరాన్ని, దానివద్ద ఉండే చెత్తాచెదారంతో సహా పూడ్చిపెట్టాలి. లేదా తగులబెట్టాలి. వ్యాధి బాగా వ్యాపించిన ప్రాంతాలలో, పశువులకి వర్షాకాలానికి ముందుగా టీకాలు వేయించాలి. వ్యాధి వ్యాపించి ఉన్నప్పుడు, వ్యాధి సోకిన వాటితో స్పర్శలో ఉన్న పశువులకి ఆంటీ-బ్లేక్ క్వార్టరు సీరం ఇంజక్షను ఇప్పించాలి.

ఈసుకపోవుట అంటువ్యాధి రూపంగా వచ్చే గర్భస్రావం పశువులలో ఒక దీర్ఘరోగం. దీనిమూలంగా పిండం ఎదగకుండా బయటపడిపోవడం కాని, నెలలు నిండకముందే దూడ పుట్టడంగాని జరుగుతుంది.

ఈ వ్యాధి లక్షణాలు : పాలు తక్కువ ఇవ్వడము, పశువు చిక్కిపోవడము, మందలో తరచు గర్భస్రావాలు కలగడమున్నూ. గర్భస్రావం కలిగే ముందు పశువు విశ్రాంతి లేకుండా ఉంటుంది. ముర్రిపాలు కారడం మొదలైన, ఈనేటప్పుడు ఉండే చిన్నెలు, కనిపిస్తాయి. ఇంక కొద్ది కాలానికి గర్భస్రావం కలుగుతుందనగా భగం నుంచి నల్లటి ద్రవపదార్థం వెలువడుతుంది. చూలుతో ఉండే కాలంలో మూడవ భాగంలో తరచుగా గర్భస్రావం కలుగుతుంది. సాధారణంగా మావి లోపలే ఉండిపోతుంది. ఈ వ్యాధి సోకిన ఆంబోతులకి వృషణాలు వాచి ఉంటాయి.

పశువులని చక్కగా సంబాళించుకోవడం వల్లనూ, ఆరోగ్యకరమైన పద్ధతులు అవలంబించడం వల్లనూ ఈ వ్యాధిని నిరోధించవచ్చును. వ్యాధి లక్షణాలు పొడసూపిన పశువులని వెంటనే వేరు చెయ్యాలి. గర్భస్రావం కలిగి బయటపడిపోయిన పిండం, మావి, అక్కడ ఉన్న గడ్డీ చెత్తా అంతా తగులబెట్టించాలి. వ్యాధి సోకిందని అనుమానం తగిలిన వెంటనే మందలోని పశువులకి 'ఎగ్లిటినేషన్ టెస్టు' చేయించి, వ్యాధి సోకింది అని ధృవపడిన పశువులని వేరుపరచాలి. దూడలకి 6 మొదలు 8 నెలల ప్రాయం లోపుగా 'కాఫ్‌హుడ్ వేక్సీను' టీకాలు ఇప్పించాలి.

అమ్మవారు లేక మశూచి ఇది గేదెలూ పోతులతో సహా అన్ని పశువులకీ సంక్రమించగల తీవ్రమైన అంటువ్యాధి. పాలు పితికే మనుష్యులు టీకాలు వేయించుకుని ఉండకపోతే వాళ్లకి కూడా యిది సంక్రమించవచ్చును.

జబ్బు ముఖ్య లక్షణాలు : తక్కువలో జ్వరం రావడం; నెమరు వేత మందగించడం; సిరాలు వాటి పరిసర భాగాలు ఎర్రబారి పొంగి ఉండడం; శరీరం మీద ముఖ్యంగా పొదుగుమీదా, సిరాల మీదా – దద్దుర్లు కట్టడం. అవి క్రమేణా పొక్కి బొబ్బలు అవుతాయి. ఆ తరువాత సుమారు పది రోజుల్లో పక్కు కడతాయి. తగిన జాగ్రత్త తీసుకోకపోతే స్తనసంబంధమైన వాపులు వచ్చి, ఆ తరవాత పాలు ఇవ్వడానికి ఎంతమాత్రమూ పనికి రాకుండా పోతుంది, పశువు.

నిరోధక మార్గాలు : వ్యాధి సోకిన పశువులని వేరుపరచాలి. వీటి పాలు తియ్యడం కోసం మనుష్యులు వేరుగా ఉండాలి. పాలు తియ్యడం అయిన తరవాత వీరు క్రిమినాశక మందులో చేతులు శుభ్రపరచుకోవాలి. జబ్బుపడిన పశువుల కోసం ప్రత్యేకించి మనుష్యులని ఏర్పాటు చెయ్యలేని పరిస్థితులలో, పశువులని చూసేవారు మొదట ఆరోగ్యంగా ఉన్న పశువుల పాలు తీసి, తరవాత వ్యాధి సోకిన వాటి పనులకి పూనుకోవాలి.

గాళ్లు : ఇది కూడా గేదెలు పోతులతో సహా అన్ని పశువులకీ సంక్రమించగల తీవ్రమైన అంటువ్యాధి. లేగ దూడల విషయంలో తప్ప, దీనివల్ల ప్రాణహాని జరగనప్పటికీ, పాలు బాగా తక్కువ అయిపోడం వల్లనూ, కాడి పశువులకి పని చేసే శక్తి సన్నగిల్లిపోవడం వల్లనూ, అపార నష్టం కలుగుతుంది.

ఈ వ్యాధి ముఖ్య లక్షణాలు : జ్వరం, ఆకలి మందగించడం, నెమరువేత తక్కువగా ఉండడం, పాలు తక్కువగా ఇవ్వడం, కుంటుతనం లేక నోటిపూత. ఆదిలో యీ వ్యాధి సంక్రమించిన పశువుయొక్క అవయవాలు వొణుకుతూ ఉంటాయి. పశువు అదోక మోస్తరుగా పెదిమలు చప్పరించడం బట్టి, దాని నోటికి వ్యాధి సోకిందని తెలుసుకోవచ్చును. నోటికి వ్యాధి వస్తే విపరీతంగా చొంగ కారి, పెదిమల వద్ద నురగ ముద్దలు ముద్దలుగా ఉంటుంది. పళ్ల ఇగుళ్లపైన, పెదిమల మీద నాలుక పైభాగన, లేదా గిట్టల చీలికలలోనూ బొబ్బలు బయల్దేరి కురుపులుగా పరిణమిస్తాయి.

నిరోధక మార్గాలు : వ్యాధి సోకిన పశువులని వేరుగా ఉంచాలి. ఈ వ్యాధి కనిపించిన కాలంలో పశువులని బయటకి తోలుకువెళ్లడం తగ్గించాలి. వీటిని, శుభ్రపరిచిన పొడి జాగాలో కట్టివేసి, కురుపులు పూర్తిగా మానేదాకా విశ్రాంతి కలుగజెయ్యాలి. నోటిలో ఉండే బొబ్బలు, పాదాలపై లేసిన కురుపులు శుభ్రంగా కడగాలి. ఈ అంటువ్యాధి మిగతా పశువులకి వ్యాపించకుండా ఉండడానికి, కొద్దిగా వ్యాధి సోకిన పశువుల చొంగ ఆరోగ్యంగా ఉన్న పశువులకి రాయాలి. ఎక్కువ పశువులకి వ్యాధి సోకినప్పుడు,వాటి చికిత్సకి "ఆంటిసెప్టిక్" ద్రావణం తయారు చేసి, ఆ ద్రావణంలో వీటి పాదాలు మునిగేటట్టు నెమ్మదిగా నడిపించాలి.

గొంతుక వాపు పశువులకి అన్నింటికీ సంక్రమించే అంటువ్యాధి ఇది తీవ్రం అయినదీ, అపాయకరం అయినదిన్నీ. వరదలు వచ్చే పల్లపు భూముల్లో ఈ వ్యాధి మిక్కుటంగా వ్యాపిస్తుంది. సామాన్యంగా వర్షాకాలంలో యీ వ్యాధి సంక్రమిస్తుంది; కాని మిగతా కాలంలో కూడా అక్కడక్కడ ఈ జబ్బు రావడం కలదు.

దీని ముఖ్య లక్షణాలు : అకస్మాత్తుగా యీ అంటువ్యాధి రావడము, తరవాత కొద్ది గంటలకే పశువు చనిపోవడమున్నూ. బాగా జ్వరం వస్తుంది. కంటిగ్రుడ్డు మీదా నోటిమీదా ఉండే పొరలు ఎఱ్ఱబడుతాయి. నోటివెంట చొంగ కారుతుంది. గొంతు, గొంతుచుట్టూ ఉండే నరాలు పొంగి, గట్టి బారిపోయి, నొప్పి పెడతాయి. మంట పుడుతుంది. ఈ పొంగులు తలకీ, మెడకీ, ఒక్కొక్కప్పుడు ముందరికాళ్లకీ కూడా వ్యాపించవచ్చును. శ్వాస కష్టం అయిపోయి, ఒక్కొక్కప్పుడు ఊపిరాడకుండా పోతుంది. మొదట్లో

మలబద్ధం, శూలనొప్పి కలిగి పిమ్మట గ్రహణి (అతిగా విరేచనాలు) పట్టుకుంటుంది.

వ్యాధి సోకిన పశువులని వేరుచెయ్యాలి. వ్యాధి వచ్చి చనిపోయిన పశువునీ దాని దగ్గిర ఉండే గడ్డీ, చెత్తా చెదారం, లోతుగా గొయ్యి తీసి, సున్నం వేసి పాతి పెట్టాలి. ఈ వ్యాధి ప్రబలంగా ఉండే ప్రాంతాలలో ప్రతి యేటా, వర్షాకాలానికి ముందుగా, పశువులకి టీకాలు వేయించాలి. వ్యాధి సోకినప్పుడు, వ్యాధి సోకిన పశువుల స్పర్శ తగిలిన వాటికి అన్నింటికీ ఆంటిసీరమ్ ఇంజక్షన్లున్నూ, మిగతా పశువులకి రక్షణార్థమై టీకాలు వేయించడమున్నూ జరిపించాలి.

పొదుగు వాపు అనే అంటువ్యాధి వలన ఆవులకీ గేదెలకీ పొదుగులు కందిపోయి, వాచి, మంట పెడతాయి.

సామాన్యంగా యీ జబ్బు, పాలు యిస్తూన్న ఇతర సమయాల్లో కంటె, ఈనిన వెంటనే వస్తే తీవ్రంగా ఉంటుంది.

జబ్బు లక్షణాలు : వ్యాధి సోకిన భాగంలో పొదుగు కందిపోయి ఉంటుంది. ముట్టుకుంటే నొప్పి పెడుతుంది. జ్వరం వస్తుంది. పాలు మారిపోయి, పల్చగా నీళ్లగా గాని రక్తవాగుగా గాని ఉంటాయి. సామాన్యంగా పాలు ముద్దలు ముద్దలుగా ఉండడం కనిపిస్తుంది.

పాడిపశువులని ఎప్పుడుకూడా ఆరోగ్యప్రదమైన పరిస్థితులలో పెంచాలి. పాలు పితికినప్పుడు అరచేతితో సిరం పట్టుకొని, పితకాలి కాని బొటనవేలు మడిచి సిరాన్ని అంటిపెట్టి పితకకూడదు. వ్యాధి సోకిన పశువులని వేరుపరచాలి. దాని మలమూత్రాదులూ, దాని దగ్గరనున్న గడ్డీ, చెత్తా చెదారం తగులబెట్టాలి.

పెద్దరోగం ఇది తీవ్రమయిన అంటువ్యాధి. దీనివల్ల ప్రాణనష్టం కలుగుతుంది.

ఈ రోగలక్షణాలు : జ్వరం రావడం, పెదిమెలపైన, ఇగుళ్లమీద, నాలిక క్రింద ఉన్న మ్యూకసు పొరలమీద కురుపులు లెయ్యడం. కళ్లు చిక్కగా పుసికడతాయి. నోటి వెంట చిక్కగా చొంగకారుతుంది. భరించలేని దుర్వాసనతో విపరీతంగా విరేచనాలు అవుతాయి. పశువు త్వరగా క్షీణించిపోయి చనిపోతుంది.

ఈ రోగం వచ్చినప్పుడు పశువులని బయటకు తోలుకు వెళ్లకూడదు. వ్యాధి సోకిన పశువులను వేరుచెయ్యాలి. పశువుల పాలలను క్రిమినాశక మందుతో బాగా శుభ్రపరచాలి. చనిపోయిన పశువునీ దాని చుట్టుపక్కల ఉండే గడ్డి, చెత్త-చెదారం అంతా తగులబెట్టాలి; లేదా, లోతుగా గొయ్యి తీసి అందులో, సున్నపునీళ్లతో, పాతిపెట్టాలి. వ్యాధి సోకిన పశువులతో స్పర్శలో ఉన్నవాటికి ఏంటిరైండర్ టెస్టు సీరం ఇంజక్షన్లు ఇప్పించాలి. ఆరోగ్యంగా ఉన్న పశువులకి కూడా, రోగ నిరోధనకై, టీకాలు వేయించాలి. ఒక్కసారి టీకాలు వేయిస్తే చాలాకాలం యీ జబ్బు రాకుండా ఉంటుంది.

క్షయ అనేది అనేక జాతుల పశువులకు సంక్రమించే తీవ్రమయిన అంటువ్యాధి. ఈ వ్యాధి సోకిన పశువుల యొక్క పాలనవల్లను, మాంసం వల్లను మనుష్యులకి కూడా యీ వ్యాధి సంక్రమిస్తుంది.

ఈ వ్యాధి ముఖ్యలక్షణాలు : చిక్కిపోవడం, బొంగురుగా వచ్చే పొడిదగ్గు, క్రమేణా క్షీణించిపోవడమున్నూ, ఉదరభాగంలో యీ వ్యాధి సంక్రమించి నప్పుడు, పొట్ట పదే పదే విపరీతంగా పొంగుతూ ఉండడం, మధ్య మధ్య ఎక్కువగా విరేచనాలు అవుతూ ఉండడం కలుగుతాయి. పొదుగుకి సంక్రమిస్తే, పొదుగు గట్టిపడి ఉబ్బిపోతుంది. మొదట్లో పాలు మామూలుగానే ఉన్నా, తరువాత పల్చగా నీళ్లలాగ అయిపోయి, కాస్త ఆకుపసరు కలసిన పసుపురంగులోకి మారిపోతాయి; పాలు జిగటగా తీగెసాగినట్టు ఉంటాయి. పాల పరిమాణం బాగా పడిపోతుంది.

పశువుల్ని ఆరోగ్యప్రదమైన పరిస్థితులలో పెంచాలి. వాటిని గుమిగా ఒకచోట ఉంచగూడదు. మందలో వ్యాధి సోకిందని అనుమానం తగలగానే, పశువులన్నింటికి 'ట్యూబర్‌క్యులిన్ టెస్టు' చేయించాలి. ప్రతీ ఆర్నెల్ల తరవాత ఒకసారి చొప్పున వరసగా 'టెస్టులు' - వ్యాధి తగలలేదు అని నిశ్చయం అయేదాకా - చేయిస్తూ ఉండాలి. వ్యాధి సోకిన పశువులని వేరుపరచాలి. వ్యాధి సోకిన తల్లిపశువు దగ్గిర దూడలని పాలు తాగనియ్యకూడదు. వ్యాధి వచ్చి చనిపోయిన పశువునీ, దాని దగ్గర ఉండే గడ్డీ చెత్త - చెదారం అంతా తగులబెట్టించాలి; లేదా లోతైన గోతిలో సున్నపునీళ్లు వేసి, పూడ్చిపెట్టాలి.

పాలజ్వరం (మిల్కుఫీవర్) ఆవులకి గేదెలకి సామాన్యంగా వచ్చే జబ్బు. దేహస్థితి బాగుండి, పాలు చక్కగా యిచ్చే పశువులకి యీ వ్యాధి ఎక్కువగా సంక్రమిస్తుంది. మూడోసారి ఈని పాలు ఎక్కువగా యిచ్చేకాలంలో ఇది

సంభవిస్తుంది. ఇంక కొద్ది దినాలకి ఈనుతుందనగా గాని, లేదా ఈనిన 72 గంటల లోగా గాని పశువుకి ఈ వ్యాధి వస్తుంది.

వ్యాధి లక్షణాలు : కళ్లు కళాహీనంగా మందంగా ఉంటాయి. ముట్టె పొడి ఆర్చుకుపోతుంది. పశువు గాభరాగా ఉంటుంది. తల వెనుకకి తిప్పి, రొమ్మున కానించి, ముట్టె వెనుకతట్టున నుండేటట్టుగా గాని, లేదా మెడ తిన్నగా నేలపై ప్రసరించేటట్టుగాని పెట్టుకుని పశువు నేలపై పడుకుని ఉంటుంది. సామాన్యంగా దేహపు ఉష్ణత మామూలుగా ఉండవలసిన దానికంటె తక్కువగా ఉంటుంది. మలమూత్ర విసర్జన తాత్కాలికంగా ఆగిపోతుంది. పశువు స్పృహతప్పి పడిపోతుంది. 6 మొదలు 24 గంటలలోగా చనిపోతుంది.

ఈ వ్యాధి సోకిన పశువుల పాదుగు తడిగుడ్డతో శుభ్రపరిచి నేలకున్న మురికి అంటుకోకుండా, శుభ్రమైన తువ్వాలుగాని లేదా మరి ఏదైనా గుడ్డకాని పాదుగు కింద ఉంచాలి. పాదుగు యొక్క నాలుగు భాగాలలో ప్రతి భాగానికీ సైకిలు పంపుతో గాలి కొట్టి ఉబ్బేటట్టు చెయ్యాలి. గాలి పోకుండా సిరాలను శుభ్రమైన తాడుతో కట్టి ఉంచాలి. పాదుగు అంతటా గాలి సమంగా వ్యాపించేటట్టు పాదుగుని నెమ్మదిగా రుద్దాలి. సాధారణంగా గాలి కొట్టిన నాలుగు గంటలలో పశువు లేచి నిలబడుతుంది; కాని ఒక్కొక్కప్పుడు మళ్లీ గాలి కొట్టవలసి వస్తుంది. పశువుకి స్పృహ వచ్చిన సంగతి మలమూత్ర విసర్జన వల్ల తెలుస్తుంది. వ్యాధి సోకిన పశువుకి తిరిగీ స్పృహ వచ్చిన తరవాత, 12 గంటలవరకూ పాలు తియ్యకూడదు. ఆ తరవాత రెండు మూడు రోజుల వరకూ పాలు పూర్తిగా తీసివెయ్యకూడదు.

కడుపుబ్బు : ఈ వ్యాధి పశువుల పొట్ట యొక్క మొదటి భాగం వాయువుతో నిండి, పొంగడం వల్ల వస్తుంది. సులభంగా పులిసిపోయే పుష్టికరమైన పచ్చికసువు మెయ్యడం వల్ల సాధారణంగా యీ జబ్బు వస్తుంది. ముఖ్యంగా, మంచుపడి తడిగా ఉన్న పచ్చిగడ్డి తొందర తొందరగా అమితంగా తినడం వల్ల వస్తుంది. లెగుమిన జాతి గడ్డినిగాని, రసపుష్టిగల గడ్డిని గాని మేసి ఆ వెంటనే ఎక్కువగా నీళ్లు తాగినా ఈ వ్యాధి త్వరగా వస్తుంది. అధికంగా పాలు తాగే లేగదూడలూ, జీర్ణస్థితి తక్కువగా ఉండే పశువులూ, లేదా జబ్బునుంచి కోలుకుంటూన్నవీ ఈ వ్యాధికి గురికాగలవు.

ఈ జబ్బు యొక్క ముఖ్య లక్షణాలు : పశువు మేతమెయ్యడం మానివేస్తుంది; విశ్రాంతి లేకుండా ఉంటుంది. వెనుకతట్టు వొంగి ఉండేటట్టు

నిలుచుని, పక్కల చూస్తూ ఉంటుంది. పొట్ట, ముఖ్యంగా ఎడమవైపు పొంగి ఉంటుంది. పొట్ట చేతితో తడితే, 'డమ్ డమ్' అని శబ్దం వస్తుంది. ఆయాసంతో పశువు మూలుగుతూ ఉంటుంది. పొట్టయొక్క మొదటి అర పొంగి, ఊపిరితిత్తులకి ఒత్తిడి కలగజెయ్యడం వల్ల, పశువుకి శ్వాస కష్టం అయిపోతుంది. ఒక్కొక్కప్పుడు, పశువు, పదే పదే పడుకుంటూ, లేచి నిలబడుతూ ఉంటుంది. నోటి వెంట చొంగ కారుస్తూ, నాలిక పైకి వేలాడబెట్టి పశువు రొప్పుతూ ఉంటుంది. తీవ్ర పరిస్థితులలో పశువు చనిపోవచ్చును.

ఆకలిగొన్న పశువులకు రసపుష్టిగల మేతగాని, లెగుమినజాతి మేతకాని వేయకూడదు. పశువుకి పెట్టే మేతలో హఠాత్తుగా మార్పులు చెయ్యకూడదు. వ్యాధి కనిపించిన ప్రథమ దశలో, పశువుని నెమ్మదిగా అటూ ఇటూ నడిపించాలి. ఎడమ ప్రక్క ఒత్తిడి కలిగేలాగ పొట్ట యొక్క మొదటి భాగము నెమ్మదిగా రుద్దాలి. ఈ భాగంపై చల్లటి నీళ్లు పోసి టర్పెంటైను తైలంతో రుద్దడం మంచిది. జబ్బు తీవ్రత తగ్గేవరకూ పశువుకి మేతపెట్టకూడదు. నీరు కొద్ది కొద్దిగా మాత్రమే ఇవ్వాలి. పరిస్థితి మరీ ఉత్కటంగా ఉన్నప్పుడు పొట్టయొక్క మొదటి అరలో 'ట్రోకారు' 'కాన్యులా' సాధనాలతో కన్నం చెయ్యాలి; లేదా, పొట్ట యొక్క ఎడమ ప్రక్క, మధ్య భాగంలో వాడిగా ఉన్న కత్తి బాగా లోపలికి గుచ్చి కన్నం చెయ్యవచ్చును.

# II. గొర్రెలు

## ఉపోద్ఘాతం

పెంపుడు జంతువులలో కల్లా, బహుశా, గొర్రెలు అతి సాధువైన జంతువులు. యుగయుగాల నుంచీ అవి, మానవుడికి ఆహారం దుస్తులు కల్పిస్తూ, అతని జీవనాధారానికి తోడుపడుతూ, అతని వెంబడే వస్తున్నాయి. గొర్రెలు యేటేటా రెండు రకాలైన ఫలసాయం యిస్తాయి. ఉన్ని, గొర్రెపిల్లలు ఇంతేకాకుండా, గొర్రెలవలన చాలా విలువైన గెత్తం లభిస్తుంది. అదీగాక, కలుపు మొక్కలని నాశనం చెయ్యడానికి గొర్రె పెట్టింది పేరు. అంచేతే, గొర్రెలు బాగా సంరక్షింపబడి పెంపొందిన చోటల్లా, వ్యవసాయం వృద్ధి పొందింది.

. భారతదేశంలో 1961 సంవత్సరంలో రూ. 122.6 మిలియన్లు విలువచేసే 33,298 వేల మెట్రిక్ టన్నుల ఉన్నీ, రూ. 68.3 మిలియన్ల విలువచేసే 15 3 మిలియన్ల గొర్రెతోళ్లూ, ఉత్పన్నం అయినాయి. రూ. 231.3 మిలియన్లు విలువచేసే 131 వేల మెట్రికుటన్నుల గొర్రె మాంసం లభించింది.

గొర్రెగెత్తం ఎరువుకి మూలాధారం అని భావించబడుతూంది. ఒక్కొక్క గొర్రె సాలీనా 0.5 మొదలు 0.7 టన్నుల గెత్తం భూమికి అందిస్తుంది. పశువుల గెత్తాల కంటె గొర్రెల గెత్తంలో నత్రజని, పొటాసియం రెండింతలుంటాయి.

భారతదేశంలో, ఉన్ని యిచ్చే గొర్రెల గరిష్ఠ సంఖ్య, పొడి ప్రదేశాలయిన ఉత్తర హిందూస్థానపు మైదానపు ప్రదేశాలలోనూ, రాజస్థాను, కచ్చి, సౌరాష్ట్ర కలిసిన జోరియా ప్రాంతంలోనూ, ఉత్తర గుజరాతులోనూ కానవస్తుంది. దక్కను పీఠభూమిలో ముఖ్యంగా ఆంధ్రప్రదేశ్, మద్రాసు రాష్ట్రాల తూర్పు భాగంలోనూ, గొర్రెమందల సంఖ్య అధికంగా ఉంది. ఈ ప్రాంతపు గొర్రెలలో చాలావాటికి రోమరాజి ఎక్కువగా వుంటుంది. ఇవి మాంసం కోసం ఎక్కువగా ఉపయోగపడుతున్నాయి.

1982 సం॥లో భారతదేశంలో 48.8 మిలియన్లు గొర్రెలు ఉండేవి. 1977 సం॥లో గొర్రెల సంఖ్య 19.3 శాతం పెరిగింది. 1977 లో దేశం లోని గొర్రెల సంఖ్య 40.9 మిలియన్లు. రాష్ట్రాలవారీగా చూస్తే 7.52

మిలియను గొర్రెలతో ఆంధ్రప్రదేశ్‌ది అగ్రస్థానం తరువాత బీహారు 1 32 మిలియన్లు, గుజరాత్ 2.36 మిలియన్లు, హర్యానా 0.76 మిలియన్లు, హిమాచల్‌ప్రదేశ్ 1.09 మిలియన్లు, జమ్మూ,కాశ్మీర్ 1.9 మిలియన్లు, కర్నాటక 4.79 మిలియన్లు, మధ్యప్రదేశ్ 0.96 మిలియన్లు, మహారాష్ట్ర 2 67 మిలియన్లు, ఒరిస్సా 1.99 మిలియన్లు, రాజస్థాన్ 13 43 మిలియన్లు, తమిళనాడు 5.54 మిలియన్లు, ఉత్తరప్రదేశ్ 2.31 మిలియన్లు మరియు పశ్చిమబెంగాలు 1.37 మిలియన్లు గొర్రెలు ఉండేవి.

యునైటెడ్ నేషన్స్ (యు.ఎన్) ఆహార మరియు వ్యవసాయ సంస్థ అంచనా ప్రకారం 1991 సం॥లో ప్రపంచంలోని మొత్తం గొర్రెలసంఖ్య 1190 మిలియన్లు. అందులో భారతదేశపు గొర్రెల సంఖ్య 55.7 మిలియనలని ఎఫ్.ఎ.ఓ. ద్వారా అంచనా వేయబడింది. ఆస్ట్రేలియా, న్యూజీలాండ్, చైనా, రష్యా, బ్రిటన్ మరియు స్పెయిన్‌లో తగినన్ని గొర్రెల మందలు ఉన్నాయని అంచనావేసింది. ప్రపంచంలో మొత్తం 200 వివిధజాతులకు చెందిన గొర్రెలు ఉన్నాయని చెప్పవచ్చును. పాలు ఇవ్వడంలోనూ, మాంసపు నాణ్యత లోనూ, ఉన్ని శ్రేష్ఠతలోనూ గల పరిమాణాలని బట్టీ వీటి లక్షణాలు భిన్న భిన్నంగా ఉంటాయి. ప్రపంచంలో ఉత్పత్తి అయ్యే ఉన్ని 2.5 మిలియను మెట్రికుటన్నులని అంచనా వేయబడింది. అందులో 40 శాతం సన్నని మెరీనో ఉన్ని; మరో 40 శాతం మెరీనో జాతి నుంచి సంక్రమించిన జాతుల వల్ల లభ్యం అయింది. మిగిలినది తివాసీ ఉన్ని అని పేర్కొనబడింది.

## ముఖ్యమైన గొర్రెజాతులు

స్థూలంగా, భారతదేశంలో మూడు ముఖ్యమైన గొర్రెజాతులు కనిపిస్తాయి పృథివీ భౌతిక భూగోళదృష్ట్యా దేశం మూడు భాగాలు; సమశీతోష్ణత గల హిమాలయ ప్రాంతం. పొడిగా ఉండే పశ్చిమ మండలం, దక్షిణమండలం అనీ, పైని చెప్పిన మూడు జాతులూ దేశంలోని యీ మూడు భాగాలకీ అనురూపంగా ఉంటాయి.

సమశీతోష్ణత గల హిమాలయ ప్రాంతంలో కాశ్మీరు, హిమాచలప్రదేశ్, పంజాబు, ఉత్తరప్రదేశ్‌లో గల కొండ జిల్లాలు ఉన్నాయి. ఈ ప్రాంతంలో పెరిగే గొర్రెలకి చర్మాన్ని అంటిపెట్టుకున్న బొచ్చు ఎక్కువశాతం ఉండి, శ్రేష్ఠమైన ఉన్ని కలిగి ఉంటాయి. ఈ ప్రాంతపు గొర్రెలలో ముఖ్యమైన జాతులు; గూరెజ్, కరనాహ్, భకర్వాల్, గద్ది, రాంపూర్-బుషైరుజాతులు.

గూరెజ్ ఇది ఉన్నినిచ్చే గొర్రెల జాతులలో ముఖ్యమైనది. ఈ జాతి చాలా వరకు కాశ్మీరు రాష్ట్రంలో, ఉన్నత ప్రదేశంలో ఉన్న గూరెజ్ తహసీలులో పెంచబడుతోంది. దీని ఉన్ని పొడవైన కేశములు కలిగి, తళతళలాడుతూ, తెల్లగా ఉంటుంది. ఇందులో రోమం తక్కువ. ఒక కత్తిరింపులో సుమారు 1.5 కిలోగ్రాముల ఉన్ని సగటున లభిస్తుంది. ఈ జాతి గొర్రె మాంసం నాణ్యం అయింది. కాశ్మీరు జాతులన్నిటిలోకి గూరెజ్ జాతి గొర్రె పెద్దది. ఈ జాతి గొర్రెలలో చాలావాటికి కొమ్ములుండవు. చెవులు కురచగా ఉంటాయి.

కరనాహ్ గొర్రెలు కాశ్మీరు రాష్ట్రంలో, ముఖ్యంగా కెల్ ప్రాంతంలో పెంచబడుతున్నాయి. వీటి ఉన్ని ఎక్కువ మెత్తగానూ, బరువుగానూ ఉంటుంది. సామాన్యంగా యీ ఉన్ని తెలుపురంగులో ఉంటుంది. చాలావరకు యీ ఉన్ని స్థానికంగా తయారుకాబడే ఉన్ని వస్తువులకై వినియోగం అవుతోంది. కరనాహ్ పొట్టేళ్ల కొమ్ములు వంకరలు తిరిగి, పెద్దవిగా ఉంటాయి. వీటి ముఖం నిడుపుగా ఉంటుంది. ముక్కు ఉన్నతంగా ఉంటుంది.

భకర్వాల్ జాతి హిమాలయపు దిగువ కొండ ప్రదేశాల్లోనుంచి ఈ జాతి వచ్చింది. భకర్వాల్ అనే పశువులకాపరి జాతివారు ఈ గొర్రెలని పెంచుతారు. వేసవికాలంలో కొండల పై భాగానికి మేతలకి తీసుకువెళ్లి, శీతాకాలంలో దిగువనున్న మైదానాలకి తీసుకువస్తారు. ఈ జాతి గొర్రెల ఉన్ని పొడుగ్గా ఉంటుంది; అది సామాన్యంగా ముతకగా ఉండే దేశములతో కలిసి ఉంటుంది. సగటున ఏడాదికి ఒక గొర్రెవల్ల సుమారు 1.5 కిలోగ్రాముల ఉన్ని లభిస్తుంది. ఈ జాతి పొట్టేళ్లకి కొమ్ములుంటాయి. కాని గొర్రెలకి ఉండవు. చెవులు సాధారణంగా పొడవుగా, వెడల్పుగా ఉండి క్రిందికి వేలబడి ఉంటాయి.

గద్దీ (భదర్వా) జాతి కాశ్మీరదేశంలో జమ్ము ప్రాంతాలలో కిస్తరు, భదర్వా తాలూకాల్లో ఉండే ముఖ్యమైన జాతి. ఈ జాతి గొర్రెలు పంజాబులో కులు, కంగ్రా లోయల్లోనూ, హిమాచలప్రదేశ్‌లో చాంబ, మండీ ప్రాంతాలలోనూ కూడా పెంచబడుతున్నాయి. ఈ గొర్రెల బొచ్చు సామాన్యంగా తెల్లగా ఉంటుంది. శరీరానికి దగ్గరగా అంటిపెట్టుకొని ఉన్న బొచ్చు మిక్కిలి శ్రేష్ఠమైన "కులు" శాలువలు, రగ్గులూ తయారు చెయ్యడానికి ఉపయోగపడుతుంది. ఈ గొర్రెలు మధ్యమ పరిమాణంలో ఉండి దేహపుష్టి కలిగి ఉంటాయి. ఇవి కొండలు సులువుగా ఎక్కగలవు. ఈ జాతి పొట్టేళ్లకి కొమ్ములుంటాయి; గొర్రెలకి ఉండవు.

రాంపూరు-బుషైరు అన్నది హిమాలయ ప్రాంతాల్లో పేరెన్నికగన్న జాతి. హిమాచలప్రదేశ్‌లో గల మహసు, కిన్నౌర్ జిల్లాలు యీ జాతి పుట్టుక తావులు. ఈ గొర్రెల ఉన్ని మట్టి రంగులో ఉంటుంది. శరీరానికి అంటిపెట్టుకుని ఉన్న మెత్తటి బొచ్చు శ్రేష్ఠమైన బట్టలు తయారు చెయ్యడానికి ఉపయోగపడుతుంది. ఏడాదికి ఈ గొర్రెనుంచి ఉన్ని ఒకటి రెండు కిలోగ్రాముల వరకూ లభిస్తుంది

పొడిగా ఉండే పశ్చిమ మండలం - అంటె, రాజస్థాను, ఆగ్నేయ పంజాబు, గుజరాత్, ఉత్తరప్రదేశ్ యొక్క పశ్చిమ ప్రాంతాలూ కలిసి ఈ మండలం అవుతోంది. ఈ మండలంలో లభ్యమయ్యే ఉన్ని తివాసీ నేతకి యోగ్యం అయిందని పరిగణించబడింది. ఈ ఉన్ని పెద్ద పెద్ద మొత్తాలలో ఎగుమతి అవుతూంది. ఈ ప్రాంతపు గొర్రెలలో ముఖ్య జాతులు : లోహి, బికనేరీ, మార్వాడీ, కచ్చి, కఠియవాడీ జాతులు.

లోహి జాతి గొర్రెలు ఆదిలో పశ్చిమ పాకిస్తానులో గల లయల్పూరు, మాంటుగోమరీ జిల్లాలలో ఉండేవి. ఈ జాతి గొర్రెలు కొద్దిగా పంజాబులో కూడా కానవస్తాయి. ఈ జాతి నుంచి శ్రేష్ఠమైన మాంసం లభిస్తుందని ప్రసిద్ధి. గొర్రెలు పాలు అధికంగానే యిస్తాయి. గొర్రెల ఉన్ని పొడుగాటి కేశములు కలిగి ముతుకగా ఉంటుంది. ఈ గొర్రెల వైఖరి చక్కగా అందంగా ఉంటుంది. ఇవి పెద్ద పరిమాణంలో ఉండే గొర్రెలు. వీటి చెవులు పొడుగ్గా ఉంటాయి.

బికనీరీ జాతి రాజస్థానంలో పేరెన్నికగన్న జాతి. ఇందులో మూడు స్పష్టమైన అంతర్జాతులున్నాయి. చొక్లా, మగ్రా, నాలీ అని, ఈ గొర్రెల నుంచి నాణ్యమైన తివాసీ ఉన్ని లభిస్తుంది. ఏడాదికి గొర్రెవల్ల సగటున 1 5 కిలోగ్రాములు ఉన్ని దొరుకుతుంది. బికనీరీ జాతి గొర్రెల తల మట్టి రంగులో ఉంటుంది శరీరం మధ్యమ పరిమాణంలో పొందికగా ఉంటుంది.

మార్వాడీ జాతి రాజస్థానులో జోదుపూరు, జయపూరు డివిజన్లలో కానవస్తుంది. ఎన్నిక చేసిన మంచి మందలు పాలీ, బార్మేరు జిల్లాలలో పెంచబడుతున్నాయి. మార్వాడీ జాతి గొర్రెలు ఒకటి, రెండు కిలోగ్రాముల తెల్లటి ముదుక రకపు ఉన్ని నిస్తాయి. ఈ గొర్రెల ముఖం నల్లగా ఉంటుంది. ఇవి దృఢకాయం గలవి. వీటి కాళ్లు పొడుగ్గా ఉంటాయి.

కచ్చీ జాతిని సౌరాష్ట్ర, గుజరాతు రాష్ట్రాలలో "దేశీ" అంటారు. ఈ జాతి మొదట, కచ్చి ఎడారి ప్రాంతాల నుంచి వచ్చింది. ఎన్నిక చేసిన మందలు పశ్చిమ కచ్చిలో నాలియా ప్రాంతంలో పెంచబడుతున్నాయి. ఈ జాతివల్ల లభ్యమయ్యే ఉన్ని మిలిటరీ దుస్తులకీ, ట్వీడు బట్టలకీ ఉపయోగపడుతుంది. ఈ జాతి గొర్రెబొచ్చు తెల్లరంగులో ఉంటుంది. ఏడాదికీ వచ్చే ఫలసాయం 1 మొదలు 2 కిలోగ్రాముల వరకూ ఉంటుంది. ఈ జాతి - మాంసానికీ, ఉన్నికీ - ద్వివిధంగా ఉపయోగపడే జాతి అని పరిగణించబడింది. ఈ గొర్రెల తల విశిష్టమైన మట్టి రంగులో ఉంటుంది; శరీరం క్రిందికి దించుకుపోయి ఉంటుంది.

కథియవాడీ జాతి కథియవార్‌లోనూ, దానికి చేరువగా ఉన్న కచ్చి, దక్షిణ రాజస్థాను, ఉత్తర గుజరాత్ ప్రాంతాలలోనూ పెంచబడుతూంది. ఈ గొర్రెల నుంచి, పొడుగాటి కేశములు గల ముతుకరకపు ఉన్ని లభిస్తుంది. సామాన్యంగా ఈ గొర్రెలు తెల్ల రంగులో ఉంటాయి; ముఖంమీద, కాళ్లపైనా మట్టిరంగులోనూ, నల్లరంగులోనూ ఉన్న వెంట్రుకలుంటాయి. వీటివల్ల ఏడాదికి 1.5 కిలోగ్రాముల ఉన్ని లభ్య మవుతుందని అంచనా కట్టబడింది. ఇవి మధ్యమ పరిమాణంలో దేహపుష్టి కలిగి ఉంటాయి.

మహారాష్ట్ర, మైసూర్, ఆంధ్రప్రదేశ్, మద్రాసు, మధ్యప్రదేశ్‌లోని భాగాలు కలిసినది దక్షిణమండలం. ఈ మండలంలో, ప్రాథమికంగా, ఉన్ని ప్రధానమైనదీ, మాంసప్రధానమైనదీ అని ముఖ్యమైనవి రెండు తెగల గొర్రెలున్నాయి. ఈ మండలంలో ఉండే గొర్రెలలో ముఖ్యమైన జాతులు, దక్కనీ, నెల్లూరు, బళ్లారి, మాండ్య, బందూరుజాతులు.

దక్కనీ జాతి మహారాష్ట్రపు ఆగ్నేయ ప్రాంతాలలోనూ, ఆ చేరువలో నున్న ఆంధ్రప్రదేశ్ ప్రాంతాలలోనూ కానవస్తుంది. ఈ గొర్రెల నుంచి లభ్యమయ్యే ఉన్ని వదులుగా, ముతకగా ఉండి శరీరాన్ని అంటిపెట్టుకొని ఉండే సన్నటి బొచ్చుతో కలిసి ఉంటుంది. ఇది సాధారణంగా నల్లరంగులోనూ, బూడిదరంగులోనూ ఉంటుంది. స్థానికంగా ఉండే నేతగాళ్లు చాలావరకు దీనిని కంబళ్లు, తివాసీలూ నెయ్యడానికి ఉపయోగిస్తారు. ఏడాదికి సగటున లభించే ఉన్ని 500 గ్రాముల కన్న తక్కువ. ఈ గొర్రెలని ముఖ్యంగా మాంసంకోసం పెంచుతారు. ఈ గొర్రె చిన్నదైనా దేహపుష్టి గలది.

నెల్లూరు జాతి రోమజాతి గొర్రె : కాని ఇది మాంసానికి పేరు పడినది. సామాన్యంగా యీ గొర్రెలు తెల్లగా ఉంటాయి; ఒక్కొక్కప్పుడు నలుపు, మందమైన పసుపు పచ్చరంగు మచ్చలుకూడా ఉంటాయి. నెల్లూరు జాతి గొర్రెలు భారతదేశపు గొర్రెలలో అతి పొడగరిజాతిగా పరిగణించబడ్డాయి. పొట్టేళ్లకి కొమ్ములుంటాయి; గొర్రెలకి కొమ్ములు తీసివేస్తారు. ఈ గొర్రెలతోక, చివర వర్తులాకారంలో పెరిగిన వెంట్రుకలతో, సాధారణంగా కురచగా ఉంటుంది.

బళ్లారి జాతి గొర్రెలు దక్షిణాన్ని బళ్లారిజిల్లాలోనూ, కర్నూలు ప్రాంతాలలోనూ కానవస్తాయి. వీటి ఉన్ని ముతకగా సాధారణంగా నల్లగా ఉంటుంది. ఏడాదికి సగటున లభ్యం అయ్యే ఉన్ని 1 కిలోగ్రాము. ఈ గొర్రెతోలు మంచి నాణ్యమైనది. ఈ గొర్రెలు పెద్ద పరిమాణంలో ఉంటాయి. వీటి శరీరం పొందికగా ఉంటుంది.

మాండ్య జాతి మైసూరు రాష్ట్రంలో పెంచబడే గొర్రెలలో ముఖ్యమైన జాతి. ఈ గొర్రెల ఉన్నిలో రోమం అమితంగా ఉంటుంది.

బందూరు అన్నది చిన్నజాతి గొర్రె - మాంసానికి ఇది పేరుపడింది. మాండ్య జిల్లాలో బందూరు గ్రామంలో ఇది పెంచబడుతోంది.

ఇటీవల దేశవాళీ గొర్రెల నాణ్యత పెంపొందించడానికి, కొన్ని పరదేశ జాతుల గొర్రెలు భారతదేశంలోకి తేబడ్డాయి. ఆస్ట్రేలియా, జర్మనీ జాతులకి చెందిన మెరీనో పొట్టేళ్లూ, రాంబుయ్యే (ఫ్రెంచి) పొట్టేళ్లూ విరివిగా ఉపయోగించబడ్డాయి. దేశవాళీ గొర్రెల నాణ్యత పెంపొందించడంలో, ఇవి ప్రోత్సాహకరమైన ఫలితాలు కలుగజేశాయి.

మెరీనో జాతి ప్రపంచంలో సన్నటి ఉన్ని నిచ్చే జాతులలోకల్లా మిక్కిలిగా జనప్రియమైన జాతి. చిరకాలం నుంచీ యీ జాతి ఉన్నికోసమే పెంచబడుతోంది. సాధారణంగా దీన్ని "స్వర్ణపాదపు గొర్రె" అని అంటారు. మెరీనోలు మిక్కిలి దృఢమైన శరీరం కలవి; మిగతా జాతులకంటె ఇవి ఎక్కువ కాలం జీవిస్తాయి; ఎక్కువ సంతతి నిస్తాయి.

భారతదేశంలో మెరీనో పొట్టేళ్లచేత బికెనేరి గొర్రెలని జత కట్టించి, హిస్సర్‌డేల్ అనే జాతి ఒకటి ఉత్పన్నం చేసేరు. ఈ హిస్సర్‌డేల్ జాతి, బికనేరీ జాతి లక్షణాలు, అనగా, నాణ్యం అయిన మాంసం, అననుకూల శీతోష్ణ స్థితులకి, వ్యాధులకి లొంగిపోకుండా తట్టుకురావడం, మొదలైన యీ

గుణాలనీ, మెరీనోజాతి గుణాలు అనగా, పరిమాణం, సన్నటి ఉన్ని మొదలైన లక్షణాలనీ ఆకళించుకుంది. మొత్తం మీద ఈ జాతి గొర్రెల యొక్క మాంసం, దేశవాళీ గొర్రెల మాంసం కన్నా ఎక్కువ శ్రేష్ఠమైనదని పరిగణించబడింది.

రాంబుయ్యే జాతి ఫ్రాంసు దేశం నుంచి వచ్చింది. ఈ గొర్రెలు అతి శ్రేష్ఠమైన ఉన్ని నిస్తాయి. ఇవి మాంసానికి కూడా పేరు పొందేయి. రాంబుయ్యే గొర్రెలు ఎక్కువ సంతతి నిస్తాయి; పిల్లల్ని చక్కగా పోషిస్తాయి. మందగా పెంచడానికి ఈ జాతి చాలా అనువైనది.

## గొర్రెల పెంపకం

గొర్రెలు మొత్తం మీద వివిధ శీతోష్ణస్థితులలోనూ, గ్రామీణ పరిస్థితులలోనూ పెంచబడుతూన్నప్పటికీ, ఏదైనా ఒక ప్రత్యేకజాతి గొర్రెలను తమకి అలవాటైన పరిసరాల నుంచి ఇంకో పరిసరాలకి మారిస్తే వాటికి నష్టం సంభవించే ప్రమాదం ఉంది. అంచేత, ఒక ప్రాంతంలో గల పరిస్థితులలో వృద్ధి పొందడానికి మిక్కిలి యోగ్యంగా ఉండే జాతుల నుంచే గొర్రెలనీ, పొట్టేళ్లనీ ఎంచుకుని సంతతి పెంపొందించుకోవాలి. మంచి నాణ్యమైన వాటిని స్థానికంగా లభించే మందలనుంచే ఎంచుకుని, వాటిలో ఉత్తమమైన వాటిచేత జత కట్టించిగాని, లేదా వేరేజాతి వాటిచేత జత కట్టించికాని, శ్రేష్ఠత పెంపొందించడం అత్యుత్తమమైన పద్ధతి.

మందని పెంపొందించే విషయంలో పొట్టేలుని ఎన్నిక చెయ్యడం అతి ముఖ్యం. పొట్టేలు బాగా పుసత్వం కలదిగానూ, బలిష్ఠంగానూ, ఆరోగ్యం గానూ ఉండాలి. వాంఛనీయమైన జాతి లక్షణాలు అన్నీ కలిగి ఉండి, అది వాటిని తన సంతతికి సంక్రమింప జేయగల సమర్థత కలిగి ఉండాలి. కండర పుష్టిగల దేహము, సునిర్మితమైన తల, భారీ అయిన మెడ పొట్టేలుకి ఉండాలి. దాని కాళ్లు బలిష్ఠంగానూ, పాదాలు పటువుగానూ ఉండాలి. దాని ఉరస్సు విశాలంగా, పూర్ణంగా ఉండాలి. రొమ్ము పెద్దదిగానూ, కండగలదిగానూ ఉండాలి. పిరుదులు వెడల్పుగానూ, కటిప్రదేశం మంచి కండలతో పుష్టిగానూ వుండాలి.

నాణ్యమైన గొర్రె యొక్క శరీరాకారం ఏకరూపంలో ఉండాలి. శరీరం పొడవుగా, క్రిందుగా ఉండాలి. పృష్ఠభాగం విశాలంగానూ, పొడుగు సునిర్మితం

గానూ ఉండాలి. చక్కగా మేతమేసే స్తోమత కలిగి ఉండాలి. దానికి మాతృ లక్షణాలు పూర్తిగా ఉండి, తన పిల్లలు వేగంగానూ పూర్ణంగానూ ఎదగడానికి వీలుగా ఎక్కువ పాలు కలిగి ఉండాలి.

ఉన్నిజాతి గొర్రెల విషయంలో, పొట్టేలుకి మేలురకపు బొచ్చు ఒత్తుగా ఉండాలి. రోమం ఎక్కువ, ఉన్ని తక్కువ ఉండే గొర్రెపిల్లల్ని జత కట్టించడానికి ఎంచుకోరాదు. ముఖముపైనా, కాళ్లమీదా ఒత్తుగా తెల్లటి రోమాలు ఉండే గొర్రెపిల్లకి పెద్దది అయిన తరువాత రోమం ఎక్కువగా ఉంటుందని తెలుసుకోవాలి. నిగనిగలాడుతూ, దగ్గరగా పెరిగిన రోమాలు పల్చగా ముఖముమీదా, కాళ్లమీదా ఉంటే, తరవాత చక్కని బొచ్చు వస్తుంది. అని సూచన. కొమ్ముల మధ్య నుండే స్థలంలోనూ, తలపై ప్రదేశంలోనూ బిరుసు వెంట్రుక లుండకూడదు.

మాంసం కోసం పెంచే గొర్రెల విషయంలో ఈనేకాలం యొక్క ప్రారంభ దశలో పుట్టిన గొర్రెపిల్లల్ని ఎంచుకోవాలి. ఎంచేతనంటే, తరవాత పుట్టినవాటి కంటే ఇవి ఏపుగా ఎదుగుతాయి. వీటికి ఎముకకంటె కండర పుష్టి బాగా ఉండాలి. నాలుగైదు నెలల ప్రాయంలో భారీ తూకం తూగే గొర్రెపిల్లలు ఎక్కువ లాభదాయికంగా ఉంటాయి. స్తన్యం మానిపించే వయస్సులో ఉన్న గొర్రెపిల్లల మాంసం మిక్కిలి శ్రేష్ఠమయినది.

ఇక సంతతి పెంపొందించడంలో మందని 40-50 గొర్రెలకి ఒక్కొక్క పొట్టేలు చొప్పున గుంపులుగా విభజించి, జతకట్టించాలి. పొట్టేలు 8-9 నెలల ప్రాయం వచ్చేసరికి జతకట్టడానికి అనువుగా ఉంటుంది. కాని 15-18 నెలల వయస్సు వచ్చేసరికి జతకట్టడానికి అనువుగా ఉంటుంది. కాని 15-18 నెలల వయస్సు వచ్చేవరకూ జత కట్టించకూడదు. సామాన్యంగా $2\frac{1}{2}$ మొదలు 7 ఏళ్ల ప్రాయం వరకూ పొట్టేలు పూర్ణమైన వీర్యపుష్టి గలిగి ఉంటుంది. మేలు జాతి పొట్టేలు అయితే పది ఏళ్ల వరకూ జత కట్టించవచ్చును. జత కట్టించే కాలంలో, లేత వయస్సులో ఉన్న పొట్టేళ్లచేత 40 కన్నా ఎక్కువ గొర్రెలని జత కట్టించకూడదు. 4 మొదలు 6 యేళ్ల ప్రాయంలో ఉన్న పొట్టేళ్లచేత 50 గొర్రెలదాకా జత కట్టించవచ్చును. పొట్టేళ్లని కొత్త స్థలానికి తీసుకువెళ్లినప్పుడు, జత కట్టించేముందుగా, అవి ఆ పరిసరాలకి అలవాటు పడేటట్టు చేసి, విశ్రాంతి ఇవ్వాలి. అలగా సంతతి కలగకుండా ఉండడానికి, మందలోని మగ గొర్రెపిల్లలకి స్తన్యం మానిపించిన వెంటనే విత్తులు

తీసెయ్యాలి. లేత వయస్సులో విత్తులు తియ్యడం వల్ల మగగొర్రె పిల్లల కండరాలు వృద్ధి పొంది, మృదువుగా నాణ్యంగా ఉంటాయి.

ఆడగొర్రెలు సామాన్యంగా రెండేళ్ల ప్రాయానికి ఎదిగి వస్తాయి. అంతకు ముందుగా వాటిని జత కట్టించకూడదు. సాధారణంగా గొర్రెలు ఏడాదికి ఒక పిల్లని పెడతాయి. అదనంగా మేత పెట్టడానికి గడ్డీ, గింజలూ లభించే పరిస్థితులలో, రెండేసి పిల్లలు పుట్టేటట్లు చేసుకోవచ్చును. గొర్రెలు 142 మొదలు 152 రోజుల వరకూ చూలుతో ఉంటాయి. మిగతా పశువులలాగ గొర్రెలు ఏడాది పొడుగునా ఎదకి రావు; అవి ఎదకివచ్చే కాలం ప్రత్యేకించి ఉంది. ఆ కాలంలో ప్రతి 13 మొదలు 19 రోజులకీ ఒకసారి గొర్రె ఎదకి వస్తుంది. సగటున 18 రోజులకి ఒకసారి ఎదకి వస్తుంది. ఎద 3 మొదలు 70 గంటల వరకూ ఉంటుంది. సగటున ఎద ఉండే కాలం 27 గంటలు. ఎద కాలంలో చివరిభాగం జత కట్టించడానికి అత్యుత్తమమైన కాలం.

వేసవికాలం, ఆకులు రాలుకాలం, శీతాకాలం – ఈ మూడు కాలాలూ గొర్రెలు జత కట్టడానికి స్పష్టంగా నిర్ణీతమైన కాలాలు. వేసవికాలంలో జత కట్టగా పుట్టిన పిల్లలు ఏపుగా ఎదుగుతాయి; ఎంచేత అంటే చూలుతో ఉన్నప్పుడు తల్లులకి కావలసినంత పచ్చిగడ్డి లభిస్తుంది. పచ్చిక బీళ్లమీద మేతగాని, వర్షాకాలపు పంటల యొక్క కసవుగాని, కావలసినంత లభించే పక్షంలో శీతాకాలంలో పుట్టిన పిల్లలు కూడా బాగుంటాయి. వేసవికాలంలో పుట్టిన పిల్లల వల్ల సామాన్యంగా కష్టమే కలుగుతుంది.

ఈనేముందు గొర్రె, తోక నిటారుగా ఎత్తి ఉంచడం సహజగుణం. అది సామాన్యంగా మందకి వెనకబడి ఉంటుంది. ముందు కాళ్లతో నేల గీకుతుంది. తరచుగా కూచుంటూ, లేచి నిలబడుతూ అస్థిరంగా ఉంటుంది.

ఈనే సమయంలో, పిల్ల ముందు కాళ్లు రెండింటి మధ్యా తల ఉంచుకుని బయటపడుతుంది. ఆరోగ్యం సమంగా ఉన్న గొర్రెలకి, ఈనే సమయంలో ఎటువంటి సహాయం అవసరం లేదు. సాధారణంగా పుట్టిన కొద్ది నిమిషాలకి పిల్ల లేచి నిలబడి తల్లి పొదుగువద్దకి పోతుంది. పిల్లగాని బలహీనంగా పుడితే, అది లేచి నుంచుని తల్లి పొందుగు దగ్గరకి వెళ్లడానికి సహాయం చెయ్యవచ్చును. వాతావరణం చల్లగా ఉన్నప్పుడు గొర్రెనీ, పిల్లనీ కూడా వెచ్చటి ప్రదేశంలో ఉంచాలి.

దేశవాళీ గొర్రెపిల్ల పుట్టగానే 2 మొదలు 4 కిలోగ్రాముల బరువు ఉంటుంది. మొదటి మూడు నెలలలోనూ పిల్లలు త్వరగా ఎదుగుతాయి. సామాన్యంగా 3 మొదలు 16 వారాల ప్రాయంలో స్తన్యం మానిపించాలి. అయిదారు నెలల ప్రాయం వచ్చేసరికి, గొర్రెపిల్లలు బజారులో అమ్మకం కోసం క్రొవ్వబెట్టడానికి యోగ్యంగా ఉంటాయి. పద్దెనిమిది నెలలు వచ్చేసరికి అవి పూర్తిగా ఎదిగి పోతాయి. సగటున, యుక్తవయస్సు వచ్చిన గొర్రెలు 20–30 కిలోగ్రాముల వరకున్నూ, పొట్టేళ్లు 35–45 కిలోగ్రాముల వరకున్నూ బరువు తూగుతాయి. గొర్రెపిల్లల వల్ల మంచి లాభాలు పొందాలంటే, ఎక్కువ కాలం పాలు ఇవ్వడానికి అనుగుణంగా ఉండేటట్టు తల్లిగొర్రెకి మేత పరిస్థితులు కల్పించడం అవసరం.

ఆవుపాలకన్నా గొర్రెపాలలో కొవ్వు పదార్థం, కేసీను, పంచదార పాళ్లు ఎక్కువ ఉంటాయి. గొర్రెపాలు పసుపుపచ్చగా ఉంటాయి; కొవ్వుపూసలు పెద్దవిగా ఉంటాయి. సగటున గొర్రెపాలలో 5.15 శాతం ప్రోటీన్లు, 6.18 శాతం కొవ్వు 4.17 శాతం చక్కెర, 0.93 శాతం ఖనిజాలు, 83.57 శాతం నీరున్నూ ఉంటాయి.

## గొర్రెల మేత

గొర్రెలు పచ్చిక, లేత మొక్కలు, పొలాల మీద మొలిచే కసవు తింటాయి. గొర్రెకి ముట్టె చిన్నదిగా ఉండడం వల్ల, పై పెదవి చీలి ఉండడం వల్ల అది పెద్ద జంతువులకి అలవికాని, గడ్డిపోచలని కూడా కొరకగలదు. ఎప్పుడూ ఒకే బీడులో మెయ్యడం గొర్రెలకి ఇష్టం ఉండదు. గుల్లబారి తేలికమట్టిలో ఉన్న ప్రదేశాలలో ప్రొద్దుటి పూటా, గట్టి నేల ఉన్న ప్రదేశాలలో గల బీళ్లమీద మధ్యాహ్నం పూటా వీటిని మేతక తీసుకు వెళ్లడం మంచిది. చలికాలంలో గడ్డి మీద మంచు పడి ఉండగా మేపకూడదు. వేసవికాలంలో గరికవంటి మొరటు గడ్డి ప్రదేశాలలో మేతకి తీసుకువెళ్లాలి. సాధారణంగా గొర్రెకి రోజుకి 2.5 మొదలు 5 కిలోగ్రాముల వరకూ పచ్చి కసవు కావాలి.

ఒక్క మాంసం కోసం కొవ్వెక్కించే పరిస్థితులలో తప్ప, గొర్రెలకు ధాన్యపు గింజలు పెట్టనక్కరలేదు. జత కట్టించే కాలంలో పొట్టేళ్లకి రోజుకి 250 మొదలు 500 గ్రాముల పౌష్టికమైన మేత కావాలి. జత కట్టించే పొట్టేళ్లకి



భారతదేశంలో వ్యవసాయానికి ఎద్దులు బహుగా ఉపకరిస్తాయి.



గుర్రాలు దర్జాగా ఉండి త్వరతగమనానికి, శిక్షణకి పేరు పడ్డాయి.



జమ్నాపారీ మేకలకి పెద్దపాదుగు ఉంటుంది.



ఒంగోలు పశువులు భారమైనవి. శక్తివంతం అయినవి



సింధీ ఆబోతు



థర్పార్కర్ జాతి ఆవు



ముర్రాజాతి భారతదేశంలో చాలా భాగాలలో కానవస్తుంది



ంటెలు అనేక విధాలుగా ఉపకరిస్తాయి



అసీల్ కోడిపుంజులు పందేలకు ప్రసిద్ధిగాంచినవి.



కోళ్ళ తరువాత. బాతులు పౌల్ట్రీ పక్షులలో ముఖ్యమైనవి



భారతదేశపు గొర్రెలమంద



ఏనుగులని కర్రదుంగలు లాగడానికి వినియోగిస్తారు

వలసిన నాణ్యమైన మేతను, రెండు పాళ్లు దంపిన కాయధాన్యం, ఒకపాలు గోధుమపొట్టు, నూటికి 1 పాలు చొప్పున ఉప్పు కలిపి తయారుచెయ్యవచ్చును.

గొర్రెలు ఆరోగ్యంగా ఉండడానికి పరిశుభ్రమైన మంచినీరు అవసరం. గత్యంతరం లేకపోతే గుంటల్లో నిలవ ఉన్న నీరు త్రాగుతాయి కాని గొర్రెలకి చిన్న చిన్న ఏళ్లు, వాగులు మొదలైన వాటినుంచి పారుతూన్న నీరు త్రాగడం అంటే ప్రీతి. ఎప్పుడు నీరు పెట్టడానికి వీలుగానూ, పరిశుభ్రం చెయ్యడానికి అనువుగానూ ఉన్న తొట్టెలలో నీరు గొర్రెల ఆరోగ్యానికి తోడ్పడుతుంది. గొర్రెలకి వచ్చే జబ్బులు చాలవరకు నిలవ ఉన్న మురికి నీరు త్రాగడం వల్లనే కలుగుతాయి.

## గొర్రెల ఆలనా, పాలనా

సహజంగా గొర్రెలు సాధు జంతువులు. మందగొర్రె వెంబడే పోయే సహజ జ్ఞానం వాటికి ఉంది. పొలాల మీదకూ పచ్చిక బయళ్లకూ మందలను తోలుకు వెళ్లినప్పుడు, ఈ అలవాటు బాగా ఉపకరిస్తుంది.

పశువులూ, గుర్రాలలాగ కాకుండా, గొర్రెలు ఏడాదిలో చాలా భాగం ప్రకృతి పరిస్థితులలోనే మందలు మందలుగా పెంచబడుతున్నాయి. ఒక్కొక్క గొర్రె విషయంలోనూ ప్రత్యేకించి శ్రద్ధ తీసుకోవడం లాభదాయకమూ కాదు, సాధ్యమూ కాదు. అంచేత మందను సంబాళించడానికి - జరిపే ప్రక్రియలన్నీ శీతోష్ణస్థితి, మేత పరిస్థితులూ, మార్కెటు పరిస్థితులూ అనుకూలంగా ఉన్నప్పుడే జరిపించాలి.

గొర్రెలను వీలయినంతవరకూ ప్రకృతి సిద్ధమైన పరిస్థితులలోనే పెంచాలి. వాటికి ప్రత్యేక సదుపాయాలు ఏమీ అవసరం లేదు. నేల పొడిగా ఉన్న బయలు ప్రదేశంలో ఉండడం వాటికి మంచిది. అయితే రాత్రి మాత్రం, అననుకూలమైన వాతావరణం వల్లా, అడవి జంతువుల వల్లా ఎట్టి ప్రమాదమూ లేకుండా రక్షణ ఏర్పాటు చెయ్యాలి; సామాన్యంగా, బయలుగా ఉండే ప్రదేశంలో తుమ్మవంటి ముళ్లు గల కంచె వేసిన ఆవరణ ఉంటే సరిపోతుంది. అందులో ఒకవేపుకి రాటలు పాతి చొప్పతోగాని వాటి కమ్మితోగాని కప్పి ఉంచాలి. గొర్రె ఒక్కటికి ఒకటి లేక రెండు చతురపు మీటర్ల జాగా ఉండేటట్టు చూసుకోవాలి.

## ఉన్ని కత్తిరింపు

గొర్రెల ఉన్ని బొచ్చె, వాటిని అననుకూల వాతావరణం నుంచి కాపాడుతుంది. అంచేత మరీ ఎండగా ఉన్నప్పుడుగాని, మరీ శీతాకాలంలోగాని కాకుండా, చూసుకుని వాటి ఉన్ని కత్తిరించాలి. అమితంగా వర్షం పడినప్పుడు వీచే చలిగాలివల్ల, అప్పుడే ఉన్ని కత్తిరించిన గొర్రెల ఆరోగ్యం దెబ్బ తింటుంది. కాబట్టి సామాన్యంగా వర్షాకాలం చివరగాని, వేసవికాలం ఆరంభంలోకాని ఉన్ని కత్తిరిస్తారు. చాలాచోట్ల ఏడాదికి రెండుసార్లు కత్తిరించడం కూడా కలదు.

ఉన్ని కత్తిరించే ముందు గొర్రెలని బాగా కడగాలి; కాని కత్తిరింపు ఆరంభించే వేళకి, వాటి బొచ్చు బాగా పొడిగా ఉండాలి. ఉన్ని కత్తిరించే ప్రక్రియ, ధూళి రానటువంటి, పొడిగా ఉండే జాగాలో జరిపించాలి. వేరు వేరు నాణ్యతలు గల ఉన్ని కలిపివెయ్యకూడదు. కాళ్లమీద, కడుపుపైన, తొడలయందు ఉండే రోమాలు కలిసిపోతే ఉన్ని యొక్క నాణ్యత తగ్గిపోతుంది. బాగా పదునుపెట్టిన కత్తెర ఉపయోగించడం వలన పని త్వరగా సాగి, కత్తిరింపు సమతలంగా ఉంటుంది.

ఉన్ని యొక నాణ్యత, పోగులు యొక్క స్థితిస్థాపక గుణాన్ని బట్టి, పోగుల యొక్క సమరూపాన్ని బట్టీ ఉంటుంది. ఉన్ని శ్రేష్ఠమైన కొద్దీ, సామాన్యంగా పోగు కురచగా ఉంటుంది. భారతదేశంలో లభ్యం అయ్యే ఉన్నిలో చాలాభాగం రోమభూయిష్ఠం అయి ముతకగా ఉంటుంది. ఈ ఉన్ని సాధారణంగా రంగులో ఉండడంచేత, శ్రేష్ఠమైన బట్టలు తయారు చెయ్యడానికి పనికిరాదు. ఇది ఇలా ఉన్నప్పటికీ, తివాసీలు చెయ్యడానికి యోగ్యమైన మేలు తరగతి ఉన్ని, ప్రపంచంలో కల్లా భారతదేశంలోనే లభిస్తోంది. భారతదేశంలో గొర్రె 1 కి సాలీనా లభ్యమయ్యే ఉన్ని 340 మొదలు 1,800 గ్రాముల వరకూ ఉంటుంది.

## గొర్రె వయస్సు నిర్ణయించుట

గొర్రెల వయస్సు వాటి పళ్లవల్ల తెలుసుకోవచ్చును. గొర్రెకి 8 పళ్లు 24 దంతాలు ఉంటాయి. ఈ పళ్లు క్రింది దవడకే ఉంటాయి. గొర్రెపిల్లకి పాలు తాగే వయస్సులో 8 పాలపళ్లు ఉంటాయి. పుట్టిన నెలలోగా యీ పళ్లు వస్తాయి. 12-14 నెలల ప్రాయంలో మధ్యనుండే రెండు స్థిరమైన పళ్లు రావడంతోనే, పాల పళ్లు పోవడం ఆరంభం అవుతుంది. 24-26 నెలలకి

రెండవ జత స్థిరమైన పళ్లు వస్తాయి. 36 నెలలకి మూడవ జత పళ్లు వస్తాయి. 4వ జత కత్తెర పళ్లు నాలుగవ ఏట వస్తాయి. ఆ తరవాత పళ్ల యొక్క రంగు మారడాన్ని బట్టి, వాటి అరుగుదలని బట్టీ, గొర్రె యొక్క వయస్సు నిర్ణయించవచ్చును.

## గొర్రెలకు సామాన్యంగా వచ్చే జబ్బులు

గొర్రెలు అనేక వ్యాధులకు గురి అవుతాయి. వీటికి సంక్రమించే అంటు వ్యాధులు చాలావరకు గొర్రెల ఆలన పాలనలో ఉండే లోపాల వల్ల కలుగుతున్నాయి. సులువుగా చూచుకోవడానికి అనువుగా లేకుండా చాలా గొర్రెల్ని పెంచబూనడం, తడిగా ఉన్న పల్లపు భూముల్లో మేతకి తీసుకువెల్లడం, అకస్మాత్తుగా స్థలం మార్పులూ, మేత మార్పులూ చెయ్యడం గొర్రెల జబ్బులకి ముఖ్య కారణాలు. తరచుగా వీటికి శరీరంపైనా లోపునా ఉన్న క్రిముల వల్ల కీడు గలుగుతుంది. మందు పిచికారీ చేయడం, మందులతో కడగడం, బాహ్యంగా ఉండే క్రిములని నాశనం చెయ్యడానికి ఆవశ్యకం. అంతరంగంగా ఉండే క్రిములని, ఆహార విహారాలలో తగిన శ్రద్ధ తీసుకోవడం వల్ల ఆరోగ్యప్రదమైన పరిస్థితులలో గొర్రెలని పెంచడం వల్ల అరికట్టవచ్చును.

మిగతా పశువులలో కనిపించినంత సులభంగా, జబ్బు సూచనలు గొర్రెలలో కనిపించవు. ఎంతో జబ్బుతో ఉన్నప్పటికీ, గొర్రెలు తమ దైనందిన చర్య కొనసాగిస్తూనే ఉంటాయి. గొర్రె యొక్క కళవళికలు ఎంతో సూక్ష్మంగా పరిశీలిస్తేనే గాని, అది జబ్బుపడిన దన్న సంగతి తెలియదు. గొర్రె జబ్బుపడినదని తెలిసే లక్షణాలు ఏమిటంటే, తీవ్రంగా జ్వరం రావడం, నెమరు వెయ్యడం మానెయ్యడం, శ్వాస పీల్చుకోవడంలో కష్టపడడం, దగ్గులు, తుమ్ములు, విరేచనాలూ, తూలుతూ నడవడమున్నూ. మందలో తిరగడం వల్ల గొర్రెలలో అంటువ్యాధి అతి త్వరగా వ్యాపిస్తుంది. అంచేత వెంటనే తగిన శ్రద్ధ తీసుకోవాలి.

ఆరోగ్యంగా ఉన్న గొర్రెయొక్క శరీరపు ఉష్ణత 39.4 డిగ్రీలు సెంటుగ్రేడు (103 డిగ్రీలు ఫారన్‌హీటు) నాడి రేటు నిమిషానికి 68 మొదలు 90 వరకు ఉంటుంది. శ్వాసరేటు నిమిషానికి 28 మొదలు 30 దాకా ఉంటుంది.

గొర్రెలకి సాధారణంగా వచ్చే అంటు వ్యాధులు ఏవిటంటే మశూచి, జబ్బవాపు, గొంతువాపు, దొమ్మ.

గొంతువాపు గొర్రెలకి సంక్రమించే తీవ్రమైన అంటువ్యాధి. ఇది సంక్రమిస్తే, మందలో పశువులు త్వరలో వరసగా చనిపోతాయి. ఈ వ్యాధి యొక్క లక్షణాలు : శ్వాసకోసం ఇబ్బంది పడడం, గురగుర ధ్వని, తీవ్రమైన జ్వరం, అపారంగా విరేచనాలు కావడం, గొంతువాపున్నూ.

ఈ అంటువ్యాధి రాకుండ ఉండడానికి వ్యాధి నిరోధక ప్రక్రియలు ఆచరించాలి. వ్యాధి అంటిన పశువులని వెంటనే వేరుపరచాలి. గొర్రెలకి వ్యాధి అంటకుండా, టీకాలు వేయించాలి.

దొమ్మ అనేది గొర్రెలకి సంక్రమించే ప్రాణహానికరమైన అంటువ్యాధి. ఇది మనుష్యులకి కూడా సంక్రమిస్తుంది. ఊలు కర్మాగారాల్లో పనిచేసే వారికి శ్వాసద్వారా యిది సంక్రమిస్తుంది. గాయాల ద్వారా కూడా యీ వ్యాధి వస్తుంది. దొమ్మ యొక్క ముఖ్య లక్షణాలు : తీవ్రమైన జ్వరం, గొంతు నాలిక వాపులున్నూ, వ్యాధి వచ్చిన వెంటనే సుమారు ఆరుగంటలులోగా పశువు చనిపోతుంది.

వ్యాధి సోకిన పశువులని వేరుచెయ్యడం, వ్యాధి సోకి చనిపోయిన వాటిని తగలబెట్టించిగాని, లేదా లోతైన గోతుల్లో సున్నపునీళ్లు వేసి పూడ్పించి గాని పరిష్కారం చెయ్యాలి. వ్యాధి వ్యాపించే కాలానికి ముందుగా గొర్రెలకి టీకాలు వేయించాలి. ఇవి ఈ వ్యాధి నిరోధక మార్గాలు.

మశూచి గొర్రెలకి వచ్చే మశూచి స్థానికంగా కొన్ని తావులలో వచ్చే సామాన్యపు వ్యాధి. సామాన్యంగా పిల్లల విషయంలో దీనివల్ల ప్రాణాపాయం కలుగుతుంది. నోటిలోను, వెనుకకాళ్లకి పొదుగుకీ మధ్య పొక్కులు పొక్కడం, తీవ్రం అయిన జ్వరం ఆకలి లేకపోవడం యీ జబ్బు ముఖ్య లక్షణాలు. జబ్బు రాకుండ ఇంజక్షన్లు ఇప్పించడం, వ్యాధి సోకిన పశువులని వేరు చెయ్యడం, ఆరోగ్యప్రదమైన పద్ధతులు అనుసరించడం శ్రేయస్కరం.

జబ్బవాపు అనేది గొర్రెలకి సామాన్యంగా వచ్చే జబ్బు. సాధారణంగా ఇది ఉన్ని కత్తిరించినప్పుడు కలిగిన గాయాల వల్లగాని, ఈనే కాలంలోగాని వస్తుంది. తీవ్రం అయిన జ్వరం, కుంటుతనం యీ జబ్బు ముఖ్యలక్షణాలు.

ఈ వ్యాధి సోకిన జంతువులపై ఏ మందూ సరిగా పనిచెయ్యదు కనక వ్యాధి రాకుండా ముందుగానే ఇంజక్షన్లు ఇప్పించడం ఒక్కటే తరణోపాయం.

# III. మేకలు

## ఉపోద్ఘాతం

మేక పేదవానిపాలిట ఆవు అని ప్రపంచం అంతటా వ్యవహరించ బడుతోంది. స్విట్జర్లాండులో మేకను బిడ్డకి పెంపుడు తల్లి అంటారు. ఇంచుమించుగా ఎటువంటి శీతోష్ణస్థితికైనా సులువుగా అలవాటు పడగల జంతువు మేక. ఇది చాలా ఓరిమి గలది. సంతానబాహుళ్యం గలది. ఎక్కువ ఖర్చు అవసరం లేకుండా పెంచడానికి వీలయిందిన్నీ. మిగతా పశువులు ఏదీకూడా తిని బ్రతుకలేని గ్రాసంతో మేక జీవించగలదు. ఈ కారణంచేత గ్రామీణ ప్రాంతాలలో భూవసతి లేని శ్రామికులు అనేకులు మేకలని పెంచడం ఒక వృత్తిగా పెట్టుకుంటారు.

మేకపాలు చాలాపుష్టికరమైనది, పోషకమైనదిన్నీ-సులువుగా జీర్ణంఅవుతాయి కనక ఈపాలు ముఖ్యంగా జబ్బునుంచి కోలుకొంటున్నవారికీ, పిల్లలకీయోగ్యంగా ఉంటాయి. 1991 సం॥ లో ప్రపంచంలోని మేకపాల ఉత్పత్తియైన 10 మిలియన్ల టన్నులలో భారతదేశంలో 2మి.టన్నుల మేకపాలు లభ్యమైనాయి

భారతదేశంలో మేకమాంసం ఎక్కువగా వాడుకలో ఉంది. మిగతా మాంసాల కంటే జనులు మేకమాంసం అంటే ఎక్కువ ఇష్టపడతారు. పట్టణపు మార్కెట్లలో చాలావరకు గొడ్డుమాంసం గొర్రెమాంసం కంటె, మేక మాంసానికి ఎక్కువ ధర వస్తుంది. ఎఫ్.ఎ.ఓ. అంచనా ప్రకారం — భారతదేశంలో 1991 సం॥ లో రూ. 2300 కోట్ల విలువచేసే 586,000 మెట్రిక్ టన్నుల మేక మాంసం ఉత్పన్నం అయింది.

చేతి మేజోళ్లకీ, జోళ్లకీ మేకతోళ్లు ఎక్కువ అవసరం. 1959-60 సం॥ రాలలో రూ. 131.7 మిలియన్ల విలువగల 30.3 మిలియనుల మేకతోళ్లు ఉత్పత్తి చెయ్యబడ్డాయి. అంగోరాజాతి మేకల వల్ల లభించే "మొహియిర్" కీ, కాశ్మీరపు మేకల వల్ల లభించే "పశ్మీనా" లకీ ఎంతో విలువ. వీటినుండి నాణ్యమైన దుస్తులకి పనికివచ్చే ఉన్నివస్త్రాలూ, శాలువలూ తయారు చేస్తారు. 1959-60 లో రూ. 11.9 మిలియన్లు విలువచేసే 4,516 మెట్రికు టన్నుల మేకరోమం ఉత్పన్నం అయింది. మేక పేగులతో "కాట్‌గట్"

తయారు చేస్తారు. మేక రోమం తాళ్లు పేనడానికి కూడా ఉపయోగపడుతుంది. మేకరోమం ఉత్పత్తి 1991 సం॥ లో దాదాపు రెండింతలుగా పెరిగింది.

మేక, చెట్లచిగుళ్లు కోరికి తింటుంది ఏ రకమయిన మొక్కలయినా ఇది మెయ్యగలదు. అంచేత ఇది మొక్కలకు శత్రువు. ఇది ఎడాపెడా మొక్కలను తినివేయడం వల్ల భూమి నాశనం అయిపోతుంది. అయితే యీ అనర్థం మేకలని సక్రమంగా పెంచకపోవడం వల్ల సంభవిస్తుంది సరి అయిన పద్ధతులలో వాటిని గురించి శ్రద్ధ తీసుకొన్నట్లయితే, మేతకి సంబంధించిన వాటి అలవాట్లలో మంచి మార్పు తీసుకురావచ్చును.

1991 సం॥ లో ప్రపంచపు మొత్తం మేకల సంఖ్య 574 మిలియన్లు. వాటిలో భారతదేశంలో 112 మిలియన్ల మేకలు ఉండేవి 1977 సం॥ లో దాదాపు 75.6 మిలియను మేకలుండేవి. 1982 సం॥ ము లెక్కల ప్రకారం దేశంలోని మేకల సంఖ్య 95.3 మిలియన్లకు పెరిగింది.

1982 సం॥ లోని మేకల సంఖ్య రాష్ట్రాల వారీగా 5.56 మిలియన్లు ఆంధ్రప్రదేశ్‌లో, 1.73 మిలియన్లు అస్సాములో, 12 22 మిలియన్లు బీహార్‌లో, 3.3 మిలియన్లు గుజరాత్‌లో, 0.61 మిలియన్లు హర్యానాలో, 1.06 మిలియన్లు హిమాచల్‌ప్రదేశ్‌లో, 1.0 మిలియన్లు జమ్మూ,కాశ్మీర్‌లో, 4.55 మిలియన్లు కర్నాటకలో, 2.0 మిలియన్లు కేరళలో, 7.57 మిలియన్లు మధ్యప్రదేశ్‌లో, 7.7 మిలియన్లు మహారాష్ట్రలో, 4.93 మిలియన్లు ఒరిస్సాలో, 0.7 మిలియన్లు పంజాబులో, 15.48 మిలియన్లు రాజస్థాన్‌లో, 5 25 మిలియన్లు తమిళనాడులో, 9.69 మిలియన్లు ఉత్తరప్రదేశ్‌లో మరియు 10.92 మిలియన్లు మేకలు పశ్చిమ బెంగాలులోనూ ఉండేవి

## ముఖ్యమైన మేక జాతులు

భారతదేశంలో విలక్షణమైన మేకజాతులు అనేకం ఉన్నాయి. వాటిలో ముఖ్యమైనవి కాశ్మీరీ, గద్దీ, చంబా, పశ్మీనా, జమ్నాపారీ, బీతల్, మార్వారీ, ఒస్మానా, బాడీ, బర్బారీ, మలబారీ, బెంగాలు జాతులు.

కాశ్మీరీ మేకలు కాశ్మీరు, టిబెట్టు దేశాల కొండ ప్రాంతాలలో కానవస్తాయి. ఇవి మైదానపు భూములలో గాని, చెమ్మగా ఉండే వాతావరణంలోగాని పెంపొందవు. ఇవి సామాన్యంగా తెల్లరంగులోకాని, తెలుపూ-నలుపూ కలిసి

గాని ఉంటాయి. వీటి కొమ్ములు పొడవుగా, వంకర తిరిగి ఉంటాయి. చెవులు నిడుపుగా ఉంటాయి. వీటి శరీరం మీద సన్నమైన పట్టువంటి రోమం ఉంటుంది దీని క్రింద చర్మాన్ని అంటిపెట్టుకొని చాలా మృదువుగానూ, వెచ్చగానూ ఉండే బొచ్చు ఉంటుంది. దీనికి పశ్మీనా అని పేరు శరీరాన్ని అంటిపెట్టుకొని ఉన్న యీ బొచ్చు శీతాకాలంలో పెరుగుతుంది. వసంత ఋతువులో రాలిపోతుంది. ఈ మేకలని 8, 10 రోజులదాకా దువ్వెనతో దువ్వి, యీ బొచ్చు సేకరిస్తారు. పొడుగ్గా పట్టువలె ఉన్న రోమాన్ని తరవాత కత్తిరిస్తారు ఈ పొడుగాటి రోమంతో సాధారణంగా తాళ్లు, నమ్దాలనే దట్టమైన ఉన్ని తివాసీలు నేస్తారు. ఈ జాతి మేకలని సామాన్యంగా బరువులు మొయ్యడం కోసం, మాంసం కోసం, ఉపయోగిస్తారు. ఈ జాతి మేకలు పాలు చాలా తక్కువగా యిస్తాయి.

గద్దీ, చంబా జాతుల మేకలు హిమాలయ ప్రాంతాలలో పంజాబులో కంగ్రా లోయ ప్రాంతాలలోనూ, హిమాచలప్రదేశ్‌లో గల చంబా, సిర్మూర్, సిమ్లాల్లోనూ కానవస్తాయి ఈ జాతుల మేకలు శరీరపుష్టి కలిగి, దృఢంగా ఉంటాయి ఇవి ఎక్కువ దూరం నడవగలుగుతాయి వీటికి ముట్టె ఆదోకగా ఉంటుంది; కళ్లు చురుగ్గా ఉంటాయి. ముక్కు చెక్కినట్టు తీరువగా ఉంటుంది. చెవులు సూదిగా ఉండి, వ్రేలాడుతూ ఉంటాయి. వీటి కొమ్ములు కొనల వద్ద సూదిగా వుండి, పైకి పెరిగి, వెనుకకు వంగి ఉంటాయి. వీటి రోమం పొడవుగా, ముతుకగా ఉంటుంది. సామాన్యంగా ఇవి తెల్లరంగులో ఉంటాయి. కాని బూడిదరంగులోనూ, ఎరుపు రంగులోనూ ఉన్నవికూడా ఉన్నాయి. ఈ మేకల పొడుగు చిన్నది అయినా మొనదేరిన సిరాలతో పొందికగా ఉంటుంది. వీటి మాంసం కొవ్వు లేనిదై, ముతకగా ఉంటుంది.

పశ్మీనామేకలు చాలావరకు పంజాబులోగల లడక్, లహౌల్, స్పిటి లోయల లోనూ, హిమాచలప్రదేశ్‌లో గల చీనీ లోయలలోనూ ఆ పరిసరాలలోనూ కానవస్తుంది. 12,000 మొదలు 14,000 అడుగుల ఎత్తులో ఉన్న ఛాన్‌థాంగ్ ప్రాంతంలో యీ జాతి మేకల మందలు పెద్దపెద్దవి కానవస్తాయి.

పశ్మీనా మేక త్వరిత గమనం గల, నాజూకైన చిన్న పశువు. దీని వీపు సమతలంగా ఉండి, పృష్ఠభాగమందు కొంచెం వాలి ఉంటుంది. దీని చెవులు

పొడవుగా ఉండి, వేలాడుతూ ఉంటాయి. ముఖం మీద చాలాభాగం, ముతుక రోమంతో కప్పబడి ఉంటుంది. పొడవుగానూ, మృదువుగానూ ఉండే "పశ్మీనా" శరీరపు ప్రక్క భాగాలపైనా, భుజముల దగ్గిర, పెరుగుతుంది. ఈ మేకలు చాలావరకు తెల్లరంగులో ఉంటాయి; అయినా మట్టిరంగులోనూ, బూడిదరంగులోనూ, ఉన్నవి కూడా లేకపోలేదు. కొండప్రాంతాలలో, ముఖ్యంగా ఎత్తైన తావులలో, రవాణా పనులకి యీ మేకలని ఉపయోగిస్తారు

జమ్నాపారీ ముఖ్యంగా గంగా, యమున, చంబల్ నదుల ప్రాంతాలలో పెంచబడుతోంది. సంకరంలేని ఈ జాతి మేకలు ఉత్తరప్రదేశ్‌లో ఎటావా జిల్లాలో కానవస్తాయి. ఈ జాతి, మాంసానికీ, పాలకీ కూడా వినియోగ పడుతుంది. ఈ మేకలు దృఢంగానూ, చురుకుగానూ ఉండి, మోటు అయిన గ్రామీణ పరిస్థితులలో పెంపొందుతాయి.

భారతీయ మేకల జాతులలో, బహుశా, యీ జాతి మిక్కిలి చక్కనైన జాతి వీటి శరీరం పొడవుగా ఉంటుంది. కొమ్ములు కురచగా, బల్లపరుపుగా ఉంటాయి చెవులు వెడల్పుగానూ, పొడవుగానూ ఉండి వేలాడుతూ ఉంటాయి. వీటి ముక్కు స్ఫుటంగా, శిల్పకారుడు చెక్కినట్టుఉంటుంది. వీటి పొదుగుపెద్దది, సిరాలుపెద్దవే

బీతల్ జాతి ముఖ్యంగా పంజాబులో కానవస్తుంది. ఈ మేకలు జమ్నాపారీజాతిని పోలి ఉంటాయి కాని, పరిమాణంలో చిన్నవి ఇవి బహుళ సంతతినిస్తాయి. పాలుకూడా ఎక్కువ పరిమాణంలోనే యిస్తాయి ఈ జాతి మేకలకి లేత కొమ్ములు మెయ్యడం మిక్కిలి ప్రీతి స్వేచ్ఛగా సంచరించడానికి వీలుగా ఉండే బయళ్లలో యివి బాగా పెంపొందుతాయి

బీతల్ జాతి మేకల చెవులు పొడవుగా, బల్లపరుపుగా ఉండి, వేలాడుతూ ఉంటాయి. వీటి ముక్కు జమ్నాపారీ జాతి వాటిలాగే, శిల్పి చెక్కినట్టుగా, సొగసుగా ఉంటుంది. వీటి కొమ్ములు వంకర తిరిగి, వెలుపలికి పెరిగేటట్టు స్ఫురిస్తూ ఉంటాయి. సామాన్యంగా, మేకలకి స్పష్టమైన గడ్డం ఉంటుంది. ఈ జాతి మేకలు సాధారణంగా ఎరుపురంగులోగాని, కమిలిన మట్టిరంగులోగాని ఉంటాయి. తరుచుగా తెల్లటి శరీరం మీద మచ్చలతో ఉంటాయి.

మార్వారీ జాతి మేకలు రాజస్థాన్‌లోగల మార్వారు ప్రాంతంలో పెంచబడుతున్నాయి. ఇవి దృఢమైన శరీరం గలవి. వీటికి సులువుగా వ్యాధి రాదు. మంచి మాంసానికి ఇవి పెట్టింది పేరు.

మార్వారీ మేకలు మధ్యమ పరిమాణంలో ఉంటాయి. వీటికి ముట్టె చిన్నది. వీటి యొక్క ముక్కు ఎముక స్థూలంగా ఉంటుంది. వీటి మెడ లావుగానూ, చెవులు మెత్తగానూ, కొమ్ములు వంకరలు తిరిగి సూదిగానూ ఉంటాయి. దవడలపైని గడ్డం దట్టంగా ఉంటుంది. దీని తోక పైకి వంగి ఉంటుంది. తోకమీది వెంట్రుకలు ఒత్తుగా ఊర్ధ్వముఖంగా ఉంటాయి. శరీరం మీది వెంట్రుకలు కారు నలుపు రంగులో నిగనిగలాడుతూ ఉంటాయి.

ఉస్మానాబాదీ జాతి మేకలు ఆంధ్రప్రదేశ్‌లో ఉస్మానాబాద్ జిల్లాలో ముఖ్యంగా కానవస్తాయి. ఈ మేకలు పెద్ద పరిమాణంలో ఉంటాయి. ఈ జాతి పాలకూ, మాంసానికీ కూడా ఉపయోగపడుతుంది. వీటి కొమ్ములు పొడుగుగా ఉంటాయి. సామాన్యంగా ఈ మేకలు నల్లరంగులో ఉంటాయి. తెలుపు, నలుపు, ఎర్ర రంగుల్లో ఉన్నవి కూడా కానవస్తాయి.

బర్బారీ జాతి మేకలు తూర్పు ఆఫ్రికా దేశంలో గల బ్రిటిష్ సొమాలీ లాండులో ఉన్న బేర్బేరా పట్నం నుంచి వచ్చేయి అంటారు. భారతదేశంలో యీ జాతి మేకలు, ఉత్తరప్రదేశ్‌లో గల ఎటావా, ఎటా, ఆగ్రా, మథురవంటి పట్టణాలలో కానవస్తాయి. ఇది విశేషించి పాడిజాతి మేక. దీని పరిమాణం చిన్నది అవడం వల్ల, దీనినుంచి ఎక్కువగా మాంసం లభించదు. శుభ్రంగా ఉండడం, సాధువైనది అవడం, దొడ్లో పెట్టి మేపడానికి అనువుగా ఉండడం, పశువు చిన్న సైజులో ఉండడం మొదలైన గుణాల వల్ల ఇది కుటుంబంలో ముద్దుగా పెంచడానికి ఆదర్శప్రాయంగా ఉంటుంది. ఈ మేకలు ఎక్కువ సంతతి నిస్తాయి.

బర్బారీ మేకల చెవులు తిన్నగా, పొట్టిగా, పల్చగా ఉంటాయి. కాళ్లు కురుచగా ఉంటాయి. కాలి ఎముకలు చక్కగా బలంగా ఉంటాయి. ఈ మేకలకి పొట్టిగా ఉండి పట్టువలె ఉండే చక్కని రోమరాజి ఉంటుంది. వీటి పొదుగు చక్కగా, గుండ్రంగా, ఉంటుంది. సిరాలు మధ్యమ పరిమాణంలో ఉంటాయి. వీటి రంగు ఫలానా అని నిర్ణీతంగా లేదు. సామాన్యంగా కమిలిన ఎరుపురంగు లేక పసుపుతో కూడిన మట్టిరంగు లేదా నల్లరంగు మచ్చలు కలిసి ఉంటాయి.

విశాలంగా ఉండాలి. ప్రక్క ఎముకలు ప్రస్ఫుటంగా ఉండాలి. దాని లోతొడలు విడమరిచి ఉండాలి. వృషణాలు బాగా పెరిగి పైకి అంటిపెట్టుకొని ఉండాలి. కాని వేలాడుతూ ఉండకూడదు. దాని కాళ్లు తిన్నగానూ, బలిష్ఠంగానూ ఉండాలి. పాలు తక్కువ యిచ్చే మేకకి పుట్టిన పోతుమేక చేత పాడి మేకలని జతకట్టించకూడదు.

## మేకల పెంపకం

ప్రాయికంగా మేకలు త్వరగానే ఋతుకాలానికి వస్తాయి కాని జత కట్టించడానికి అత్యుత్తమమైన కాలం 15-18 నెలల ప్రాయం. రెండేళ్ల ప్రాయంలో తొలిచూలు అవాలి. (పోతు) మేకపిల్లలలో త్వరగానే పుంసత్వం కనిపిస్తుంది. అంచేత రెండు మూడు నెలల వయస్సు వచ్చిన దగ్గరనుంచీ, పోతు మేకపిల్లల్నీ, ఆడ మేకపిల్లల్ని వేర్వేరుగా ఉంచాలి. రెండు మూడు ఏళ్ల ప్రాయంలో పోతుమేక జతకట్టడానికి అతి యోగ్యంగా ఉంటుంది. అయినప్పటికీ, ఒక ఏడాది వయస్సు వచ్చేక పరిమితంగా జత కట్టించవచ్చును. ఆరోగ్యకర పరిస్థితులలో పెంచినట్టయితే, సౌష్ఠవంగా పెరిగిన పోతు మేక ఏడాదికి 75 మొదలు 100 మేకలతో జతకట్టగలదు. అయిదు మొదలు ఏడేళ్ల ప్రాయంలో మేకలు మిక్కిలి ఫలప్రదంగా ఉంటాయి. సగటున మేక సుమారు పన్నెండు సంవత్సరాలు బతుకుతుంది.

ఈనిన తరవాత, సుమారు ఆరు మొదలు ఎనిమిది వారాలకి మేక ఎదకి వస్తుంది. తరువాత తిరిగి చూలు ఉండేదాకా ప్రతీ 18-21 రోజులకీ ఎదకి వస్తూనే ఉంటుంది. బర్బారీ వంటి కొన్ని జాతులు ఏడాదికి రెండు సార్లు సులభంగా చూలుండగలిగినప్పటికీ, ఏడాదికి ఒకసారి చూలుండడమే మంచిది; అలాగయితే, పిల్లల ఆరోగ్యం బాగుంటుంది; తల్లి మేక పాలు యిచ్చేకాలం ఎక్కువ అవుతుంది కూడాను.

ఆవులకు, గేదెలకు, మేకలకు కూడా ఎదకు వచ్చిన చిన్నెలు ఒక్కలాగే ఉంటాయి. ఎదకు వచ్చిన మేక విశ్రాంతి లేకుండా ఉంటుంది; తరచు తోక ఆడిస్తుంది; అదో మోస్తరుగా అరుస్తుంది; మేత అంటే అయిష్టం పుడుతుంది; భగరంధ్రం బాగా ఎర్రబారి ఉబ్బి ఉంటుంది. పాలు

ఉన్నట్టుండి తక్కువ అయిపోతాయి. కట్టు విడిపించుకుని పోవాలని ప్రయత్నిస్తు ఉంటుంది.

వేసవికాలంలో ఎద, ఒకటి మొదలు మూడు రోజుల వరకూ ఉంటుంది; శీతాకాలంలో 24-36 గంటలు మాత్రమే. పిరికి మేకలు ఎదకు వచ్చినట్టు తెలుసుకోవడం కష్టం. భగరంధ్రం కాస్త ఎర్రబారి ఉండడం తప్ప, ఇంకే చిన్నెలూ అవుపించవు. అటువంటి మేకలని జాగ్రత్తగా కనిపెట్టి చూస్తూ ఉండాలి. అత్యుత్తమమైన ఫలితాలు పొందాలంటే, ఎదకాలం ఆరంభం అయిన చిన్నెలు కనపడిన 10-15 గంటల మధ్యకాలంలో జత కట్టించాలి. జత కట్టించే (సీజన్లో) కాలంలో ఒక్కసారి జతకట్టిస్తే చాలు. మేకలు సాధారణంగా 142-152 రోజులవరకూ చూలుతో ఉంటాయి. సగటున 150 రోజులు.

జతకట్టించిన తరవాత రెండున్నర నెలలవరకూ చూలుతో ఉన్న చిన్నెలు కానరావు. ఇక కొద్ది రోజులకు ఈనుతుందనగా, పొదుగు పెద్దది కానారంభిస్తుంది. క్షీర రసగ్రంథులు పనిచేస్తాయి. ఒక్కొక్కప్పుడు, పాలు ఎక్కువగా యిచ్చే మేకలకి, పిల్ల పుట్టకముందే రెండు మూడు సార్లు పాలు పిండవలసి వస్తుంది. ఇంక కొద్ది గంటలకి ఈనుతుందనగా, పార్శ్వభాగం బోలుగా అయిపోతుంది. భగరంధ్రం ఎర్రబడి, ఉబ్బి ఉండి, కొద్దిగా ద్రవిస్తూ ఉంటుంది. మేక ఊరక అరుస్తూ, కాలితో నేలని రాస్తూ ఉంటుంది. మేక పడుకుని ఈనుతుంది. సాధారణంగా, పిల్ల, ముందరికాళ్లపై తల ఉంచుకుని పుడుతుంది. కష్టం లేకుండా ఈనే పక్షంలో, 45 నిమిషాలలో అంతా తెమిలి పోతుంది.

తల్లి మేక బిడ్డ వొంటిని నాకి శుభ్రపరుస్తుంది. పుట్టిన పిల్లకి మూతిపైనా, ముక్కుపైనా ఉండే సన్నటి పొరని శుభ్రమైన బట్టతో తుడిచివెయ్యాలి. పిల్ల బొడ్డు, క్రిమినాశక మందులతో శుభ్రపరచాలి.

సామాన్యంగా పుట్టిన కొద్ది నిమిషాలకే పిల్లలు లేచి నిలుచుంటాయి. రెండు సిరాల నుంచి పాలు ఒకే విధంగానూ, పూర్తిగానూ పిండాలి. సుమారు మూడు నెలల వయసు వచ్చేసరికి, పిల్లకి స్తన్యం మాన్పించాలి. విదేశాలలో పుట్టగానే స్తన్యం మానిపించేస్తారు. పిల్లల్ని పెంచడానికీ, వాటిని ఆరోగ్యంగా

ఉంచడానికీ యీ పద్ధతి మంచిదట. మనుష్యుల పిల్లలకి లాగే మేకపిల్లలకి కూడా బుడ్డీతో పాలు పట్టవచ్చును.

మేకలు చాలాకాలం పాలిస్తాయి. ఈ విధంగా పాలు యిచ్చే ప్రాణ, మేక యొక్క జాతిని బట్టీ, దాని యొక్క ఆరోగ్యస్థితిని బట్టీ, దానికి పెట్టే మేతని బట్టీ ఉంటుంది. ఎక్కువకాలం పాలు ఇవ్వాలంటే, ఈనిన కొద్దికాలానికే తిరిగీ జత కట్టించకూడదు. అలా కట్టిస్తే, పాలిచ్చే నడిమికాలంలోనే మేక ఒట్టిపోతుంది.

మిగతా పశువుల పాలతో పోల్చిచూస్తే, మేకపాలు కొవ్వు పదార్థపు శాతంలోనూ, ప్రోటీన్ల విషయంలోనూ, మనిషిపాలని దగ్గిరగా పోలి ఉంటాయి. మనిషి పాలకంటె వీటిలో చక్కెర పాలు కొంచెం తక్కువగానూ, భస్మపు పాలు కొంచెం ఎక్కువగానూ ఉంటాయి. త్వరగా జీర్ణం అయ్యే గుణం కలిగి ఉండడం వల్ల, మేక పాలు పిల్లలకూ, రోగులకూ, జబ్బునుంచి కోలుకొంటూన్నవారికీ విరివిగా వాడతారు. మేకలకి ఎప్పుడూ క్షయవ్యాధి రాదు. అందుచేత మేకపాలు చాలా క్షేమకరమైనది. సగటున, మేకపాలలో 3.76 శాతం మాంసకృత్తులూ, 4.07 శాతం కొవ్వు పదార్థం, 4.64 శాతం చక్కెర, 0.85 శాతం ఖనిజ పదార్థాలూ, 86.88 శాతం నీరూ ఉంటుంది.

మేకపాలు అదొకరకమైన వాసన వెయ్యడం చేత, అవంటే చాలామందికి కిట్టదు కాని, పాడిమేకలను శుభ్రంగా ఆరోగ్యకరమైన పరిస్థితులలో ఉంచి, పోతు మేకనుంచి దూరంగా ఉంచితే యీ చిక్కు తటస్థించదు. పోతు మేకను పాడి మేకలతో కలియనివ్వడం వల్లనే - ముఖ్యంగా జత కట్టే కాలంలో - పాలకి ఆ వాసన వస్తుంది.

## మేకలకి మేత

మేకల మేత అలవాట్లు విచిత్రంగా ఉంటాయి. అవి అస్తమానం మేత కోసం వెతుక్కుంటూనే ఉంటాయి. వీటికి పొదలమీద లేత ఆకులు మెయ్యడం అన్నా, లేత కొమ్మల చిగుళ్లు నమలడం అన్నా ఎక్కువ ప్రీతి. పూతిక, వేప, మారేడు, తుమ్మ, చింత మొదలైన చెట్ల ఆకులూ, రెమ్మలూ, లేత చిగుళ్లూ ముఖ్యంగా ప్రీతిగా తింటాయి. కొత్తగా గడ్డి మొలచిన బయిళ్ల

మీద కూడా ప్రీతిగా మేస్తాయి. కాని, మేత పదార్థం శుభ్రంగా ఉంటేనేగాని మేక తినదు. మాటవరసకి, కాళ్లక్రింద నలిగిన మేత, మేక ఎన్నడూ మెయ్యదు.

మేకలని ఇంట్లోనే పెంచే పక్షంలో, ఉదయం మధ్యాహ్నం సాయంకాలం, మూడు పూటలా వాటికి మేత పెట్టాలి. మేక స్వభావానికి అనుగుణంగా, మేత మార్చి మార్చి వేస్తూ ఉండాలి. ఇంత మేత పెట్టాలి అని నిర్ధారణగా చెప్పడానికి కాదు కాని, అది ఇష్టంగా తినగలిగినంత మేత ఒక్కొక్కసారీ మేకకి పెట్టాలి. సగటున మేకకి రోజుకి 3.5 కిలోగ్రాముల పచ్చి మేత కావాలి. ఇందులో కొంత భాగం కాయధాన్యాల వల్ల లభించిన గడ్డిరూపంలో గాని, ఎండుటాకుల రూపంలోగాని ఉండవచ్చును. పాడిమేకకి సామాన్యంగా, కాయధాన్యాలు, గోధుమ పొట్టు, తవుడు లేక తెలక పిండి కలిపిన పౌష్టికమైన మేతను 500 గ్రాముల వరకూ అదనంగా ఇవ్వాలి. పౌష్టికమైన మేతకు బదులుగా, తుమ్మ, అడవి రేగుచెట్ల కాయలను వాడవచ్చును. అడవి రేగు పొదలు పొడి ప్రదేశాలలో ఉంటాయి. పాలు ఎక్కువగా యిచ్చే పాడి మేకలకు పౌష్టికమైన మేత ఇతోధికంగా కావాలి. చూలుతో ఉన్న మేకలకి, చివరి రెండు మాసాలలోనూ రోజుకి 225 గ్రాముల కాయధాన్యపు రేషను యివ్వాలి. జత కట్టించే కాలంలో, జత కట్టే పోతుమేకకి రోజుకి 500 గ్రాముల కాయధాన్యపు మిశ్రమం పెట్టాలి.

మేకల మేత క్రమపద్ధతిలో జరగాలి. వాటికి పెట్టే మేత ఎల్లప్పుడు తాజాగానూ, శుభ్రంగానూ ఉండాలి. మేతలో మార్పులు చేసినప్పుడు, అట్టి మార్పులు నెమ్మదిగా చెయ్యాలి కాని ఒక్కసారిగా మేతలో మార్పు తీసుకురాకూడదు. వర్షాకాలపు తొలిరోజుల్లో, మేకలకి, అప్పుడే మొలిచిన లేతగడ్డి ఎక్కువగా పెట్టకూడదు. మేకలు తడిగా ఉన్న ప్రీతిగా తినవు.

మేకకి పెట్టే మేతలో ఖనిజపదార్థాలు ముఖ్యం. మేకకి కావలసిన ముఖ్యమైన ఖనిజపదార్థాలు కాల్షియం, పాస్ఫరస్సున్నూ. ఎముకలపొడి మేతలో కలపడం వల్ల, వీటిని మేకకి లభింపజెయ్యవచ్చును. ఇంట్లోనే పెంచే మేకలకి రోజూ మేతతో పాటు కొద్ది ఉప్పుకూడా చేరుస్తూ ఉండాలి.

ఒక పాలు గోధుమపొట్టు, రెండు పాళ్ళు మొక్కజొన్న, ఒక పాలు అవిసె గింజలపిండిగాని లేదా రెండు పాళ్లు కాయధాన్యం, ఒకపాలు గోధుమపొట్టుగాని

కలిపి మేకలకి యోగ్యమైన రేషను తయారు చెయ్యవచ్చును. కాయధాన్యాలు అన్నీ కూడా మెత్తగా పిండి చెయ్యాలి; తెలకపిళ్లు కూడా మెత్తగా దంపి మరీ మేతకి పెట్టాలి.

సహజంగా మేకలు నీరు ఎక్కువ త్రాగవు. కావలసినంత మేత దొరికే పక్షంలో చాలా మేకలు నీళ్లే త్రాగవు. కాని వాటిని సమంగా ఆరోగ్యంగా ఉంచేటందుకు ఉదయం, సాయంత్రం, వేసవికాలంలో మధ్యాహ్నం, తాజాగా ఉన్న శుభ్రమైన నీరు వాటికి పెట్టాలి. ఏళ్లనుంచి, వాగుల నుంచి పారుతూన్న నీరు మేకలు ప్రీతిగా త్రాగుతాయి.

## మేకలసాల

గ్రామీణ పరిస్థితులలో మేకలకి ప్రత్యేకించి వసతులూ ఏర్పాట్లూ అవసరం లేదు. కాని అననుకూల వాతావరణం నుంచీ అడవి జంతువుల నుంచీ, చీడ తగలకుండానూ, వాటికి రక్షణ సదుపాయం చెయ్యాలి. మేకలు సాధారణంగా చలికి తట్టుకోలేవు. అంచేత వాటిని, ముఖ్యంగా శీతాకాలంలో, సౌఖ్యంగా వెచ్చగా ఉండే జాగాలో ఉంచాలి. మేకల్ని ఉంచే వసతి నిర్మించడానికి ఎక్కువ ఖర్చు అవసరం లేదు. తావు మాత్రం పరిశుభ్రంగానూ, గాలి సోకేదిగానూ, చెమ్మనేల కాకుండానూ, గాడ్పుల తగలకుండానూ ఉండాలి. మురికినీరు పోవడానికి వీలుగా సదుపాయం ఏర్పరచాలి.

మేకపిల్లల్ని, ముఖ్యంగా శీతాకాలంలో, వెచ్చనితావులో ఉంచాలి. మేకపాలు గబ్బువాసన కొట్టకుండా ఉండడానికోసం, పోతుమేకని పాడి మేకల నుంచి వేరుగా ఉంచాలి.

## మేకల ఆలన పాలన

జత కట్టించడానికి అవసరం లేని పోతు (మేక) పిల్లలకి పిన్నవయస్సులోనే విత్తులు కొట్టించాలి. 10-12 వారాల ప్రాయంలో యీ పని చెయ్యడం చాలా మంచిది. మేకలకి, గొర్రెలకి ముఖ్యంగా ఉద్దేశింపబడిన, చిన్నసైజు 'బుర్డిజ్జో' సాధనం యీ పనికి శ్రేష్ఠమైనది. ఈ సాధనం ఉపయోగించడానికి ఎక్కువ నేర్పుగాని, అనుభవం గాని అక్కర్లేదు. విత్తులు కొట్టిన పోతుమేకలు

వేగంగా బలుస్తాయి. అవి గబ్బువాసన కొట్టవు. విత్తులు కొట్టడం వల్ల మాంసం తాలూకు నాణ్యత కూడా హెచ్చవుతుంది.

మేకలకి రోజుకి రెండుసార్లు పాలు తియ్యవచ్చును. రోజూ ఉదయ సాయంకాలలో సాధ్యమైనంతవరకూ ఒకే నియమితమైన వేళ పెట్టుకుని, పాలుతీస్తూ ఉండాలి. పాలు తీసేటప్పుడు మేకకి వెనుకతట్టునగాని, ఎడమ ప్రక్కగాగాని కూర్చుని పాలు తియ్యవచ్చును. ఎడమ ప్రక్కన కూర్చుని పాలు తియ్యడం ఎక్కువ వీలుగానూ, శుభ్రంగానూ ఉంటుంది. పాలు పితికేటప్పుడు, మృదువుగా, తొందరగా తొందరగా, పూర్తిగా పితకాలి. రెండు సిరాల నుంచి ఒకే విధంగా పితకాలి. పాలు పితికేటప్పుడు పరిశుభ్రత అవసరం. పాలు పితికే మనిషి, పాలు పితికే ముందు శుభ్రంగా కడుక్కోవాలి. శుభ్రమైన తడిగుడ్డ పెట్టి పొదుగూ, సిరాలూ తుడవాలి. పాలు పితికే పాత్రలు బాగా కడిగి శుభ్రంగా ఉంచాలి. పితికే జాగా కూడా పొడిగానూ, పరిశుభ్రంగానూ ఉంచాలి.

గొర్రెలకన్న మేకలకి మందగా తిరిగే సహజగుణం తక్కువ. అంచేత మేకలని తోలుకు వెళుతూన్నప్పుడు, ఆరుబయట మేతకి తీసుకు వెళుతూన్నప్పుడు, అవి మందలోంచి తప్పిపోకుండా ఎక్కువ జాగ్రత్తపడాలి.

మృదువైన కుంచెతో మేకకి రోజూ మాలీసు చెయ్యాలి. ఇలాగ చేస్తే పశువు శుభ్రంగా ఉండడమే కాకుండా, దాని చర్మం నిగనిగలాడుతూ ఉంటుంది. ఇలాగ రుద్దడం వల్ల రక్తస్రావం అధికమయి మేక ఆరోగ్యం పెంపొందుతుంది.

నిడుపుగా (పొడవుగా) రోమం ఉన్న జాతుల పోతు మేకలకి సాధారణంగా రోమం కత్తిరిస్తారు. ఇలా చెయ్యడం వల్ల అవి శుభ్రంగా ఉంటాయి. ఈ మేకల ముఖము, ముందుకాళ్లు రోజూ కడగాలి. ఎంచేతనంటే పోతుమేకలకి మొహం మీద, ముందరికాళ్ల మీదా చిమ్మేటట్టు మూత్రవిసర్జన చెయ్యడం ఒక అలవాటు.

ఇంట్లో పెంచే మేకల విషయంలో, పాదాల గురించి ముఖ్యంగా శ్రద్ధ తీసుకోవలసి ఉంది. కనీసం నెలకి ఒకసారి అయినా డెక్కకత్తెరతో డెక్కలని అరికాళ్లతో సమంగా ఉండేటట్టు కత్తిరించాలి.

## మేకలకి సామాన్యంగా వచ్చే జబ్బులు

మిగతా ఇతర పెంపుడు పశువులలాగ కాకుండా, మేకలకి అపాయకరమైన వ్యాధులు తక్కువగా వస్తాయి. అయినప్పటికీ, మేకలలో పరాన్నభుక్కులయిన క్రిములవల్ల సామాన్యంగా వ్యాధి కలుగుతూ ఉంటుంది. దీనివల్ల తరుచుగా ప్రాణనష్టం కూడా కలుగుతుంది.

మేకలలో సామాన్యంగా కనిపించే అనారోగ్య లక్షణాలు; పశువు మందంగా ఉండడం, జ్వరతీవ్రత, శ్వాస - నాడీ ఎక్కువ కావడం, ఆకలి మందగించడం, నమలడం, మానివెయ్యడం, ఉన్నట్టుండి పాలు తగ్గిపోవడం.

మేకయొక్క దేహపు సామాన్య ఉష్ణత 39.4 డిగ్రీలు సెంటిగ్రేడు (103 డిగ్రీలు ఫారన్‌హీటు). నాడి రేటు సగటున నిమిషానికి 68 మొదలు 90 దాకాను శ్వాసరేటు నిమిషానికి 20 మొదలు 30 దాకాను ఉంటుంది.

అతి సామాన్యంగా మేకలకి వచ్చే అంటువ్యాధులు దొమ్మ; అమ్మవారు (మశూచి); ప్లూరో న్యుమోనియా; గాళ్లు.

దొమ్మ అనేది మేకలకి సామాన్యంగా వచ్చే అపాయకరమైన రోగం. ఇది అకస్మాత్తుగా త్వరగా సంభవిస్తుంది. ఈ అంటురోగం తగిలిన కొద్ది నిమిషాలలోనే మేక చచ్చిపోతుంది. రోగం సోకిన మేక తీవ్రంగా జ్వరం వస్తుంది. రోగం తీవ్రంగా ఉన్నప్పుడు జంతువు నడక అవకతవకగా ఉంటుంది; వొణికిపోతూ ఉంటుంది; శ్వాస కష్టమైపోతుంది. శరీరపు సహజ రంధ్రాల నుంచి రక్తస్రావం కలుగుతుంది; విలవిల్లాడిపోతుంది.

నిరోధక మార్గాలు : వ్యాధి సోకకుండా టీకాలు వేయించాలి; వ్యాధి సోకిన మేత తావులు దున్నించి, ఇంచుమించుగా రెండు నెలలవరకూ అలా వదిలి వెయ్యాలి. వ్యాధి సోకి చనిపోయిన పశు కళేబరాన్ని తగులబెట్టించడం కాని, లోతుగా గొయ్యి తీసి కాల్చి ఆరిన సున్నంతో పూడ్చిపెట్టడం గాని చెయ్యాలి. ఈ వ్యాధి మనుష్యులకి కూడా సంక్రమించగలదు గనక, వ్యాధి సోకిన పశువులను సాకే విషయంలో ఎంతో జాగ్రత్తగా వ్యవహరించాలి.

మశూచి మేకలకి సాధారణంగా వచ్చే తీవ్రమైన అంటువ్యాధి. దీని ముఖ్య లక్షణాలు జ్వరం కాయడం, మొటిమల లాగ మొలిచి అవి పొక్కుల క్రింద

తయారవడం; ఈ పొక్కులు సాధారణంగా తొడల లోపలి భాగంలోనూ, పొదుగుమీదా, సిరాలపైనా, తోకక్రిందా లేస్తాయి. పాలు తీసేవాని చేతి వేళ్ల మీద కూడా కురుపులు లెయ్యవచ్చును.

వ్యాధి సోకిన జంతువులని వేరు చెయ్యాలి. వాటి పాలు మనుష్యుల వాడుక కోసం ఉపయోగించకూడదు. పరిసరాలన్నీ క్రిమి సంహారక మందులతో శుభ్రపరచాలి. క్రింద రాలిన పాలుసులన్నీ తగులబెట్టించాలి.

## ప్లూరో న్యుమోనియా

పుపుసవేష్టనానికి ఊపిరితిత్తులకీ సంబంధించిన అంటువ్యాధి యిది. మేకలకి ప్రత్యేకించి వచ్చే జబ్బు. మేకకి ఏ వయస్సులోనైనా యీ వ్యాధి సోకవచ్చును.

ఈ వ్యాధి సోకిన మేకలు దగ్గులు, తుమ్ములు పట్టుకుంటాయి. శ్వాస కష్టం అయిపోతుంది. ముక్కు నీరు ఓడుతూ ఉంటుంది. ఒక్కొక్కప్పుడు రక్తపు జీరలు కూడా కనిపించవచ్చును.

నిరోధక మార్గాలు : ఈ వ్యాధి సోకిన మేకలను వేరుచెయ్యాలి. వ్యాధి సోకకుండా టీకాలు వేయించాలి.

గాళ్లు అనేది సాధారణంగా వర్షాకాలంలో కనిపిస్తుంది. మేకలలో ఇది త్వరగా వ్యాపిస్తుంది. నోటిలో గల మ్యూకసు పొరలపైన, పాదముల చీలికల పైన కురుపులు లేస్తాయి. పశువు పెదిమెలు చప్పరిస్తూ, చొంగ కారుస్తూ ఉంటుంది. ఒక్కొక్కప్పుడు దీనితో పాటు విరేచనాలు, న్యూమోనియా (ఊపిరితిత్తుల వ్యాధి) కూడా కలగవచ్చును.

వ్యాధి సోకిన మేకలను వేరుపరచాలి. నోటిలోనూ, పాదాలపైన ఉండే కురుపులకి తగిన చికిత్స చేయించాలి. మందలని తిప్పడం తగ్గించాలి.

# IV. పందులు

## ఉపోద్ఘాతం

పెంపుడు జంతువులన్నింటిలోను, పందులు ఎక్కువగా పిల్లల్ని పెడతాయి; తొందరగా ఎదుగుతాయి కూడాను. పది ఆడపందులు ఒక మగ పంది ఉంటే, తొలి ఏడాదిలోనే 160 కి పైగా పంది పిల్లలు పుడతాయి.

ధాన్యజాతులకి ఉపజమ్ములైన వస్తువులని పందులు పూర్తిగానూ, ఫలవంతంగాను ఉపయోగించుకుంటాయి. పెరిగే దశలో, ఒక్కొక్క కిలోగ్రాము చొప్పున బరువు హెచ్చడానికి పందికి ఎంతో మేత అక్కరలేదు. హేమ్, బేకన్, సాసేజిలు వగైరా వస్తువులు తయారు చెయ్యడాని కోసం పంది మాంసానికి ఎక్కువ గిరాకీ ఉంది.

పందుల పెంపకం తక్కువ పెట్టుబడితో ఎక్కువ లాభాలు యిస్తుంది. పందుల వల్ల, వంటకు యోగ్యమైన మాంసం అధికశాతం లభిస్తుంది. పందిమాంసంలో మాంసకృత్తులు ఎక్కువ ఉంటాయి అనీ, శక్తిని యిచే త్రాణ ఎక్కువగా ఉంటుందనీ విదితం అయిన విషయాలు.

## భారతదేశంలో పందుల పెంపకం

భారతదేశంలో పందుల పెంపకం, పంది మాంసపు పరిశ్రమ కూడా చాలా వెనుక పడి ఉన్నాయి. పందుల పెంపకం అంతా యించుమించుగా వెనుకబడ్డ జాతులవారి వల్లను ఆర్థిక స్తోమత అట్టేలేని పేదవారివల్లను జరుపబడుతూంది వీరు అనాగరికమైన ప్రాచీన మార్గాలలోనే నడుస్తున్నారు.

సామాన్యంగా గ్రామాలలో కనిపించే పంది, ప్రత్యేకించి ఏ సహజగుణాలూ లేనటువంటి నీచజంతువు. అది ఎదగడానికి కాలం పడుతుంది. దాని మాంసం కూడా నాణ్యం తక్కువైనదిగా ఉంటోంది. ఈ పంది చిన్న పరిమాణంలో ఉండి, పిల్లల్ని తక్కువగా పెడుతుంది. ప్రస్తుత పరిస్థితులలో పందుల విషయంలో ఉపేక్ష ఎక్కువగా ఉంది. అవి లాభదాయకంగా పెరగడానికి తగిన అవకాశం లభించడం లేదు. అయినప్పటికీ, ఇటీవల

పందులను వాసి అయిన పద్ధతులలో పెంచి, నాగరికపు పద్ధతులలో, పందులవల్ల లభించే మాంసం మొదలైనవి తయారు చెయ్యడానికి అనుగుణంగా దేశంలో కొన్ని పిగ్గరీస్ (పందులను పెంచే సంస్థలు) వెలిశాయి. 1977 సం॥ లో భారతదేశంలో 7.6 మిలియన్లు పందులు ఉన్నాయి. అనగా 1972 సం॥ లో ఉన్న పందులసంఖ్య కంటే 0.7 మి. మరియు 1966 సం॥ లో ఉన్న పందుల సంఖ్య కంటే 1.86 మిలియను పందులు అధికం 1982 సం॥ లోని పందుల లెక్కల ప్రకారం దేశంలో 10.07 మి పందులు ఉన్నాయి అనగా 1977 సం॥ లో ఉన్న పందుల సంఖ్య కన్నా 32 శాతం పందులు అధికం. యునైటెడ్ స్టేట్సులో పందుల ఉత్పత్తి భారీ అయిన వ్యాపారం. 1972 సం॥ లో 5.4 మిలియను డాలర్ల విలువచేసే 93.7 మిలియన్ పందులు ఉత్పన్నమయ్యాయి అంటే ప్రపంచం పందుల ఉత్పత్తిలో 20 శాతంగా ఉంది. ప్రపంచం మొత్తం మీద పందిపిల్లల ఉత్పత్తిలో చైనా అగ్రస్థానం ఆహార వ్యవసాయ సంస్థ అంచనా ప్రకారం 1991 సం॥ లో ప్రపంచంలోని పందుల సంఖ్య 859 మిలియన్లు. ఇందులో భారతదేశంలో ఉన్న పందుల సంఖ్య 10.45 మిలియన్లుగా అంచనా వేయబడ్డది.

## భారతదేశంలో గల విదేశీయ జాతులు

భారతదేశంలో గల దేశవాళీ పందుల శ్రేష్ఠత పెంపొందించడానికి గాను విదేశీయ జాతుల మగ పందుల చేత జత కట్టించడం జరుగుతోంది. దీనివల్ల, కనిష్ఠ పరిమాణపు పెట్టుబడితో ప్రోత్సాహకరమైన ఫలితాలు కనిపించేయి. శ్రేష్ఠత పెంపొందించడానికి సామాన్యంగా ఉపయోగించే విదేశీయ జాతులు ఏవి అంటే లార్జి వైట్ యార్క్‌షైర్, మిడిల్ వైట్ యార్క్‌షైర్, బెర్క్‌షైర్ జాతులు.

## లార్జివైట్ యార్క్‌షైర్

ఉత్తర ఇంగ్లాండు నుంచి ఇవి మొదటవచ్చేయి. కెనడా, స్కాట్లండు, ఐర్లాండు, అమెరికా దేశాల్లో ఇవి విరివిగా పెంచబడుతున్నాయి. ఇది బహుళ సంతతినిచ్చే జాతి. ఈనినప్పుడల్లా ఎక్కువ పిల్లల్ని పెడుతుంది. భారతదేశంలో దేశవాళీ పందులని అభివృద్ధి పరచి, ఉన్నతస్థాయికి తీసుకురావడానికిగాను, ఈ జాతిని ఎక్కువగా వాడుతున్నారు. అయితే, మామూలు గ్రామీణ పరిస్థితులలో

కంటే, తిండి విషయంలో చక్కగా నియమితమైన పరిస్థితులలో పెరగడానికి ఇది యోగ్యంగా ఉంటుంది.

లార్జివెట్ యార్క్‌షైర్ జాతి పంది తెల్లగా ఉంటుంది ఇది మిక్కిలి పొడవుగానూ, పల్లంగానూ ఉండి, కండపుష్టి గలిగి ఉంటుంది. దీని చెవులు పల్చగా, పొడవుగా, కాస్త ముందుకి వాలి ఉంటాయి. చెవి అంచులని పల్చగా రోమాలు ఉంటాయి. దీని మెడ పొడవుగా ఉండి, భుజాల వరకూ బలిసి నిండుగా ఉంటుంది. ఉరస్సు లోతుగానూ, విశాలంగానూ ఉంటుంది. దీని వీపు పొడవుగా, సమతలంగా ఉండి ఇంచుమించుగా తెల్లగా ఉంటుంది. పార్శ్వభాగాలు చక్కటి ఎముక గలిగి లోతుగా ఉంటాయి. దీనికాళ్లు తిన్నగా, సునిర్మితంగా ఉంటాయి. ఎదిగిన పోతుపంది సుమారు 300 మొ।। 400 కిలోగ్రాములున్నూ, ఆడపంది సగటున 220 మొ।। 320 కిలోగ్రాములున్నూ తూగుతాయి.

## మిడిల్ వైట్ యార్క్‌షైర్

ఇది ఇంగ్లీషు జాతి పంది. లార్జివెటు జాతి పందులని యార్క్‌షైరు జాతులకి పుట్టిన చిన్న జాతులతో జతకట్టించగా యీ జాతి కలిగింది అంటారు. మిడిల్‌వైట్ జాతి పంది త్వరగా యుక్తవయస్సుకి వస్తుంది. మిగతా జాతులతో పోల్చి చూస్తే, తక్కువ మదుపుతో చాలా శ్రేష్ఠమైన మాంసానికి యీ జాతి ప్రసిద్ధి కెక్కింది. వంటకు యోగ్యంగా ఉండే మాంసం యీ జాతి పందిలో ఎక్కువ శాతం లభిస్తుంది. ఈ జాతి చాలా దృఢమైన జాతి. ఆరుబయట మేతమేసి బ్రతకగలదు. మిగతా విదేశీయ జాతులకంటే ఇది భారతీయ గ్రామీణ పరిస్థితులలో వృద్ధి పొందడానికి చాలా అనుగుణమైనది.

ఈ జాతి పంది తెల్లగా ఉంటుంది దీని మెడ భుజముల వరకు బలిసి నిండుగా ఉంటుంది. దీని భుజాలు విశాలంగా ఉంటాయి. వీపు పొడవుగానూ, సమతలంగానూ ఉంటుంది. ముందరికాళ్ల పైభాగం వెడల్పుగా ఉండి, లోతొడల వరకు బాగా బలిసి ఉంటుంది. పార్శ్వములు పల్లంగా, మంచి పక్క ఎముకలు ఉంటాయి. ప్రక్కలు దళసరి, చట్టలు పొడవుగానూ, విశాలంగానూ ఉంటాయి. ఈ జాతి మగపంది పూర్తిగా ఎదిగినప్పుడు సుమారు 250 మొ।। 350 కిలో గ్రాముల వరకూ తూగుతుంది. ఆడపంది సగటున 175 మొ।। 275 కిలోగ్రాములు తూగుతుంది.

బెర్క్‌షైర్ అన్నది ఇంగ్లీషు పంది జాతులలో చాలా పురాతనమైనది. ఇది ఆస్ట్రేలియాలోనూ, న్యూజిలాండ్‌లోనూ ఎక్కువగా పెంచబడుతోంది. పంది మాంసపు వ్యాపారానికి మిక్కిలి యోగ్యమైన మాంసం దీనివల్ల లభిస్తుందని గణనకెక్కింది. ఈ పందిలో చాలాభాగం క్రొవ్వులేని పల్చని మాంసం ఉండడం చేత ఇది మాంసపు దినుసులకి, ముఖ్యంగా బేకన్ వంటి మాంసానికి ఇది అనుగుణంగా ఉండదు. భారతదేశంలో బెర్క్‌షైర్ మగపందులు దక్షిణాపథాన్ని దేశవాళీ జాతి పందుల శ్రేష్ఠతని పెంపొందించడానికి ఉపయోగింపబడుతున్నాయి.

బెర్క్‌షైర్ జాతి సామాన్యంగా నల్లగా ఉంటుంది. పాదాలపైనా తలపైనా తెల్లటి మచ్చలుంటాయి. తల పొట్టిగానూ, ముఖం పళ్లెంలాగ లోతుగానూ ఉంటాయి. బాగా ఎదిగిన యీ జాతి మగపంది సుమారు 275 మొ।। 375 కిలోగ్రాములు తూగుతుంది. సగటున ఆడపంది 200 మొ।। 300 కిలోగ్రాముల వరకూ తూగుతుంది.

'టామ్‌వర్త్', 'ఎసెక్స్', 'వెసెక్స్', 'సేడిల్‌బేక్' పంది జాతులు బ్రిటను దేశం నుంచి వచ్చిన యితర ముఖ్యజాతులు, 'ఛెస్టర్‌వైట్', 'డ్యూరోక్', 'హేమ్స్‌షైర్' జాతులు అమెరికాలో విరివిగా పెంచబడుతున్నాయి.

## జతకట్టడానికి యోగ్యమైన పందుల ఎన్నిక, పెంపకము

జతకట్టే మగపంది మందలో ముఖ్యమైనది; అంచేత అటువంటి పందిని ఉంచుకోవడంలో జాగ్రత్త అవసరం. జతకట్టించే మగపంది చక్కని పుంసత్వం కలిగిఉండాలి. బహుళ సంతానం కలుగజేసే జాతికి అనుగుణంగా ఉండాలి. దాని శరీరం పొడవుగా ఉండాలి. స్కంధభాగం మరీ భారంగా ఉండకూడదు. ఏ అంగవైకల్యం లేకుండా ఉండాలి. వృషణాలు తిత్తులలో స్పర్శగోచరంగా ఉండాలి.

జతకట్టడానికి పనికిరాని మగపందులకు లేత వయస్సులోనే, అనగా మూడు మొదలు అయిదు వారాల ప్రాయంలోనే, స్తన్యం మానేముందు విత్తులు కొట్టించెయ్యాలి. విత్తులు కొట్టని పందిమాంసానికి ఉండే వాసన, విత్తులు తీసిన పంది మాంసానికి ఉండదు. ఆరోగ్యకర పరిస్థితులలో త్వరగా విత్తులు కొట్టించెయ్యాలి. వేసవికాలంలో, ముఖ్యంగా ఈగలకాలంలో, విత్తులు

కొట్టకూడదు. విత్తులు ఇంకా పన్నెండు గంటలకి కొడతారనగా దగ్గరనుంచి, విత్తులు తియ్యవలసిన పిల్ల పందులకి పరిమితంగా మేతపెట్టాలి. విత్తులు తీసేక, ఆ రోజంతా వాటికి విశ్రాంతి ఇవ్వాలి.

సరిగా పోషించి పెంచినట్లయితే, మగపందులు సుమారు ఎనిమిది నెలల ప్రాయానికి జతకట్టడానికి ఉపయుక్తంగా ఉంటాయి. కాని ఏడాది వయస్సు వచ్చే వరకూ వాటిని పరిమితంగా ఉపయోగించడం మంచిది. సాధారణంగా ఆరేళ్ల వయస్సు వచ్చేవరకూ మగపంది జతకట్టడానికి చక్కగా పనికివస్తుంది. మామూలుగా ఒక మగపందిచేత 50 ఆడపందులకి పైగా జతకట్టించకూడదు. సామాన్యంగా రోజుకి ఒక్కసారికంటె, నెలకి 20 సార్లకంటె అధికంగా జతకట్టించకూడదు. ఎక్కువసార్లు జతకట్టించి ప్రయాస పెట్టడం వల్ల, మగపంది బిగువును కోల్పోయి బలహీనమైన సంతతికి కారణం కావచ్చును. ఈ పిల్లల సంఖ్య కూడా తక్కువగా ఉంటుంది.

మగపందిని ఆడపందులతో విచ్చలవిడిగా వదిలివెయ్యకూడదు. దానివల్ల అవసరం అయినదానికంటే ఎక్కువసార్లు పార్లి, అది నీరసించి పోతుంది. ఆడ పందులకి జతకట్టే కాలం వచ్చేక, మగపంది చేత ఒకేసారి జతకట్టించాలి. అలవాటుపడని పరిసరాలలో మగపందులు జతకట్టక పోవచ్చును. ఇది వాటికి స్వాభావికంగా ఉండే గుణం. తరచుగా ఇట్లా జతకట్టకపోవడం జరిగితే, ఆ తరవాత ఆడపంది మంచి ఎదలలో ఉన్నప్పుడు కూడా మగపంది పార్లకపోవచ్చు.

మగపంది వీర్యపుష్టి కలిగి ఆరోగ్యంగా ఉండాలి; అంటె అమితంగా దానిని మేపకూడదు. క్రమబద్ధంగా దానికి దుంపలు మొదలైన ఆహారమున్నూ, తగినంత వ్యాయామమున్నూ లభించేటట్టు చూడాలి. ఒక్కొక్కప్పుడు, క్రమం లేకుండా అనియమితంగా మేత పెట్టడం వల్లనూ, సంరక్షణ సరిగా లేకపోవడం వల్లనూ, మగపంది పుంసత్వం కోల్పోవచ్చు.

## జతకట్టించే ఆడపందుల ఎన్నిక, సంబాళింపు

స్తన్యం మాన్పించే కాలానికి ఎక్కువ బరువు తూగి, ఒకే విధంగా ఉండి, బహుళ సంతతినిచ్చే పందికి పుట్టినటువంటి పిల్లలలోంచే, జతకట్టించడానికి యోగ్యమైన ఆడపందులని ఎంచుకోవాలి. అటువంటి ఆడపంది మంచి

ఆరోగ్యంగానూ, బాగా పెరగగలిగినదిగానూ ఉండే సంతతిని కలగజేసేదిగా ఉండాలి. సామాన్యంగా, రకరకాల సైజులలో ఉండే పిల్లల కంటే, అనురూపంగా ఒకే సైజులో ఉండేపిల్లలు ఎక్కువ లాభసాటిగా ఉంటాయి.

జతకట్టించే పంది శరీరం నిడుపుగానూ, పల్లంగానూ ఉండి, లోతొడల వరకూ మంచి మాంసపుష్టి గలిగి ఉండాలి. అంగవైకల్యాలేమీ ఉండకూడదు. క్షీరగ్రంథులు చక్కగా ఉండి, పొట్టకు ఇరుప్రక్కలా సమదూరంలో పన్నెండు, పధ్నాలుగు సిరాలు ఉండాలి. హీనమైన సిరాలు గల పందులు పాలు ఆట్టే ఇవ్వవు కనక అటువంటి వాటిని సంతతి ఉత్పత్తికోసం ఎంచుకోకూడదు. జతకట్టించడానికి ఎన్నికలు చేసిన పంది, సాధువుగా ఉండాలి. ఉద్రేకం, చిరాకూ గల పందులకి మాతృత్వం లోపిస్తుంది. పంది చక్కగా ఉండాలి. తలా, చెవులూ మోటుగా లావుగా ఉండకూడదు. అది క్రొవ్విపోయి ఉండకూడదు; అలాగని బలహీనంగానూ ఉండకూడదు. అమితంగా క్రొవ్వి పోయిన పందులు చూలుండడం కష్టం. అలాంటివాటికి మేత తగ్గించాలి. మేతకై బయట తిప్పడం మంచిది. ఆడ పంది పిల్లలు సాధారణంగా ఎనిమిది, తొమ్మిది నెలల ప్రాయంలో క్రొవ్వెక్కుతాయి. ఈ సమయంలో పౌష్టిక ఆహారం తగ్గించాలి. ఆరోగ్యం తక్కువగా వున్న పందులు ఈనడంలో క్రమం ఉండదు; ఈనినప్పుడు పిల్లల సంఖ్య కూడా తక్కువగా ఉంటుంది.

పంది సుమారు రెండేళ్ల ప్రాయానికి మంచి యుక్తవయస్సుకి వస్తుంది. సంరక్షణ బాగా ఉండే పరిస్థితులలో 9 నెలల ప్రాయానికే జతకట్టించవచ్చును. అది సక్రమంగా ఎదగాలి అంటేనూ, ఆరోగ్యమైన పిల్లల్ని పెట్టాలి అంటేనూ, మరీ చిన్నప్పుడు జతకట్టించకూడదు; అలాగని జతకట్టించడం బొత్తిగా ఆలస్యం చేస్తే పంది క్రొవ్వు బారిపోతుంది. వంధ్యత్వం కూడా రావచ్చు.

సాధారణంగా పందులు ఆగస్టు-సెప్టెంబరులలోనూ, ఫిబ్రవరి-మార్చి మాసాలలోనూ జతకడతాయి. ఈ సమయంలో పుష్టిగా మేత పెడితే అవి త్వరగా ఎదిగి వస్తాయి.

ఆరు నెలల ప్రాయంలో తొలిసారిగా ఆడపంది ఎదకి వచ్చిన చిన్నెలు కనిపిస్తాయి. తరవాత చూలుండేదాకా ప్రతీ 21 రోజుకీ పంది ఎదకి వస్తుంది. ఈనిన తరవాత, పిల్లలు స్తన్యం మానివేసిన 5-7 రోజులలోగా పంది ఎదకి వస్తుంది. ఈ కాంలో దాన్ని జతకట్టించాలి. ఎదకాలం 40 మొదలు 65 గంటల వరకూ ఉంటుంది. ఇది లేతవయస్సు పందుల్లో కంటే ఎదిగిన

పందుల్లో ఎక్కువగా ఉంటుంది. ఎదకి వచ్చిన ప్రథమదశలో కంటె, చివరి దశలో జతకట్టించడం అతిశ్రేష్ఠం.

ఆకలి మందగించడం, విశ్రాంతి లేకుండా ఉండడం, భగరంధ్రం ఉబ్బి ద్రవించడం-ఇవి సామాన్యంగా ఎదకి వచ్చిన పందిలో కనిపించే చిన్నెలు. ఈ కాలంలో తరుచుగా ఆడపంది మిగతా ఆడపందుల వెంట పడుతుంది; అప్పుడప్పుడు అదో మోస్తరుగా ఘుర్ఘురధ్వని చేస్తుంది.

పంది 112 మొదలు 116 రోజులవరకూ చూలుతో ఉంటుంది. సగటున 113 రోజులు, సక్రమమైన ఆహారం, సంరక్షణగల పరిస్థితులలో ఏడాదికి రెండుసార్లు పంది ఈనేటట్టు చేయవచ్చును. చూలుతో ఉన్న కాలంలో ఆడపందికి క్రమమైన వ్యాయామం కల్పించడం అవసరం. ఆరోగ్యం సరిగా ఉండడానికి దాన్ని మేతకి బయటకి తీసుకువెళ్లడం మంచిది.

## ఈనే సమయంలో పందుల సంరక్షణ

పది, పదిహేను రోజులకి ఈనుతుందనగా, పందిని వేరే ఆవరణలో పెట్టాలి. ఈ ఆవరణ సౌఖ్యప్రదంగా ఉండి, పంది, పందిపిల్లలు యిటూ అటూ తిరగడానికి వీలుగా ఆరుబయలు ప్రదేశంలో కలిసి ఉండాలి. పంది పడుకొనే స్థలంలో ఒత్తుగా ఎండుగడ్డి వేసి ఉంచాలి. చాలాపందులు, చనుమొనలలో పాలుపడ్డ 24 గంటలలోగా యీనుతాయి. ఈనడానికి సామాన్యంగా 2 మొ॥ 5 గంటలవరకూ, ఒక్కొక్కప్పుడు ఇంకా ఎక్కువ కాలం, పట్టవచ్చును. అనవసరంగా జోక్యం కలిగజేసుకోకుండా పందిని ఈననివ్వాలి. ఈనడం కష్టం అయినప్పుడు పశువైద్యుని సహాయం పొందవచ్చు. ఈనేటప్పుడు పంది పడుకొని ఉంటుంది. మావిపడిన తరవాత, పంది దాన్ని తినివేయకుండా, వెంటనే తీసివెయ్యాలి. పిల్లయొక్క బొడ్డుతాడు క్రిందుగా కోసివేసి, టించర్ అయోడిన్ పెట్టాలి. ఈనిన తరవాత తల్లి పందిని కలవర పెట్టకూడదు. తల్లికీ, పిల్లలకీ చలిబారి నుంచి తగిన రక్షణ యివ్వాలి. శీతాకాలంలో, క్రింద ఎండుగడ్డి ఒత్తుగా పరిచి ఉంచాలి.

ఈనిన తరవాత మొదటి మూడు రోజుల వరకూ పందికి గరిష్ఠమైన ఆహారం పెట్టకూడదు. ఆ తరవాత, దాని ఆకలి పెరుగుతూన్నకొద్దీ మామూలు మేత పెట్టవచ్చును. పందికి పెట్టే రేషను తడిగాగాని, చిక్కగాగాని

ఉండాలి. ఎప్పుడూ కూడా శుభ్రమైన మంచినీరు దానికి పుష్కలంగా లభించేటట్టు చూడాలి.

## పందిపిల్లల సంరక్షణ

పంది జీవితంలో, పుట్టగానే మొట్టమొదటి మూడు రోజులు చాలా గడ్డు రోజులు. ఇంచుమించుగా, సగం ప్రాణనష్టం యీ కాలంలోనే సంభవిస్తుంది; షుమారుగా, ఈనిన వాటిలో మూడోవంతు పిల్లలు స్తన్యం మానే ప్రాయం - అనగా 8 వారాలు - వచ్చేవరకూ బ్రతకవు. పంది పిల్లలు చచ్చిపోవడానికి ముఖ్యమైన కారణం, పిల్లలు ఎక్కువ అయిపోవడమే అయినా, చాలినన్ని పాలూ ఇతర మేతలు లేకపోవడం మూలాన్ని చాలావరకు అవి చచ్చిపోతున్నాయి.

ఈనేముందు, యీనిన తరవాత పందికి తగిన మేత పెట్టడం చాలా ముఖ్యం. ఇందువల్ల పిల్లలకి, పుట్టగానే వచ్చే ప్రమాదాలని ఎదుర్కోగల సమర్థత ఏర్పడుతుంది. మంచి మేత పెట్టిన పంది రోజుకి 3, 4 కిలోగ్రాముల పాలు యిస్తుంది. ఈ పాలు, పిల్లలు త్వరగా ఎదగడానికి ముఖ్యంగా అనుగుణంగా ఉంటాయి. ప్రొటీన్లలోనూ, ఖనిజాలలోనూ పందిపాలు ఆవుపాలకన్నా మంచిది. పంది పాలల్లో 7.23 శాతం ప్రోటీన్లు, 4.55 శాతం కొవ్వు, 3.23 శాతం చక్కెర, 1.05 శాతం ఖనిజాలు, 83.94 శాతం నీరున్నూ ఉంటాయి. పిల్లలకి చాలినంతగా తల్లి పాలివ్వాలి అంటే తల్లికి పెట్టే మేతలో యీ పోషక పదార్థాలు ఉండాలి.

పంది పిల్లలు, పుట్టిన కొద్ది నిమిషాలలో సామాన్యంగా తడబడుతూ లేచినుంచుని పొదుగు దగ్గరకి వెళతాయి. పిల్లలు పుడుతూన్న కొద్దీ, వాటిలో వాటికి తల్లి సిరాల కోసం పోటీ వస్తుంది. చివరకి ఒక్కొక్కపిల్ల ఒక్కొక్క సిరానికి అలవాటుపడి, పాలు తాగినన్నాళ్ళూ ఆ సిరంనుంచే తాగుతుంది. వెనకకాళ్ళకి చేరువగా ఉన్న సిరాల కంటె, ముందుకాళ్ళకి దగ్గరగా ఉన్న సిరాలలో ఎక్కువ పాలు పడతాయి. ముందుసిరాల కోసం పిల్లలు ఒక్కొక్కసారి పోట్లాడుకుంటాయి. మంచి బాగా ఉన్న తల్లి సిరాలు తక్కువ. పుట్టిన పిల్లలు ఎక్కువ ఉన్నప్పుడు, ఇంచుమించుగా అదే సమయంలో యీని, పిల్లలు తక్కువ పెట్టిన, ఇంకో పంది దగ్గర పాలకి వీటిని అలవాటు

చెయ్యాలి. ముర్రిపాలు మొట్టమొదట ఆహారంగా ఇవ్వాలి. ఈనిన తరవాత 3, 4 రోజులవరకూ తల్లి పంది ముర్రిపాలు యిస్తుంది.

## వ్యాయామం

పందులు ఆరోగ్యంగానూ, సక్రమంగానూ ఎదగడానికి వాటికి వ్యాయామం అవసరం. మాంసంకోసం పెంచే పందులకి మాత్రం అవి ఆరోగ్యంగా ఉండడానికి తగినంత కనీసపు వ్యాయామం కలిగించాలి. చుట్టూ కంచెకట్టిన ఆవరణలో పరిగెత్తించడం కాని, లేదా రోజూ కొద్ది గంటలసేపు మేతకి బయటకి తీసుకు వెల్లడం గాని మంచి పద్ధతి.

## పందుల మేత

భారతదేశంలో, పందులకి సక్రమమైన మేత పెట్టే విషయంలో తగినంత శ్రద్ధ తీసుకోవడం లేదు. కోతలు కోసిన పొలాలలోనూ, చెత్తకుప్పలలోనూ, పందులని వాటి యిష్టం వచ్చినట్టు తిరిగి ఏది దొరికితే అది మేసేటట్టు వదిలేస్తున్నారు. దీనివల్ల వాటికి పోషణ జరగక, వాటి ఆరోగ్యం దెబ్బతింటూంది. పందులవల్ల వచ్చే ఆదాయం కూడా తక్కువగా ఉంటోంది.

ఇతర పశువులూ, గొర్రెలూలాగ కాకుండా పందుల జీర్ణకోశపు పద్ధతి సరళంగా ఉంటుంది. అంచేత అవి ముతకగా పీచుపదార్థంతో కూడిన ఆహారం జీర్ణించుకోలేవు. కాబట్టి వాటికి కాయధాన్యాలు ఘొుదలైన, పీచుపదార్థం తక్కువగా ఉండే మేతలు పెట్టాలి. కాని వీటిలో ప్రోటీన్లు, ఖనిజాలు తక్కువగా ఉండడం వల్ల ఎదుగుతూన్న పందులకి, చూలుతో ఉన్నవాటికీ, జబ్బునుంచి కోలుకొంటున్న వాటికీ కావలసిన పోషకపదార్థాలు వీటిలో లభించవు. అంచేత యీకొరతని పూరించే ఆహారం పందులకి యివ్వాలి.

మిగతా అన్ని పెంపుడు జంతువులలాగే, పందులను కూడా మితిమీరి మేపకూడదు. అలా మేపడం వల్ల మేత వ్యర్థం అవడమే కాకుండా అజీర్ణపు వ్యాధులు వచ్చి, పందులు అంటువ్యాధులకి గురిఅవుతాయి. ఇలాగ కాకుండా ఉండడానికి మేత పెట్టే తొట్టి, మేత పెట్టిన తరవాత ప్రతీసారీ శుభ్రపరుస్తూ ఉండాలి.

వేరు వేరు ఉపయోగాలకి ఉద్దేశించబడిన పందులకి కావలసిన పోషక పదార్థాలు వేరువేరుగా ఉంటాయి. ఎదిగే పంది పిల్లలకి మాంసకృత్తులు బాగా ఉండడానికి ఎక్కువ ప్రోటీన్లు, ఎముక పెరగడానికి ఖనిజాలూ, ఆరోగ్య అభివృద్ధికి విటమినూ అవసరం. ఎదిగిన పందులకి శక్తికోసం, కొవ్వు పెరగడం కోసం పిండి పదార్థం గల మేత కావాలి.

పందులకి పరిశుభ్రమైన మంచినీరు ఎక్కువగా కావాలి. కాలధర్మాన్ని బట్టి, మేతనిబట్టి, కావలసినంత మంచినీరు లభింపజెయ్యాలి. సాధారణంగా ఒక కిలోగ్రాము పొష్టికమైన మేతకు 2, 3 లీటర్ల వరకు మంచినీరు కావలసి ఉంటుంది. రసపుష్టిగల మేత పెట్టినప్పుడు, ఆకలి తీర్చుకోడానికి పందులు అమితంగా నీరు త్రాగకుండా చూడాలి. సరిఅయిన పోషణ లేని పంధులకి చాలావరకు, కాయగూర పదార్థాలలో ఉండే అమితమైన నీటిభాగం వల్లనే, పొట్ట ఉబ్బి ఉంటుంది. పందులకు మేత చిక్కటి ద్రవపదార్థ రూపంలో పెట్టడం మంచిది.

జబ్బు పడ్డ పందుల విషయంలో కావలసినంత మంచినీటి సదుపాయం విధిగా ఏర్పాటు చెయ్యాలి.

ఖనిజముల కొరత : ఎదిగే పందిపిల్లలు పూర్తిగా ఎదగక పోవడానికీ, చాలా నెమ్మదిగా ఎదగడానికీ కారణం వాటికి పెట్టే మేతలో ఖనిజాలు తక్కువ కావడమే. పిల్లల్ని పెట్టే పందులు, పిల్లలకి పాలిచ్చే కాలంలో కృశించి పోవడానికికూడా ఇదే కారణం. అంచేత పందులకు, ముఖ్యంగా అవి ఎదిగేకాలంలోనూ, చూలుతో ఉన్న కాలంలోనూ, వాటి శరీరపోషణకి తగినట్లుగా ఖనిజాలు విరవిగా లభింపజెయ్యాలి.

పందుల మేత విషయంలో ముఖ్యమైన ఖనిజాలు కాల్షియం, ఫాస్ఫరస్, ఉప్పునూ్న, సున్నపురాళ్ల పొడివల్ల చక్కని కాల్షియం లభిస్తుంది. ఆవిరితో ఉడికించిన ఎముకల పొడివల్ల కాల్షియం, భాస్వరము కూడా లభిస్తాయి. పందుల మేతకి కావలసిన ఖనిజ మిశ్రమం 5 పాళ్లు ఎముకల పొడి, 2.5 పాళ్లు సున్నపు రాళ్లపొడి, ఒకపాలు బొగ్గు, ఒక పాలు వేప లేక కొండరావి కొమ్మల భస్మం, అరపాలు ఉప్పు కలిపి తయారు చెయ్యవచ్చును. గొంతు భాగంలో అయొడిన్ కొరతలేకుండా ఉండడానికి ప్రతీ 100 కిలోగ్రాముల ఖనిజ మిశ్రమానికి 20 గ్రాముల పొటాషియం అయొడెడు చేర్చాలి.

పందులకి యీ ఖనిజపు మిశ్రమం పెట్టడానికి ఉత్తమమైన పద్ధతి ఏది అంటే వాటికి ఎప్పుడూ అందుబాటులో ఉండే పాడిజాగాలో కర్రతొట్టెలు ఉంచి వాటిలో మిశ్రమం పెట్టడం, దుంపలు మొదలైన కాయగూరల రేషనులో కూడా యిది చేర్చి పెట్టవచ్చును. కర్రతొట్టెలు ఉపయోగించి నప్పుడు, పందులు అమితంగా తినెయ్యకుండా ఉండడానికి వాటిలో పెట్టే ఖనిజ మిశ్రమం పరిమితంగా ఉండేటట్టు చూడాలి. ఆ తరవాత, అవి తొట్టెలలో తిండికి అలవాటుపడి, వాటంతట అవే కావలసినంతవరకే యీ మిశ్రమం తింటాయి.

## పందిపిల్లలకి మేత

మూడు వారాల వయస్సు వచ్చేసరికి, యింకా తల్లివద్ద పాలు తాగుతూ ఉండగానే, పిల్లపందులు మేతమెయ్యడం ఆరంభించాలి. ఒక పిడికెడు ఓట్సు ధాన్యం వంటి పొడిగింజలు వెయ్యాలి. ఒక నెల వయస్సు వచ్చేసరికి, వెన్న తీసిన పాలల్లో బార్లీ గాని, మొక్కజొన్న గాని, గోధుమ పొట్టుతో కలిపి తయారు చేసి మేతగా పెట్టాలి. ఇంక కొద్ది రోజులకి స్తన్యం మానిపిస్తారనగా, పిల్లలమేత క్రమంగా ఎక్కువ చెయ్యాలి. మేత పరిమాణంలో గాని, మేత రకంలోగాని అకస్మాత్తుగా మార్పులు చెయ్యకూడదు.

పందిపిల్లకు రోజుకి 4, 5 సార్లు తిండి పెట్టాలి. పిల్లలు ఎదుగుతూ ఉన్న కొద్దీ మేతలో ద్రవపదార్థం తగ్గిస్తూ రావాలి.

## పిల్లల్ని పెట్టే పందులకి మేత

పిల్లలు పెట్టే పందుల విషయంలో ముఖ్యంగా శ్రద్ధ వహించవలసి ఉంది. జత కట్టించేకాలం ఇంకొక వారానికి ఆరంభం అవుతుందనగా, ఆరోగ్యం తక్కువగా ఉన్న పందులని అదనంగా మేపాలి.

పిల్లల్ని పెట్టే పందులకి 6 పాళ్లు మొక్కజొన్న, 3 పాళ్లు పొడిచేసిన బార్లీ లేక గోధుమలు, 1 పాలు చేప, లేక మాంసం కలిపి చేసిన మిశ్రమం యోగ్యంగా ఉంటుంది. 5 పాళ్లు మొక్కజొన్న, 2.5 పాళ్లు పొడిచేసిన బార్లీ. 1-5 పాళ్లు గోధుమ పొట్టు, 1 పాలు చేప, లేక మాంసం కలిపి తయారు చేసిన మిశ్రమం కూడా మంచి ఫలితాలనే యిచ్చింది.

చేప, లేక మాంసం పాలుకు బదులుగా వెన్నతీసిన పాలుగాని, మజ్జిగగాని- ఏది చవకగా లభ్యం అయితే అది - ఉపయోగించవచ్చును. వంటియింటి కడుగు నీరు పంది ఆహారంగా పనికివస్తుంది. దీన్ని ఆ పాళంగాగాని, లేదా, కాయధాన్యాలతో పాటు వచ్చిన మిగతా పదార్థాలతో కలిపిగాని, అదనపు ఆహారంగా వాడవచ్చును. సాధ్యమైనంతవరకు, ముల్లంగి, కేబేజి, చిక్కుడు, బంగాళాదుంపలు వంటి కాయగూరలు మేపాలి. కమేలాలలో మిగిలిన మాంసం ఉపయోగించేటట్టుయితే, బాగా ఉడికించి మరీ పెట్టాలి. దుంపజాతి కూరలు పచ్చివి యివ్వడమే శ్రేష్ఠంకాని, బంగాళాదుంపలు మాత్రం పచ్చివి పెట్టకూడదు.

కాయగూరలు వలసినంత లభించినప్పుడు చూలుతో ఉన్న కాలంలో మొదటి రోజుల్లో పందికి రోజుకు ఒకటిన్నర కిలోగ్రాముల పౌష్టికమైన మిశ్రణం అవసరం. తరవాత, రోజుకి రెండున్నర కిలోగ్రాముల పౌష్టికమైన మేత పెట్టవలసి ఉంటుంది. ఇంక 3, 4 రోజులకి యీనుతుందనగా, మేత కొద్దిగా తగ్గించాలి. గింజలకు బదులుగా విరేచనకారి అయిన పొట్టును ఇవ్వాలి. పందికి అజీర్ణపు చిన్నెలు కనిపించినప్పుడు మేతతో అవిసెపిండి పెట్టాలి.

ఉత్కృటమైన ఫలితం పొందాలంటే, జతకట్టే మగపంది మేత విషయంలో ముఖ్యంగా జాగ్రత్తగా ఉండాలి. ఎప్పుడూ కూడా మగపంది మరీ క్రొవ్వెక్కి పోకుండానూ, అలాగని మరీ శుష్కించి పోకుండానూ, పుష్టిగా ఉండేటట్టు చూడాలి. అది అమితంగా క్రొవ్వెక్కిపోయినా, లేదా ఎండిపోయినా, వీర్యపుష్టి దెబ్బతింటుంది. జతకట్టే కాలంలో సోయాగింజల పిండి, చేప, మాంసం, వెన్న తీసిన పాలు, మజ్జిగ మొదలైన ప్రోటీన్లు అధికంగా గల వస్తువులు మేతతో కలిపి పెట్టాలి.

మగపందులకి మంచి మేత లభించే తావులుండాలి. యోగ్యమైన మేత బయట లభ్యం కానప్పుడు, పందిని ఉంచే ఆవరణలోనే రసపుష్టి గల ఆకులు మేతగా వెయ్యాలి. మామూలుగా పెట్టే మేతగాక, జతకట్టే మగ పందికి కావలసినంత ఖనిజపు మిశ్రణం పెట్టాలి. సులభంగా జీర్ణం కావడానికి గింజలను దంపించి, కొన్ని గంటలసేపు నీటిలో నానబెట్టి మరీ మేతలో

కలపాలి. ఏడాది పొడుగునా కాయగూరలవంటి పచ్చిమేత పెట్టడం చాలా మంచిది. లెగుమిన జాతి మేతకూడా పెట్టాలి.

## పందులు క్రొవ్వెక్కడానికి వలసిన మేత

పందులు క్రొవ్వెక్కి బలియడానికి పిండిపదార్థాలు గల మేత ఎక్కువగానూ, మాంసకృత్తులు అధికంగా గల మేత తక్కువగానూ పెట్టాలి. 20 పాళ్ల మొక్కజొన్న, 1 పాలు కమేలాలో మిగిలిపోయిన మాంసం, సోయా చిక్కుడు పిండీ కలిపి తయారు చేసిన మిశ్రమం చాలా మంచిది. ఇందులో, సోయా చిక్కుడు వల్ల మాంసం మెత్తబడుతుంది. కనక అది తగ్గించి వాడడం మంచిది. గొడ్డు మాంసం తయారు చేసే కర్మాగారాల నుంచి లభించిన ఎముకలను గింజలతో కలిపి, పులుసుచేసి పెట్టడం పందులు బలవడానికి యోగ్యమైనమేత.

బజారులో క్రొవ్వు ఎక్కువగా ఉన్న పందిమాంసం (పోర్క్) ఎక్కువ చలామణీ అవుతూన్నప్పుడు, పందులకి మొక్కజొన్న మేత పెట్టాలి. మొక్కజొన్నలో పిండిపదార్థం అధికంగా ఉండడం వల్ల అది శరీరంలో సులువుగా క్రొవ్వుగా మారుతుంది; పైగా మొక్కజొన్న కాస్త చవకగా కూడా దొరుకుతుంది. క్రొవ్వు తక్కువగా ఉండీ, ఉప్పువేసి చెడకుండా పెట్టిన మాంసం (బేకన్) చట్టల మాంసం (హేమ్) - వీటికి బజార్లో ఎక్కువ గిరాకీ ఉంటే, అటువంటి మాంసం లభించడాని కోసం వెన్నతీసిన పాలుకాని, మజ్జిగగాని మొక్కజొన్నతోనే ఉలవలతోనే సమపాళంగా కలిపి పెట్టాలి.

మాంసంకోసం పెంచే పందులకి, చేపపొట్టు ఆహారంతో పెట్టునప్పుడు చాలా శ్రద్ధ తీసుకోవాలి; లేకపోతే పందిమాంసం రుచి యీ చేపమాంసం వల్ల పాడయే ప్రమాదం ఉంది. స్తన్యం మానిపించే రోజులలో 15 శాతం కంటె తక్కువగాను, మధ్యదశలో 10 శాతం కంటె తక్కువగాను క్రొవ్వు ఎక్కుతున్న చివరి దశలలో 5 శాతం కంటె తక్కువగాను చేపపొట్టు పెట్టాలి. ఇంక 15 రోజులకి పందిని కొడతారనగా చేపల పొట్టు పూర్తిగా మానెయ్యాలి.

దుంపలు మొదలయిన పచ్చిమేతలతో పాటు క్రొవ్వెక్కి బలియడానికి పెంచుతూన్న పందులకి, 23 కిలోగ్రాముల బరువు తూగేవరకూ సుమారు 1 కిలోగ్రాము పౌష్టిక మిశ్రణం పెడుతూ ఉండాలి. ఆ తరవాత ప్రతీ 23

కిలోగ్రాముల బరువుకీ సుమారు అర కిలోగ్రాముల పౌష్టిక మిశ్రమం అదనంగా ఇవ్వాలి. పూర్తిగ ఎదిగిన పందికి 3 కిలోగ్రాముల మిశ్రణం పెట్టాలి.

## పందులను ఉంచే స్థలం

పందులవలన మంచి ఫలసాయం పొందాలంటే వాటికి అమితమైన ఎండ, వాన, చలి బారినుంచి రక్షణ యివ్వాలి. పందులనుంచే ఆవరణ చక్కగా గాలీ-వెలుతురు వచ్చేదిగానూ, సౌకర్యంగానూ, ఆరోగ్యకరమైన విధానంలోనే ఉంటే, అవి ఆరోగ్యంగా పూర్తిగా పెరగడానికి అనుగుణంగా ఉంటుంది. భారత దేశంలో గల శీతోష్ణ పరిస్థితులని బట్టి చూస్తే, యీ పనికి పెద్ద ఎత్తున ఏర్పాట్లు చేయడం గాని విశేషించి డబ్బు ఖర్చుపెట్టవలసిన అవసరం గాని లేదు.

పందులను ఎక్కువ సంఖ్యలోగాని, తేమగా ఉన్న స్థలంలో గాని ఉంచరాదు. మొదలైన ఉంచేస్థలం, పరిసరాల కంటె కొంచెం ఎత్తుగా ఉంటే, మూత్రము మొదలైన వీలుగా ఉంటుంది. నేల, తిండిపెట్టే తొట్టెలు సులువుగా శుభ్రపరచడానికి అనువుగా ఉండాలి.

పందులు నిరాటంకంగా తిరగడానికి వీలుగా పందులదొడ్డియొక్క ఆవరణ బయలుగా ఉండి, అందులో కొంత భాగానికి ఏ చెట్లదో గోడదో నీడ పడుతూ ఉండాలి. శీతాకాలంలో వెచ్చగా ఉండడానికి, పందులనుంచే జాగాలో క్రింద వట్టి గడ్డి పరచాలి. వేసవికాలంలో పందులున్న ఆవరణలో 20-25 సెంటీమీటర్ల లోతుగల నీళ్ల గుంటల నేర్పాటు చేయాలి. పందులు ఆ గుంటల్లో బురదలో పొర్లి ఆ చల్లదనాన్ని అనుభవిస్తాయి.

పందుల దొడ్డి సైజు, పందుల సంఖ్యలను బట్టి ఉంటుంది. ఈ దొడ్డికి సామాన్యంగా మధ్యలో ఓ యిల్లు లాంటిది ఉంటుంది; దాని మధ్యనుంచి, నిలువునా, 15 సెంటీమీటర్ల వెడల్పులో ఒక దారీ, ఆ దారికి రెండు ప్రక్కలా 3.5 మీటర్ల పొడవూ 2.5 మీటర్ల వెడల్పూ గల చిన్న చిన్న అరలుంటాయి. ఈ అరలతో కలిసి, అదే పరిమాణంలో ఆరుబయలుగా వుండి గట్టునేలతో ఉన్న ఆవరణలుంటాయి. ఈ ఆవరణల నుంచి, పందులు కలిసి మెయ్యడానికి, రెండువేపులా విశాలమైన మేత ప్రదేశం ఉంటే మంచిది. ఈ ప్రదేశాలలో నీడనిచ్చే చెట్లు ఉండాలి.

# వ్యాధి నిరోధక మార్గాలు

పందుల పెంపకం లాభదాయకంగా ఉండాలంటే, అవి ఎదుగుతూన్న దశలలో వాటి ఆరోగ్యం చక్కగా ఉండేటట్టు చూడడం అతిముఖ్యం. పందులకి వచ్చే వ్యాధులలో చాలావాటిని నిరోధించవచ్చును. వ్యాధి వచ్చిన తరవాత కుదర్చుకోవడం కంటే, వ్యాధులు రాకుండా నిరోధించడం మేలు. ఇందుకయ్యే ఖర్చు కూడా తక్కువ. వ్యాధి నిరోధక మార్గాలలో ముఖ్యమైనవి; పందుల దొడ్లు చక్కగా కట్టడం, కావలసినంత గాలీ-వెలుతురూ వచ్చేటట్లు ఏర్పాట్లు చెయ్యడం, పరిశుభ్రమైన మంచినీరు, చాలినంత మేత, రోజూ వ్యాయామం, ఆరోగ్యకరమైన పరిసరాలున్నూ.

పంది చాలాసేపు పడుకొని ఉండి, రెచ్చగొట్టినా లేవడానికి అయిష్టంగా ఉంటే దానికి ఏదో జబ్బు వచ్చిందని తెలుసుకోవాలి. జబ్బువచ్చినట్టు తెలుసుకోడానికి యితర చిన్నెలు; ఆకలి మందగించడం, తొందర తొందరగా శ్వాసరావడం, అజీర్తి లేక విరేచనాలూ, చెవులకు రంగు తగ్గిపోవడం, చురుకు లేకుండా ఉండడం, నాడి ఎక్కువ అవడం, జ్వరం రావడమున్నూ.

సామాన్యంగా పందుల శరీరపు ఉష్ణత 38.3 మొదలు 40 డిగ్రీల సెంటిగ్రేడు (101-104 డిగ్రీలు ఎఫ్) వరకూ ఉంటుంది. సగటున 38.9 డిగ్రీలు సెంటిగ్రేడు (102 డిగ్రీలు ఎఫ్). దాని నాడి రేటు నిమిషానికి 55 మొదలు 75 వరకున్నూ, శ్వాసరేటు నిమిషానికి 20 మొదలు 30 వరకున్నూ ఉంటుంది.

అంటువ్యాధులు వ్యాపించిన సందర్భంలో, వ్యాధి యితర పశువులకి వ్యాపించకుండా ఉండేటందుకు, వ్యాధి తగిలిన పందులని వేరుచెయ్యాలి. సాధ్యమైనంత వరకు, జబ్బు సోకిన పందులని సాకడానికి మనుష్యులు ప్రత్యేకించి ఉండాలి. వాటి సంరక్షణ అయిన తరవాత ఆ మనుష్యులు చేతులు, కాళ్లు క్రిమినాశక మందులతో శుభ్రంగా కడుక్కోవాలి. జబ్బుపడిన పందుల మలమూత్రాలు, వాటిదగ్గర ఉండే చెత్తా చెదారం భద్రంగా తీసివెయ్యాలి. పరిసరాలను క్రిమినాశక మందులతో శుభ్రపరచాలి. గోడలకి డి.డి.టి.ని కలిపిన సున్నంతో వెల్లవెయ్యాలి. గోడలు గట్టివి కాకపోతే గోడలకీ, నేలమీదా ఉన్న కన్నాలు సరిగా పూడ్పించాలి. వ్యాధి సోకి

చనిపోయిన పందులను లోతుగా గోతిలో సున్నం తెరలు తెరలుగా వేసి పూడ్చిపెట్టడం కాని, లేదా కాల్చివేయడం కాని చెయ్యాలి. వ్యాధి సోకింది అని తెలిసిన వెంటనే పశువైద్యుని సహాయం తీసుకోవాలి. నేర్పరులైన వారి సహాయం త్వరగా లభిస్తే, మిగతా పందులకి యీ వ్యాధి వ్యాపకం బాగా తగ్గించడానికి, ప్రాణనష్టం కలగకుండా అరికట్టడానికీ తోడ్పడుతుంది. జబ్బుసోకిన పందులతో కలిసివుంటున్న, ఆరోగ్యమైనవాటి రక్షణకోసం, వాటికి సక్రమంగా టీకాలు వేయించాలి.

## పందులకి సామాన్యంగా వచ్చే అంటువ్యాధులు

సాధారణంగా పందులకి వచ్చే కొన్ని అంటువ్యాధులు, అవి వ్యాపించకుండా తీసుకోతగ్గ చర్యలు యీ దిగువ పొందుపరుప బడ్డాయి.

పంది జ్వరం అన్నది ఒక తీవ్రమైన అంటువ్యాధి. ఇది సోకగానే తీవ్రంగా వస్తుంది. చెవులమీద, పొట్టపైన, తొడ లోపలిభాగంలోనూ ఎర్రగాగాని ఊదారంగులోగాని దద్దుర్లు కనిపిస్తాయి. ఆకలి మందగించడం, ఆయాసంతో కూడిన శ్వాస, దగ్గు, నీరసం, వాంతులు విరేచనాలు తదితర లక్షణాలు.

నిరోధకమార్గాలు : వ్యాధిసోకిన పందులని వెంటనే వేరు పరచాలి. పరిసరాలు క్రిమినాశక మందులతో శుభ్రపరచాలి. ఆరోగ్యం కాపాడడానికి కావలసిన చర్యలు ఏమరిక లేకుండా జరిపించాలి. వ్యాధి సోకని పందులకి టీకాలు వేయించాలి.

గాళ్లు అన్నది ఒక అంటువ్యాధి. తీవ్రమయిన జ్వరం, నోటిలో మ్యూకసు పొరలమీద బొబ్బలు కనిపించి అవి కురుపులుగా మారడం, పాదాలు పగుళ్లు వెయ్యడం, నడవడానికి, మేత నమలడానికి యిబ్బందిపడడం – ఇవి యీ వ్యాధి యొక్క ముఖ్య లక్షణాలు.

వ్యాధి సోకిన జంతువులను వేరుపరచాలి. పరిసరాలు క్రిమినాశక మందులతో కడిగి శుభ్రపరచాలి. ఆంటిసెప్టిక్ లోషనుతో పాదాలూ నోరూ కడగాలి.

పందులకి వచ్చే మశూచి అన్నది తీవ్రమైన అంటువ్యాధి. జ్వరం రావడం, ఆకలి లేకపోవడం, చెవులమీద, మెడపైన, లోతొడలపైన, కడుపు

పైన పొక్కులు లేవడం యీ జబ్బు లక్షణాలు. ఇది తీవ్రంగా వచ్చినప్పుడు ఒంటి నిండా కురుపులు రావచ్చును.

వ్యాధి సోకిన జంతువులను వేరుచేసి, వాటిని సౌఖ్యంగా పరిశుభ్రంగా ఉండే తావులో ఉంచాలి. వాటికి తేలికగా జీర్ణం అయ్యే ఆహారం ఇవ్వాలి. కురుపులని జాగ్రత్తగా శుభ్రపరచి చికిత్సచెయ్యాలి. వ్యాధిసోకిన పందులన్నింటినీ, వాటితో కలిసి ఉన్నవాటినీకూడా చంపివెయ్యడం మంచిది.

పందులకు వచ్చే మహామారి (స్వైన్ ప్లేగ్) అన్నది పందులకు వచ్చే ఒక అంటువ్యాధి. ఇది పందులకు వచ్చే జ్వరంతోపాటు తరచుగా సంభవిస్తుంది. తీవ్రమైన జ్వరం, ఆకలి లేకపోవడం, అవకతవకగా నడవడం, శ్రమతో కూడిన శ్వాస, ఒక్కొక్కప్పుడు గొంతు పొంగడం, అధిక విరేచనాలూ లేదా మలిగడుపు ఇవి యీ వ్యాధి చిన్నెలు. ముక్కులోంచి, గుదస్థానంలోంచి, మూత్రద్వారంలోంచి రక్తస్రావం కూడా కలగవచ్చును.

వ్యాధి సోకిన పందులని వేరుపరచాలి. పరిసరాలు క్రిమినాశక మందులతో శుభ్రపరచాలి. వ్యాధి సోకిన పశువులతో కలిసిన మిగతావాటికి ఇంజక్షన్లు యిప్పించాలి. వ్యాధి వచ్చి చనిపోయిన పందులన్నింటిని కాల్చివెయ్యడమో, లేదా సున్నం వేసి లోతుగా పాతిపెట్టడమో చెయ్యాలి. ముందు జాగ్రత్త పడడం కోసం, ఆరోగ్యంగా వున్న పందులకి టీకాలు వేయించాలి.

అక్కి లేక దద్దురు రోగం అన్నది పందులకి వచ్చే అంటువ్యాధి. తీవ్ర జ్వరం, డైమాను ఆకారంలో ఒంటిమీద దద్దుర్లు, చెవులు, చెవుల వెనుక నుండే చర్మం, తొడలు, కడుపు, బాగా ఎర్రపడడం ఈ జబ్బు లక్షణాలు. ఈ జబ్బు వచ్చిన ప్రారంభదశలో అజీర్తి కనిపించి, తరవాత విపరీతంగా విరేచనాలు వెళతాయి.

వ్యాధి సోకిన జంతువులని వేరుచేసి, పరిసరాలు క్రిమినాశక మందులతో శుభ్రపరచాలి. వ్యాధి సోకిన వాటితో కలిసి ఉన్న పందులకి, రక్షణకోసం, వ్యాధి ప్రతికూల సీరం ఇంజక్షన్లు యిప్పించాలి. దీనివల్ల సుమారు 15 రోజులవరకూ జబ్బు సోకకుండా ఉంటుంది. వ్యాధి రాకుండా ఉండడానికి ఏప్రిల్, మే మాసాలలో టీకాలు వేయించాలి. ఇలాగచేస్తే ఇంకా ఎక్కువకాలం యీ వ్యాధి నిరోధించబడుతుంది. మేత విషయంలోను, పందుల దొడ్డి విషయంలోను, పందుల పెంపకం లోను, లోపాలుంటే దిద్దుకోవాలి. ఆరోగ్యకరమైన పరిస్థితులు పందులకి లభించేటట్టు చూడాలి.

దొమ్మ అన్నది పందులకి వచ్చే ప్రాణహానికరమైన తీవ్రపు అంటువ్యాధి. మొదట తీవ్రంగా జ్వరం వచ్చి, తరవాత గొంతువాపు, నెత్తురు రంగులో మూత్రం పడడం, శ్వాసకి యిబ్బంది పడడం జరుగుతాయి. ఇవి యీ జబ్బు లక్షణాలు.

జబ్బు వచ్చి చనిపోయిన పందులని కాల్చివేయడంగాని పూడ్చిపెట్టించడం గాని చెయ్యాలి. ఆ పరిసరాలలో ఉన్న చెత్తా-చెదారం కూడా యీ మోస్తరుగానే కాల్చివెయ్యడమో, పూడ్చిపెట్టడమో చెయ్యాలి. ఈ వ్యాధి మనుష్యులకి కూడా సోకగలదు కనక, మృతజంతువుని కొయ్యకూడదు. వ్యాధి స్థానికంగా ఉన్న ప్రదేశాలలో, ఇది వ్యాపించకుండా పందులకి టీకాలు వేయించాలి. ఈ వ్యాధి వ్యాపించినప్పుడు దొమ్మ ప్రతికూల సీరం ఇంజక్షన్లు యిప్పించాలి.

క్షయ : ఇది దీర్ఘమయిన అంటువ్యాధి. జ్వరం రావడం, గ్రంథులలో కురుపులు వెయ్యడం దీని లక్షణాలు. ఈ కురుపులు దేహంలో యించుమించుగా ఏ భాగంలోనైనా వెయ్యవచ్చును. కోళ్లు బాతులు మొదలైన వాటివల్లగాని, పశువుల వల్లగాని, పందులకి యీ అంటువ్యాధి సంక్రమించవచ్చును.

వ్యాధి సోకిందని అనుమానం కలిగినప్పుడు, మందలో వున్న పందుల నన్నింటిని తనిఖీచేయించాలి. వ్యాధి నిరూపితం అయినవాటిని చంపివెయ్యాలి. మృత జంతువునీ, దానివద్దనుండే చెత్తా-చెదారం అంతా యథోచితంగా, తగులబెట్టడమో, పూడ్చిపెట్టడమో చెయ్యాలి. ఆరోగ్యప్రదమైన పద్ధతులను తప్పకుండా అవలంబించాలి.

జిగటవిరేచనాలు అనేది పందులకి సామాన్యంగా వచ్చే వ్యాధి. కొద్దిగా జ్వరం, స్తబ్దత, గాఢ ఎరుపు రంగులో విరేచనాలు దీని ముఖ్యలక్షణాలు. ఈ వ్యాధి సోకిన పంది చాలావరకు పడుకునే ఉంటుంది. వేగంగా శుష్కించిపోతుంది.

వ్యాధి సోకిన పందులను వేరుచెయ్యాలి. వ్యాధిసోకిన పందివద్ద నున్న చెత్తా-చెదారం, మలమూత్రాదులు యథోచితంగా పూడ్చిపెట్టాలి. గింజలమేత, చెరువులలో నీరు పెట్టడం మానివెయ్యాలి. తేలికగా జీర్ణం అయ్యే మేత పెట్టాలి.

పందిపిల్లలకి వచ్చే ఇన్‌ఫ్లూయెంజా అన్నది సాధారణంగా లేత వయస్సులో ఉన్న పందులకి వచ్చే వ్యాధి. జ్వరం రావడం, ముక్కు నీరు కారడం, కళ్లు పుసికట్టడం దగ్గు, న్యుమోనియా, పక్షవాతం, కీళ్లు – ముఖ్యంగా వెనుకకాళ్ల కీళ్లు – వాపు చూపడం యీ జబ్బు ముఖ్య లక్షణాలు. జబ్బు వ్యాప్తం కాకుండా ఉండడానికి, ఆరోగ్యంగా ఉన్న వాటన్నింటినీ వేరుపరచాలి. పందులను పొడిగా, పరిశుభ్రంగా ఉన్న దొడ్లలో ఒత్తుగా గడ్డివేసి ఉంచాలి. పందులకు వెచ్చగా ఉండేటట్టు చూడాలి.

# V. గుర్రాలు, కంచరగాడిదలు, గాడిదలు

## ఉపోద్ఘాతం

మానవుడు మచ్చిక చేసిన తొలి పశువులలో బహుశా గుర్రం ఒకటి. గుర్రాలూ, కంచరగాడిదలూ, గాడిదలూ ఒకేజాతికి చెందిన జంతువులు. వీటన్నింటికీ కూడా ఒకటే కాలివేలు ఉంటుంది; అది డెక్కలోపల ఉంటుంది. ఇప్పుడు మనం చూసే గుర్రం, ఆదిలో నక్కకన్నా చిన్నదిగా ఉండిన జంతువుల నుంచి వచ్చిందంటారు. ఇది మూడు మిలియను ఏళ్ల క్రిందటి వృత్తాంతం. ఈ మూడు మిలియను ఏళ్లకు సృష్టి పరిణామంలో అది, కనీసం పన్నెండు స్పష్టమైన అవస్థలైనా మారింది. ప్రస్తుతం ప్రపంచంలో 60 రకాల పెంపుడు గుర్రాలైనా ఉన్నాయి.

గుర్రం చక్కటి సహజజ్ఞానం కలది అని ప్రసిద్ధి. అనాది నుంచి మానవుడికి పని పాటలలోను, వినోదక్రీడలలోను కూడా గుర్రాలు చాలా ఉపయోగపడ్డాయి. ప్రాచీనకాలంలో గుర్రాలని యుద్ధాలలో విరివిగా వాడేవారు.

గుర్రం మిక్కిలి ఉపయోగకరమైన జంతువు. ముఖ్యంగా, శీఘ్రంగాను, సులువుగాను కావలసిన రవాణా పనులకు ఇది చాలా ఉపయోగకారి. కొండలలోను, కొండ ప్రాంతాలలోను రవాణా పనులకు గుర్రం ఒక్కటే ఆధారం. అచ్చట గ్రామీణ ప్రజలలో చాలామంది, వారి దైనందిన కార్యక్రమాలకి గుర్రాల పైన ఆధారపడతారు. తక్కువ దూరాల ప్రయాణాలకు గుర్రం చవకగా ఉండే సాధనం. పంచలనం వల్లనే గుర్రం తన జీవనోపాధిని ఆర్జించుకుంటుంది అంటారు.

రోడ్డు రవాణాకు యాంత్రిక సాధనాలు ఎక్కువగా వాడడం వల్ల, గుర్రాలను పెంచే పరిశ్రమ దెబ్బ తిన్నప్పటికీ, భారతదేశంలో ఇంకా అమూల్యమైన జాతులున్నాయి. ఈ దేశవాళీ జాతులను ఇంకా అభివృద్ధి పరచి, వాటి సంతతిని వృద్ధి చెయ్యవచ్చును. చాలావరకు ఈ జాతులలో ఒక్కొక్కటీ, దానివల్ల కావలసిన ప్రత్యేకమైన పనులకు, చాలా ఉపయుక్తంగా ఉంటుంది.

1982 వ సంవత్సరపు పశు సంఖ్యనుబట్టి, భారతదేశంలో 0.9 మిలియన్ల అశ్వాలూ (పోనీలు) ఉన్నాయి. 1977 లో వీటి సంఖ్య 0.91 మిలియన్లు. 1966 లో ఇవి 1.51, 1972 లో 0.94 మిలియన్లు ఉన్నాయి. తరువాతి అశ్వాల, గాడిదల, కంచరగాడిదల సంఖ్యను బట్టి చూస్తే వాటి సంఖ్య క్రమంగా తగ్గినట్లు మనకు కనిపిస్తుంది. రాష్ట్రాలవారీగా బీహారులో 0.11 మిలియన్లు, జమ్మూ,కాశ్మీరులో 0.1 మిలియన్లు, మధ్యప్రదేశ్‌లో 0.11 మిలియన్లు, పంజాబులో 0.11 మిలియన్లు మరియు ఉత్తరప్రదేశ్‌లో 0.21 మిలియన్లు ఉన్నాయి.

## గుర్రాలలో ముఖ్యమైన జాతులు

భారతదేశపు గుర్రాలలో అతి ముఖ్యమైన జాతులు; కథియవాడీ, మార్వాడీ, భూటియా, మణిపురీ, స్పితీ జాతులు.

కథియవాడీ జాతి అరబ్బు దేశం నుంచి దిగుమతి చేయబడిన గుర్రాల వల్ల సంక్రమించిందంటారు. ఒకసారి గుర్రాలతో వస్తూన్న వస్తూన్న ఓడ ఒకటి భారతదేశపు పశ్చిమతీరాన్ని పగిలిపోయిందట. ఈ జాతి గుర్రాలు గుజరాతు రాష్ట్రంలో గల కథియవారులో విరివిగా పెంచబడుతున్నాయి.

కథియవాడీ గుర్రపుతల అరబ్బీదేశపు గుర్రాల తలలాగే ఉంటుంది. దీని చెవి కొనలు, శిరస్సుకి మధ్యగా, కలిసినట్టు ఉంటాయి. దీని తోడ కొడవలి ఆకారంలో ఉంటుంది. బాదంకాయ రంగు, మట్టిరంగు, బూడిదరంగుల్లో సాధారణంగా యీ జాతి గుర్రాలు కానవస్తాయి.

కథియవాడీ గుర్రాలు చక్కని ఆకృతి గలిగి, దర్జాగానూ, సుందరంగానూ ఉంటాయి. మంచి ఎముక గలిగి, చురుకుగా పరుగిడే దృఢమైన జంతువులు యివి. ఈ గుర్రాల అంగా, వేగమూ సువిదితం.

మార్వాడీ జాతి రాజపుత్రస్థానంలో గల రాథోరు ప్రభువుల యొక్క సాహసకృత్యాలు, యీ జాతి గుర్రాన్ని చేర్చి మరీ చెబుతారు. రాజపుత్రస్థానంలో గల మార్వారు యీ జాతికి పుట్టినిల్లు.

మార్వాడీ జాతి గుర్రపు ముఖ్య లక్షణాలు కథియవాడీ జాతి వాటిలాగే ఉంటాయి. ఈ రెండు జాతులకీ మూలం ఒక్కటే అనీ, అవి పెరిగిన తావుల యొక్క శీతోష్ణస్థితినిబట్టీ వాతావరణ పరిస్థితులను బట్టీ వీటిలో చిన్న చిన్న

భేదాలు కలిగేయనీ అంటారు. ఈ జాతి గుర్రాలు బాదంరంగులోనూ, కొంచెం ఎరుపు రంగులోనూ ఉంటాయి.

మార్వాడీ జాతి గుర్రాలు గంభీరంగా, దర్జాగా, అందంగా ఉంటాయి. అవి అంగకూ, వేగానికీ, సహనశక్తికీ పేరుపడ్డాయి.

భుటియా జాతి గుర్రాలు టిబెట్టు సరిహద్దులలో గల నేపాలు ప్రాంతంలోనూ, హిమాలయపు దిగువ ప్రాంతాలలోనూ, పంజాబు నుంచి పశ్చిమ బెంగాలులో గల డార్జిలింగువరకూ పెంచబడుతున్నాయి

ఈ జాతి ముఖ్య లక్షణాలు : పొందికైన శరీరం, కురచగా లావుగా ఉండే మెడ, బలిష్ఠమైన వీపు, గుండ్రంగా కండరాలు తీరిన భుజాలు, ముతక వెంట్రుకలతో ఉన్న కాళ్లు, పొడవుగా ఉండే తోక, జూలున్నూ. గుత్తులదగ్గిర పాదాలు కాస్త ఎడంగా ఉంటాయి సామాన్యంగా యీ గుర్రాలు బూడిద వర్ణంలోగాని, నలుపుతో కూడిన బూడిదవర్ణంలోగాని ఉంటాయి. అక్కడక్కడ బాదంరంగులోనూ, ధూమ్రవర్ణంలోనూ కూడా ఉండడం కలదు.

కొండ ప్రదేశాలలో యీ గుర్రాలని సవారీ చెయ్యడానికీ, బరువులు మొయ్యడానికీ కూడా ఉపయోగిస్తారు

మణిపురీ పోనీలు కొన్ని శతాబ్దాల నుంచీ మణిపూర్‌లో పెంచబడుతున్నాయి

పరిమాణంలో చిన్నవి అయినా యీ జంతువుల శరీరం అనురూపంగా ఉంటుంది. దీని తల చిన్నదిగా ఉండి, బలంగా, కండరపుష్టితో ఉండే మెడకి బాగా పైగా ఉంటుంది. దీని ముక్కుపుటాలు విశాలంగా ఉంటాయి; ముట్టె వెడల్పుగా ఉంటుంది. దీని ప్రక్క ఎముకలు చక్కగా ఉంటాయి; ఉరస్సు విశాలంగా ఉంటుంది దీని కాళ్ళు మంచి లక్షణంగా ఉంటాయి. మోకాళ్ళు, తొడలు బలంగా ఉంటాయి. చీలమండలు మొదలు డెక్కలవరకూ ఉండే భాగం అనురూపంగా క్రమంగా ఏటవాలుగా ఉంటుంది.

మణిపురీ జాతి సొగసుకీ, వేగానికీ పేరు పడింది. ఈ జాతి గుర్రాలు బలిష్ఠంగా ఉండి, దృఢమైన పాదాలు గలిగి ఉంటాయి. "పోలో" ఆటకు, గుర్రపు పందేలకు, మిలిటరీ రవాణా పనులకి యివి ఎక్కువగా వినియోగింపబడుతున్నాయి.

స్పితీ జాతి పోనీలు పంజాబులో గల "కాంగ్ర" జిల్లాలో "కులు" తహసీలులో ఉన్న "స్పితి" ప్రాంతంలో ఉంటాయి.

ఇది చిన్న పరిమాణంలో ఉండే గుర్రం, దీని శరీరం పొందికగా ఉంటుంది; తల చక్కగాను, చెవులు సన్నగానూ, ఎముక బలంగానూ, పాదాలు గుండ్రంగానూ ఉంటాయి. దీని కాళ్లపైన ముదుకగా పొడవైన వెంట్రుక లుంటాయి. దీని ప్రక్కలు చక్కగా ఏర్పడి ఉంటాయి. భుజాలు చట్టలు బాగా ఎదిగి ఉంటాయి. ఈ జాతి గుర్రాలు చిక్కని బూడిద రంగులోనూ, నలుపు కలిపిన బూడిదరంగులోనూ, కపిలవర్ణంలోనూ (గోధుమరంగు నలుపు చేరిన రంగు) ఉంటాయి.

స్పితీ జాతి పోనీ బలమైనదీ, దృఢమైన పాదాలు కలదిన్నీ. ముఖ్యంగా యిది కొండ పరిస్థితులకి అనుగుణంగా ఉంటుంది. దూరపు ప్రయాణాలకీ, అననుకూలమైన వాతావరణానికి తట్టుకోగల త్రాణకీ, తక్కువ మేతలో గడుపుకోగల శక్తికీ ఇది పేరు పొందింది. ఈ గుర్రాలు బరువులు మొయ్యడానికీ, సవారీ పనులకీ ఎక్కువగా ఉపయోగింపబడుతున్నాయి.

ఈ పైన చెప్పిన జాతులు కాక 'బలూచీ' 'హిర్జాయి', 'అన్మోల్' వంటి పాకిస్థాని జాతుల గుర్రాలు కూడా భారతదేశంలో కానవస్తాయి.

భారతదేశంలో సవారీకి, గుర్రపు పందాలకు, పోలో ఆటకు ఉపయోగించే గుర్రాలలో చాలా వాటికి, భిన్నభిన్న పరిమాణాలలో "అరబ్బీ", "థరోబ్రెడ్" జాతుల లక్షణాలు కనిపిస్తాయి. అరబ్బీ, థరోబ్రెడ్ జాతుల గుర్రాలు ప్రపంచం అంతటా ప్రసిద్ధి కెక్కాయి. అరబ్బీజాతి గుర్రపు జాతులన్నిటిలోకీ మిక్కిలి ప్రాచీనమయినది. ఇంచుమించుగా, ప్రస్తుతం కానవచ్చే తేలిక అయిన గుర్రపు జాతులన్నిటికీ మూలం యిదే. సవారీ పనులకి, బరువులు మొయ్యడానికి అరబ్బీ జాతి ఆదర్శప్రాయమైనదంటారు. వేగానికి, ఉత్సాహానికి, సహనశక్తికీ థరోబ్రెడ్ జాతికి మించినది లేదు.

ఇటీవల హిమాచలప్రదేశ్‌లో, కొండజాతి పోనీలని అభివృద్ధి పరచడం కోసం కొద్దిగా "కన్నిమరా" జాతి గుర్రాలు, దిగుమతి చెయ్యబడ్డాయి.

## గుర్రాల పెంపకం

మిగతా పెంపుడు జంతువులకన్నా గుర్రానికి సంతతి తక్కువ. వాటిని జత కట్టించడం కష్టం. వాటికి చూలుకాలం కూడా ఎక్కువగా ఉంటుంది.

ఆడ గుర్రం సగటున 15 మొదలు 18 నెలల ప్రాయానికి యుక్త వయస్సుకి వస్తుంది. కాని మూడేళ్లు వచ్చేదాకా దానికి జతకట్టించకూడదు. పందాలకోసం, గుర్రం సాగసు ప్రకటించడానికోసం పెంచే ఆడగుర్రాలని, సామాన్యంగా, వాటి వాటి ఉపయోగాలు తీరిన తరవాతనే జతకట్టిస్తారు. మగ గుర్రం $4\frac{1}{2}$ మొదలు 5 ఏళ్ల ప్రాయానికి యవ్వనానికి వస్తుంది. మూడేళ్ల ప్రాయంలో దానిని జత కట్టించడానికి అరుదుగా ఉపయోగించాలి.

భారతదేశంలో, వసంత ఋతువు ప్రారంభదశ గుర్రాలను జత కట్టించడానికి అత్యుత్తమమైన కాలం. వెచ్చటి వాతావరణం ఉండడంచేత, వసంత ఋతువులో జతకట్టగా పుట్టిన పిల్లల్లో, శీతాకాలంలో వాటికంటే, ప్రాణనష్టం తక్కువ.

సామాన్యంగా ఒక మగ గుర్రంచేత 30, 40 ఆడ గుర్రాల వరకూ జతకట్టించవచ్చును; అయితే యిది, దాని వయస్సునిబట్టీ, ఎన్నేసిమాట్లు జతకట్టిందో దాన్నిబట్టీ ఉంటుంది. పెంపకం సరిగా ఉన్న పరిస్థితులలో, ఆడగుర్రాన్ని సామాన్యంగా రెండు మూడు సార్లు జతకట్టించాలి. మామూలుగా జతకట్టించిన ఆడ గుర్రాలలో నూటికి యాభై మాత్రమే గర్భం దాల్చి, పిల్లల్ని కంటాయి. గుర్రాల పెంపకం సాగించే వ్యవస్థలో 70 శాతం చూలు నిలిచి పిల్లల్ని పెడితే మెచ్చుకోవలసిందే.

చాలామంది అశ్వపాలకులు మగగుర్రాన్ని వారానికి అయిదుసార్లు మాత్రం జతకట్టించడానికి ఉపయోగిస్తే మంచిది అంటారు కాని, జతకట్టించే కాలపు ఉధృత సమయంలో, ఇంకా ఎక్కువసార్లు మగగుర్రాన్ని యీ పనికి వినియోగించవలసి ఉంటుంది. అయితే, అమితంగా అలసిపోవడం వల్ల మగగుర్రపు ధాతుపుష్టి, వీర్యం దెబ్బతింటాయి. జతకట్టించే కాంలో మగగుర్రం పుష్టిని కోల్పోకూడదు.

ఈనిన తరవాత నాలుగు మొదలు పదకొండు రోజులలోగా ఆడగుర్రం ఎదకి వస్తుంది. ఈనిన తరవాత తొమ్మిదవ రోజున జతకట్టించడం సాధారణంగా జరుగుతూన్నప్పటికీ, ఈనడం సహజంగా సులభంగా జరిగితే, ఆ తరవాత ఆడ గుర్రం పూర్తిగా స్వాస్థ్యం కోలుకుంటే అప్పుడు మాత్రమే అలాగ జతకట్టించడం శ్రేష్ఠం.

ఆడగుర్రాలు ప్రతీ 21 రోజులకు ఒకసారి ఎదకువస్తాయి. ఎదకాలం ఏడు మొదలు తొమ్మిది రోజుల వరకూ ఉంటుంది. ఎదకు వచ్చిన చివర

రోజులు, సాధారణంగా ఏడవరోజు, జతకట్టించడానికి చాలా యోగ్యమైన సమయం, గుర్రం సాధారణంగా ఒక్కపిల్లనే పెడుతుంది. కవలలు పుట్టడం చాలా అరుదు.

గుర్రం ఎదకు వచ్చినప్పుడు విశ్రాంతి లేకుండా ఉంటుంది. భగరంధ్రం ద్రవిస్తూ, సడలి ఉంటుంది. గుర్రంలో కామవాంఛ మిక్కుటంగా కనపడుతూ ఉంటుంది.

గుర్రాన్ని జతకట్టించినప్పుడు ఆరోగ్యసూత్రాలు తప్పకుండా పాటించాలి. జతకట్టించడం అయిన తరవాత ప్రయాస తగ్గడానికి ఆడగుర్రాన్ని కాస్సేపు అటూ ఇటూ తిప్పాలి. జతకట్టడం అయినవెంటనే మగగుర్రం యొక్క జననేంద్రియం శుభ్రంగా కడగాలి.

ఆడగుర్రం 340 రోజులు చూలుతో ఉంటుంది. జతకట్టాక, చూలుకాలం సగం అయేవరకూ కూడా, గుర్రాలు మామూలుగా పనిచేస్తాయి. ఇంక నాల్గైదు నెలలకు ఈనుతుందనగా మాత్రం, గుర్రంచేత ఎక్కువ పని చేయించకూడదు.

పదకొండో నెలలో, చూలున్న గుర్రం పొదుగు పెద్దది అవుతుంది. వారం పదిరోజులకు ఈనుతుందనగా గుర్రాన్ని విశాలమైన సాలలో ఉంచాలి. ఒకటి రెండు రోజులకి ఈనుతుందనగా సిరాలపైన క్రొవ్వు పూస కడుతుంది. ఒక్కొక్కప్పుడు పొదుగులోంచి పాలు కూడా కారవచ్చు.

తోకకి ఇరుప్రక్కలా వెనుకటి భాగంలో ఉన్న కండరాలు లోతుకి పోవడం, యోనిద్వారం బిగువు తప్పి ఉండడం ఇవి ఈనేకాలం దగ్గిరపడుతోందనగా కనపడే చిన్నెలు. ఈనేముందు గుర్రం విశ్రాంతి లేకుండా ఉంటుంది. డెక్కతో నేలని పదేపదే రాస్తూ ఉంటుంది. కొంచెం చెమట పడుతుంది. మాటిమాటికీ అది పడుకోవడం, లేచి నిలుచోడం చేస్తూ ఉంటుంది. సామాన్యంగా గుర్రాలు పడుకుని యీనుతాయి.

ఈనే సమయంలో గుర్రాన్ని అనవసరంగా కలవర పెట్టకూడదు. సవ్యంగా ప్రసవం కావడానికి అట్టేకాలం పట్టదు. క్రిముల వల్ల వ్యాధులు రాకుండా, గుర్రపు పిల్ల బొడ్డు తాటికి టించరయొడిన్ రాయాలి. ఈనిన, తరవాత ఒకటి రెండు గంటలకల్లా మావి పడుతుంది. అది పడ్డ తరవాత గుర్రం యొక్క వెనుకభాగం తోక శుభ్రంగా కడగాలి. క్రింద మురికి అయిన

గడ్డి తీసివేసి కొత్త గడ్డి వెయ్యాలి. ఈనిన తరవాత గోరువెచ్చటి నీళ్లలో గోధుమపొట్టు కలిపి చిక్కగా చేసిపెట్టాలి.

మామూలుగా, గుర్రపుపిల్ల పుట్టిన పదినిమిషాలలో లేచి నుంచుంటుంది. అలాగ లేచి నిలుచోవడానికి దానిని తొందర పెట్టకూడదు. అది లేవగలిగిన వెంటనే దానిని తల్లిపాలు తాగనివ్వాలి. ముర్రెపాలు విరేచనకారి; పుట్టినపిల్లకి అది ఆరోగ్యప్రదమైనది. పుట్టినవెంటనే గుర్రపు పిల్ల తల్లి బరువులో ఆరు మొదలు పది శాతం దాకా తూగుతుంది.

గుర్రపు పాలలో 9.42 శాతం ఘనపదార్థాలు. ఆవు పాలు, మేక పాలతో పోల్చి చూస్తే గుర్రపు పాలలో కొవ్వు పదార్థం, ప్రోటీన్లు చాల తక్కువ. సగటున గుర్రపు పాలలో 2.05 శాతం ప్రోటీన్లు, 1.14 శాతం కొవ్వు, 5.87 శాతం చక్కెర, 0.36 శాతం ఖనిజాలు, 90.58 శాతం నీరు ఉంటాయి.

## గుర్రానికి మేత

గుర్రం శాకాహారి. కాని అది ఆవూ, ఒంటెలాగ నెమరువెయ్యదు. నెమరువేసే జంతువులకి పొట్టలో నాలుగు అరలుంటాయి; కాని గుర్రానికి, మనిషికిలాగ ఒకటేపొట్ట. గుర్రపు పొట్ట (మిగతా జంతువుల పొట్టకన్న) చిన్నది; 10-18 లీటర్లు పట్టే మాత్రమే దీని పరిమాణం. అంచేత గుర్రానికి తక్కువ పరిమాణంలో ఎక్కువసార్లు మేత పెట్టాలి. మేతలేకుండా అట్టేకాలం గుర్రం ఓర్చుకుని ఉండలేదు. అలాగని అమితంగా మేతపెట్టడం వల్ల ఎన్నో మంచి గుర్రాలు పాడయిపోయాయి. గుర్రం యొక్క ఆరోగ్యం అభివృద్ధి కావడం కోసం మేత ఎక్కువగా పెట్టవలసి వచ్చినప్పుడు ఒకేసారి ఎక్కువగా మేతపెట్టే కంటే, ఎక్కువసార్లు మేత పెట్టడం మంచిది.

క్రమబద్ధంగా గుర్రాలకు మేతపెట్టడం చాలాముఖ్యం. ఉలవలవంటి కాయధాన్యాలు పెట్టేముందు, గడ్డిమేపడం సాధారణంగా ఆచరణలో ఉంది. సన్నగా కోసిన ఎండుగడ్డి గింజలతోపాటు పెట్టవచ్చును. కడుపునిండా మేతపెట్టిన తరవాత, గుర్రాన్ని కష్టమైన పనులకు ఉపయోగించకూడదు. అలాగే, అలిసిపోయిన గుర్రానికి ఒక్కసారిగా కడుపునిండా మేత పెట్టకూడదు. గుర్రాలలో జీర్ణకోశానికి సంబంధించిన జబ్బులకి సామాన్యంగా యిదే కారణం. మేతలో మార్పులు చేసినప్పుడు, అట్టి మార్పులు క్రమంగా ప్రవేశపెట్టాలి గాని,

ఒక్కసారిగా మార్పు చేయకూడదు. ఒక్కసారిగా మేతలో మార్పు చెయ్యడం వల్ల, గుర్రానికి శూల నొప్పి వచ్చి, ప్రాణహానికరంగా పరిణమించవచ్చును. మేత పెట్టేముందు గుర్రానికి మంచినీరు పెట్టాలి. గుర్రానికి ఎప్పుడూ కూడా పాసిపోయిన మేతకాని, బూజు పట్టినదిగాని, నాసిరకపుదిగాని మేత పెట్టకూడదు.

ఒక్కొక్క గుర్రానికి విడివిడిగా మేతపెట్టాలి. ఈ మేత ఆ గుర్రం చేసేపనికి అనువుగా ఉండాలి. జతకట్టవలసిన మగగుర్రాలు, జతకట్టించే కాలంలో ఆడగుర్రాలు, ఎదుగుతూ ఉన్న గుర్రపుపిల్లలు, వీటికి పుష్కలంగా మేతపెట్టాలి. చాలులో ఉన్న గుర్రాలకు పెట్టే మేత, ప్రోటీన్లు, ఖనిజాలు, విటమిన్లు ఎక్కువగా ఉండి, పుష్టికరంగా కొవ్వుపారించేది కాకుండా ఉండాలి. బాగా ఎదగడానికి, గుర్రపు పిల్లలకి, ఏడాదిప్రాయంలో ఉన్న లేత గుర్రాలకి చక్కగా మేతపెట్టాలి.

## గుర్రానికి సామాన్యంగా వెయ్యవలసిన మేత పదార్థాలు

ధాన్యాలన్నింటిలోకీ ఓట్సు గుర్రపు మేతకి అతి ఉచితమైనదీ, క్షేమకరమైనదిన్నీ, ఓట్సు, వట్టిగడ్డితో కలిపిపెట్టినట్లయితే, తగినంత మాంసకృత్తులుంటాయి కనక, గుర్రానికి యోగ్యమైన ఆహారం లభిస్తుంది. మామూలుగా ఓట్సు ధాన్యం ఆ పళంగానే పెడతారు. కాని ఓట్సు దంపి, పిండిగా చేసికూడా పెట్టడం కలదు. బార్లి, ఉలవలు సాధారణంగా గుర్రానికి పెట్టే కాయధాన్యాలు. ఓట్సుకి బదులుగా బార్లి యథేచ్ఛగా వాడవచ్చును బార్లి, ఉలవలు కూడా ఎప్పుడూ పిండి దంచి పెట్టాలి. గోధుమపొట్టు రుచికరంగా ఉంటుంది. విరేచనకారికూడాను. అంచేత చాలావరకు దీన్ని బార్లీకి బదులుగా వాడవచ్చును. ఇందులో భాస్వరము బాగా ఉంటుంది. కాని కాల్షియం తక్కువ. చక్కటి ఎండుగడ్డి పెడితే యీ కొరత పూర్తి అవుతుంది. గోధుమపొట్టు సాధారణంగా పొడిగానే పెడతారు. కాని దాన్ని వెచ్చటి నీళ్లలో చిక్కగా కలిపిపెట్టడం మంచిది. గుర్రాల మేత విషయంలో అవిసెపిండి కూడా మంచిది. అందులో మాంసకృత్తులు ఎక్కువగా ఉంటాయి. గుర్రపు వొంటిమీద రోమం బాగుండడానికీ, నిగనిగ లాడడానికీ యిది ముఖ్యంగా తోడ్పడుతుంది. బెల్లపు నీరు (చెఱకు మట్టి) దొరికినప్పుడు ఉలవలకి

బదులుగా అది వాడవచ్చును. సాధారణంగా దీనికి నీరు చేర్చి కాయధాన్యపు మేతతో కలిపి పెడతారు.

అన్నింటికంటె, గుర్రాలకి ప్రకృతి సిద్ధమయిన మేత పచ్చిగడ్డి. గుర్రం ఆరోగ్యంగా ఉండడానికీ, త్వరగా పెరగడానికీ పచ్చిగడ్డి చాలా ముఖ్యం. ఇది ఆరోగ్యప్రదమే కాకుండా, వీటివల్ల మేత ఖర్చుకూడా తగ్గుతుంది. జతకట్టే ఆడగుర్రాలకి, గుర్రపు పిల్లలకి పచ్చిగడ్డి ముఖ్యంగా అవసరం. గుర్రం, ఎన్నిక అయిన మంచిగడ్డినే మేస్తుంది. అంచేత దాన్ని బురదగా ఉన్న జాగాలలోగాని, నీటిమయంగా ఉన్న ప్రదేశాలలో గాని మేతకి వదలకూడదు.

లూసెర్న్, తదితర లెగుమినజాతి ఎండుగడ్డి గుర్రాల మేతకు సామాన్యంగా వాడతారు. గరిక చాలా వాడుకలో ఉంది. కేరట్ దుంపలు గుర్రానికి ఎక్కువ ప్రీతి. గుర్రానికి పెట్టే ఎండుగడ్డి గాని, పచ్చిగడ్డిగాని దుమ్ములేకుండా శుభ్రంగా ఉండాలి.

గుర్రాలకు, ముఖ్యంగా చూలున్నవాటికీ, జబ్బునుంచి కోలుకొంటున్న వాటికీ ఆరోగ్యం కూర్చాలి. అంటే ఉప్పు, ఖనిజపదార్థాలూ అవసరం. గుర్రానికి రోజుకి 28 మొదలు 56 గ్రాములవరకు ఖనిజమిశ్రమం, సన్నగా నూరిన సున్నపు రాతిపొడి, ఆవిరిమీద ఉడికించిన ఎముకల పొడి, ఉప్పు సమపాళ్లలో కలిపిపెట్టాలి. అయొడీను కొరతగా ఉన్న ప్రదేశాలలో అయొడీన్ చేర్చిన ఉప్పు వాడాలి.

సామాన్యంగా, పనిచేసే గుర్రాలకు రోజుకి 2.5 మొదలు 3.5 కిలోగ్రాముల వరకూ కాయధాన్యపు మిశ్రమమున్నూ, 6.5 కిలోగ్రాములు ఎండుగడ్డిన్నీ పెట్టాలి. గుర్రం 30 నిమిషాలలో ఎంత తినగలదో దాన్నిబట్టి, కాయధాన్యపు రేషను రెండు మూడు సార్లు పెట్టాలి. జట్కాలాగే చిన్న గుర్రాలకి రోజూ పెట్టే రేషనులో 2 కిలోగ్రాములు దంచిన ఉలవలు, 0.7 కిలోగ్రాము బార్లి, 0.7 కిలోగ్రాము గోధుమపొట్టు, 4.5 కిలోగ్రాముల ఎండుగడ్డి, 28 మొదలు 56 గ్రాముల వరకు ఉప్పుగాని ఖనిజాలు గాని ఉండాలి. పచ్చిగడ్డి దొరికినప్పుడు అర కిలోగ్రాము ఎండుగడ్డికి బదులుగా 1.5 కిలోగ్రాము పచ్చిగడ్డి వెయ్యాలి.

నీరు వేళల క్రమం తప్పకుండా ప్రతీరోజూ గుర్రానికి ఆయావేళలకి కావలసినంత మంచినీరు లభింపచెయ్యాలి. పనికి పూన్చేముందుగాని, పనిచేసి వచ్చిన వెంటనేగాని గుర్రానికి నీరు పెట్టకూడదు. సగటున రోజుకి గుర్రానికి 45 మొదలు 55 లీటర్ల నీరు కావలసి ఉంటుంది.

## గుర్రముల ఆలన, పాలన

గుర్రాన్ని చాలా నేర్పుగా సంబాళించుకోవాలి. ఎక్కడోగాని గుర్రాలలో స్వతహాగా పెంకిజంతువులుండవు. సరిగా సంబాళించుకోవడం తెలియకపోవడం చేత చాలా గుర్రాలు అలాగ తయారవుతాయి. గుర్రాన్ని దయతో చూస్తూనే కట్టుదిట్టంగా ఉంచాలి. దాన్ని ఎప్పుడూ బెదరకొట్టకూడదు. మృదువైన మాటలతో దాన్ని తర్ఫీదుచెయ్యాలి. ఆప్యాయంగా గుర్రాన్ని తడితే, దానికి మిక్కిలి ప్రోత్సాహకరంగా ఉంటుంది.

## గుర్రాలకి తర్ఫీదు

గుర్రాన్ని ఏ వయస్సులోనైనా లొంగదీసి తర్ఫీదు చెయ్యవచ్చును. కాని లేత వయస్సులో ఉన్నప్పుడే యీ పని చెయ్యడం శ్రేష్ఠం. ఎంత లేత వయస్సులో ఉంటే అంత సులభంగా దాన్ని అదుపులో పెట్టుకోవీలవుతుంది. మగ (గుర్రపు) పిల్లల్ని లేతవయస్సులో తరుచుగా తర్ఫీదు చెయ్యాలి. ఒకటి రెండు నెలల ప్రాయంలో వాటికి పరుగెత్తడం బండిలాగడం మప్పాలి. తల్లి గుర్రాన్ని వ్యాయామం కోసమో, నీరు పెట్టడానికో బయటికి తీసుకు వెళ్లినప్పుడు, మొదట్లో పిల్లని తల్లి పక్కనే నడిపించాలి. జీను వేసే గుర్రాలకి రెండేళ్ల వయస్సులో సవారీకీ, బండి లాగడానికీ తర్ఫీదు చెయ్యవచ్చును; కాని కనీసం మూడేళ్లు నిండేవరకూ వాటిని అధికంగా శ్రమపెట్టకూడదు. అభ్యాసం క్రమంగా ఎక్కువ చేస్తూ దానివల్ల పూర్తిగా పని రాబట్టుకోవాలి.

మగ (గుర్రపు) పిల్లలకి తర్ఫీదు ఇవ్వడంలో చాలా ఓరిమీ, శ్రద్ధా కనపరచాలి. తప్పుకి శిక్షపడుతుందనీ, చెప్పినట్టూ చేస్తే మెప్పువస్తుందనీ గుర్రానికి అర్థం అయే రీతిని తర్ఫీదు యిచ్చి, వెంటవెంటనే, ఆ శిక్షో మెచ్చుకోలో దానికి అనుభవం అయ్యేటట్టు చెయ్యాలి. ఆజ్ఞాపించే కేకలనుబట్టి ఏమేమి చేయాలో అర్థం చేసుకుంటాయి గుర్రాలు. అంచేత ఏ చలనాన్ని ఆపేక్షించి ఓ సంజ్ఞో, సంకేతమో చేస్తామో అదే సంజ్ఞ లేక సంకేతం ఆ చలనం కోసం ఎప్పుడూ ఉపయోగించాలి.

## స్తన్యం మాన్పించడం

సాధారణంగా గుర్రపు పిల్లలకి అయిదారు మాసాల ప్రాయంలో స్తన్యం మానిపిస్తారు. తొందరగా స్తన్యం మానిపిస్తే అవి సక్రమంగా ఎదగడానికి అనువుగా ఉండదు. స్తన్యం మానిపించిన తర్వాత, పిల్లని తల్లినుంచి పూర్తిగా వేరుగా ఉంచడం అవసరం. ఒక ఏడాది వయస్సు వచ్చేవరకు, గుర్రపు పిల్లల్ని, ఆడవాటినీ మగవాటినీ యథేచ్ఛగా తిరగనివ్వవచ్చును.

## వ్యాయామం

చక్కని వ్యాయామం వల్ల గుర్రం యొక్క దేహస్థితి, ఆరోగ్యం బాగుంటాయి. గుర్రానికి క్రమం తప్పకుండా రోజూ వ్యాయామం చేయించాలి. పిల్లల్ని పెట్టే గుర్రానికి, జతకట్టే గుర్రాలకి, మగ (గుర్రపు) పిల్లలకి చక్కటి వ్యాయామం ముఖ్యంగా అవసరం. తప్పకుండా జతకట్టే కాలంలో ప్రతిరోజూ 8, 10 కిలోమీటర్లు సవారిచేసో, బండిలాగించో మగగుర్రానికి తగినంత వ్యాయామం కల్పించాలి.

దైనందిన కార్యక్రమం ఆరంభించేటప్పుడు, అత్యధిక శ్రమ కలిగేముందుగా గుర్రానికి క్రమంగా పని అధికం చేస్తూ రావాలి.

## గుర్రాలకి మాలీసు

గుర్రాలని ఆరోగ్యంగా ఉంచడానికి వాటిని క్రమబద్ధంగానూ చురుకుగానూ, మాలీసు చెయ్యాలి. సరిగా మాలీసు చేస్తే గుర్రాల శరీరాలు నిగనిగలాడుతూ శుభ్రంగా ఉంటాయి. మాలీసు చెయ్యడం వల్ల రక్తప్రసరణ ఎక్కువ అయి, గుర్రం యొక్క దేహస్థితి, చూపరితనము వృద్ధి పొందుతాయి. మాలీసు ఒక విధమైన వ్యాయామం కూడాను.

పనిచేసే గుర్రాలకన్నా సోమరిగా ఉండేవాటిని ఎక్కువగా మాలీసు చెయ్యాలి. పనిలోకి వెళ్లేముందు తేలికగా మాలీసు చేసి, పనినుంచి తిరిగి వచ్చిన తరవాత గట్టిగా మాలీసు చెయ్యాలి. అయితే మాలీసు చేసేటప్పుడు గుర్రం యొక్క శరీరం చల్లగానూ, పొడిగానూ ఉండేటట్టు చూడాలి. తల, కాళ్ల యొక్క మృదువైన భాగాలని మాలీసు చెయ్యడానికి బ్రష్షు ఉపయోగించాలి.

## నాడాలు వెయ్యడం

మంచి గుర్రానికి మంచిడెక్క ఉండాలి. "డెక్క లేకపోతే గుర్రం లేదు" అని పాతసామెత. సామాన్యంగా రెండు మూడేళ్ల వచ్చేవరకు గుర్రాలకి నాడాలు వేయించరు. ప్రతీ నెల ఎనిమిది మిల్లీమీటర్ల చొప్పున డెక్క పెరుగుతుంది. చిన్న వయస్సులో ఉన్న గుర్రానికి ఆరువారాలకి ఒకసారి నాడాలు వేయించవలసి ఉంటుంది.

## గుర్రపు లాయములు

గుర్రాలని ఉంచే లాయములు ఆరోగ్యకరంగానూ, సౌఖ్యప్రదంగానూ ఉండాలి. చలి, వేడి, వాన, గాలి మొదలైన వాతావరణ పరిస్థితుల ఉంచి గుర్రానికి సరిఅయిన రక్షణ ఉండాలి. బాగా గాలీ వెలుతురూ వచ్చి చల్లగా ఉండే సాలలు, ఉక్కబెట్టి వేడిగా ఉండే వాటికంటె మంచివి.

గుర్రపులాయము పరిసరాలకన్న ఎత్తుగా ఉండాలి, మంచినీటికి, మురికి నీరు పోవడానికి తగిన సదుపాయాలు ఉండాలి. ఇటువంటి లాయములు కట్టడానికి అవసరంగా డబ్బు వెచ్చింపనక్కరలేదు. లాయం మాత్రం గుర్రం నిలబడి ఉండడానికి, హాయిగా పడుకోడానికి వీలుగా తగినంత విశాలంగా ఉండాలి.

నేల, నీరు ఇంకేదిగా ఉండకూడదు. గుర్రం జారిపోకుండా, నేల గరుకుగా ఉండాలి. తడినేలపై గుర్రాన్ని నిలవనియ్యకూడదు; అలా నిలవడం వల్ల డెక్క మెత్తబడిపోయి, పాదాలపైన లేసే కురుపులు మొదలైన జబ్బులకి దారితీస్తుంది.

లాయములు ఎప్పుడూ శుభ్రంగానూ, పొడిగాను ఉంచాలి. నేలపైని ఎండు గడ్డి పరచి ఉంచాలి. తడిసి, మురికి అయిన గడ్డివల్ల గుర్రానికి చర్మవ్యాధులు వస్తాయి.

శీతాకాలంలో పని అయిపోయిన తరవాత, గుర్రం మీద రగ్గు కప్పి ఉంచాలి.

## గుఱ్ఱాల వయస్సు నిర్ణయించడం

నోటిలో ఉండే పళ్లని బట్టి గుఱ్ఱం వయస్సు తెలుసుకోవచ్చును. గుఱ్ఱాలకి క్రింది దవడకి మూడుజతలు, పైదవడకి మూడుజతలు కత్తెరపళ్లు ఉంటాయి. పిల్లకి రెండు వారాల వయస్సు వచ్చేసరికి మొదటిజత కత్తెరపళ్లు మొలుస్తాయి. నాలుగు మొదలు ఎనిమిది వారాలలో ప్రాయంలో రెండవ జత, ఆరు మొదలు తొమ్మిది నెలల ప్రాయంలో చివరిని ఉండే మూడవజత మొలుస్తాయి. ఒక ఏడాది పిల్లకి క్రింది దవడలోను, పైదవడలోను కూడా ఆరు కత్తెర పాలపళ్లు ఉంటాయి.

రెండున్నర ఏళ్లు పైబడిన తరవాత, మధ్యనుండే స్థిరమైన కత్తెరపళ్లు రానారంభిస్తాయి. మూడేళ్లు ఉన్న గుఱ్ఱానికి ఆ దవడకీ, యీ దవడకీ ఒక జత స్థిరమైన కత్తెరపళ్లు ఉంటాయి. నాలుగేళ్ల దానికి రెండు జతలున్నూ, అయిదేళ్ల దానికి మూడు జతలున్నూ స్థిరమైన కత్తెరపళ్లుంటాయి. ఈ వయస్సులో గుఱ్ఱం మూతి పూర్ణదశకి వచ్చింది అన్నమాట.

గుఱ్ఱం ముసలిది అయినకొద్దీ దానిపళ్లు అరిగిపోతూ ఉంటాయి. అయిదు మొదలు పన్నెండు సంవత్సరాల వరకూ గుఱ్ఱపు వయస్సు. దాని పళ్ల అరుగుదలని బట్టీ, అలాగ అరగిపోవడం వల్ల పోయే పంటి డొలకలని బట్టీ సుమారుగా చెప్పవచ్చును. గుఱ్ఱానికి పది, పన్నెండేళ్లు వచ్చేసరికి కత్తెరపళ్ల మీద ఉండే డొలకలన్నీ పోతాయి. ఈ వయస్సులో గుఱ్ఱం పళ్లు నున్నగా ఉంటాయి.

గుఱ్ఱం 40 ఏళ్ల వరకూ జీవించవచ్చును. కాని సగటున అది పనిపాటులు చెయ్యగలిగిన కాలం 12 మొదలు 15 సంవత్సరాల వరకు మాత్రమే.

# గాడిదలు

గుఱ్ఱపు జాతికి చెందిన జంతువులలో గాడిద బహు నిరాడంబరమైనదీ, స్వార్థ రహితమైనదిన్నీ. ఇది మిక్కిలి ఓర్పుగలది. నాసిరకపు మేతమేసికూడా, ఇంచుమించు విరామం అక్కరలేకుండానే, ఇది నిరంతరంగా పనిచెయ్యగలదు. దీన్ని ముఖ్యంగా బరువులు మొయ్యడానికి ఉపయోగిస్తారు. దృఢమైన

పాదాలకి ఇది పెట్టింది పేరు. ఈనాటి గాడిదలకి మూలపశువు నూబియన్ గాడిద అని అంటారు. మెసపొటేమియాలోనూ, ఈజిప్టులోనూ బహుశా క్రీ.పూ. 4000 ఏళ్లక్రితం నూబియన్ గాడిదలని పెంచేవారు.

వేడిగానూ, కాస్త పొడిగానూ ఉండే ప్రదేశాలలో గాడిద పెంపొందుతుంది. తెలివితక్కువకీ, మూర్ఖతకీ సామాన్యంగా గాడిదని పేర్కొంటారు. కాని యీ అవలక్షణాలు, చిరకాలంనుంచీ మానవుడు గాడిదపట్ల చూపిన నిరాదరణవల్ల వచ్చినవి. సానుభూతితో సరిగా సంబాళించుకొనేటట్టయితే యీ అవగుణాలు చాలావరకు తగ్గించవచ్చును.

1982 వ సం॥లో భారతదేశంలో 1.02 మిలియను గాడిదలు ఉండేవి. 1977 ఉన్నదాని కంటె ఈ సంఖ్య 4.7 శాతం ఎక్కువ. ఎక్కువ సంఖ్యలో ఇవి రాజస్థానులో ఉన్నాయి. దీని తరవాత వచ్చేది ఉత్తరప్రదేశ్, గుజరాతు, తమిళనాడు, హరియానా.

భారతదేశంలో సామాన్యంగా కానవచ్చే గాడిదలు రెండు రకాలు. బూడిద రంగులో ఉండే చిన్నగాడిద, తెలుపు రంగులో ఉండే పెద్ద గాడిద. దేశంలో చాలా భాగాల్లో బూడిదరంగులో ఉండే చిన్నగాడిద కానవస్తుంది. దీనికి కాళ్లపైనా, మెడమీదా, భుజములూ మక్కలపైనా నల్లటి చారలుంటాయి. ఈ చిన్న గాడిద నలుపుతో కలిసిన బూడిదరంగులో ఉంటుంది. తెలుపు రంగులో ఉండే పెద్దగాడిద చాలావరకు గుజరాతులో ఉన్న కథియవార్ ప్రాంతాలలో కానవస్తుంది. ఇది తేలిక అయిన బూడిద రంగులో యించుమించుగా తెల్లగా ఉంటుంది.

విదేశీజాతి గాడిదలలో ముఖ్యం అయినవి తెల్ల ఇజిప్షియను జాతి. డెమాస్కసు, పెర్షియను, అరబ్బీజాతులూ, ఫ్రాంసు దేశానికి చెందిన "ప్వాతూ" జాతిన్నీ. ప్రపంచంలో గల గాడిదలలో కల్లా ప్వాతూ జాతి మిక్కిలి పెద్దది. భారతదేశపు గాడిద మిక్కిలి చిన్నది.

గాడిదలు సామాన్యంగా $2\frac{1}{2}$, 3 ఏళ్ల ప్రాయానికి పిల్లల్ని పెడతాయి. వీటికి ప్రత్యేకించి జతకట్టేకాలం అంటూ లేదు. ఏడాది పొడుగునా జతకట్టించ వచ్చును. యుక్తవయస్సు వచ్చిన మగగాడిద చేత ఏడాదికి 160 సార్లు జతకట్టించవచ్చును. కాని రోజుకి రెండుసార్ల కన్నా ఎక్కువగా జతకట్టించ కూడదు. గాడి $11\frac{1}{2}$ మొ॥ 12 మాసాల వరకు చూలుతో ఉంటుంది.

21 మొదలు 28 రోజులకి ఒకసారి ఎదకు వస్తుంది. ఎదకాలం మూడు మొదలు ఏడురోజులవరకూ ఉంటుంది. ఎదకు వచ్చిన మూడవరోజు జతకట్టించడానికి అతి యోగ్యమైన కాలం. ఈనిన తరవాత ఆరు మొదలు ఎనిమిది వారాల తరవాత తిరిగీ జతకట్టించవచ్చును.

ఈనిన తరవాత 6 మొదలు 12 నెలల వరకూ గాడిద పాలిస్తుంది. పిల్లలకు ఆర్నెల్ల ప్రాయంలో స్తన్యం మానిపిస్తారు. సామాన్యంగా గాడిద మూలుకి ఒకటే పిల్లని ఈనుతుంది.

గాడిదపాలల్లో 1.37 శాతం క్రొవ్వు, 1.85 శాతం ప్రోటీన్లు, 6.19 శాతం చక్కెర, 0.47 శాతం ఖనిజాలు 90.12 శాతం నీరూ ఉంటాయి. గాడిదపాలు జీర్ణించుకోవడం సులభం. భారతదేశంలోనూ, ఇటలీ, స్పెయిను, దక్షిణ ఫ్రాంసు మొదలయిన యితర దేశాలలోనూ మనిషి పాలకు బదులుగా ఉపయోగించడానికి గాడిదపాలు బహుయోగ్యమైనదిగా పరగణింపబడుతున్నాయి.

సామాన్యంగా గాడిదలు గంటకి 3 మొదలు 5 కిలోమీటర్ల చొప్పున నడుస్తాయి. రోజుకి 25 మొదలు 32 కిలోమీటర్ల దూరం పోగలవు. బరువులు మొయ్యడానికి ఆడగాడిదల కంటె మగవాటినే ఎన్నిక చేస్తారు. గుర్రాలకు లాగే గాడిదలకూ డెక్కలకి నాడాలు వేయించాలి. గాడిద 16, 17 ఏళ్ల వరకూ పనిచెయ్యగలదు.

# కంచరగాడిదలు

గుర్రపు జాతి జంతువులన్నిటిలోకీ కంచరగాడిద తత్త్వం అవగాహన చేసుకోవడం కష్టం. ఆడగుర్రాన్ని మగగాడిద చేత జతకట్టించగా కలిగేది కంచర గాడిద. ఆడగాడిదని మగపోనీల చేత (చిన్నసైజు గుర్రాలు) జత కట్టించడం సాధారణంగా కనబడదు. కంచరగాడిదలకి సంతతి కలగదు.

ఎంత అనువుగాని మేత అయినా సరే, ఎంత ప్రతికూల వాతావరణ పరిస్థితులలోనైనా సరే, తట్టుకోగల త్రాణ అమితంగా ఉంది కంచర గాడిదలకు. కరకు నేల గల కొండ ప్రాంతాలలో బరువులు మోయడానికి, మిగతా జంతువుల కన్న దీన్ని ఎక్కువగా ఎన్నికచేస్తారు. కంచరగాడిదల

విషయంలో, గుర్రాల విషయంలో తీసుకోవలసినంత శ్రద్ధ అవసరం లేదు. వీటి పాదాలు అసాధారణమైన రూపంలో ఉండడం చేతా, పక్కలూ అరిపాదాలూ దళంగానూ బలంగానూ ఉండడం చేతా కంచరగాడిదకి కుంటితనం సాధారణంగా రాదు.

కంచరగాడిద "స్వయంరాజా స్వయం మంత్రీ" అంటే తనకితానే యజమాని. దీనికి తెలివితేటలు గుర్రం నుంచీ, దృఢమైన పాదాలు గాడిదవల్లా సంక్రమిస్తాయట. క్రొత్తవారి దగ్గర కంచరగాడిదలు సాధారణంగా బెదురుతాయి. వెనుక కాళ్లతో యథేచ్ఛగా తంతాయి.

హిమాలయాల్లో, ఉత్తరభాగాన, కొండ ప్రాంతాలలో గల సరిహద్దులు యిటీవల తెరవడంతోనే, మిలిటరీ కార్యక్రమాలలో కంచరగాడిదల ప్రాముఖ్యం ఇతోధికంగా అయింది. అయితే, ప్రస్తుతం భారతదేశంలో గల కంచరగాడిదల సంఖ్య చాలాతక్కువ. 1982 కంచరగాడిదల లెక్కల ప్రకారం, దేశంలో మొత్తం కంచరగాడిదల సంఖ్య 131000 ఉన్నాయని అంచనా వేశారు. ఇవి 1977 సం॥ లో ఉన్నవాటికంటే 47 శాతం ఎక్కువ. ఉత్తరప్రదేశ్‌లో కంచరగాడిదల సంఖ్య54,000; పంజాబులో 22,000; హర్యానాలో 17,000; జమ్మూ,కాశ్మీర్‌లో 15,000 మరియు హిమాచల్‌ప్రదేశ్‌లో 13,000 కంచరగాడిదలున్నాయి

కంచరగాడిదలను సక్రమంగా పనిచేసే పద్ధతిలో ఉంచడానికి ఎడతెగని శ్రద్ధా, జాగర్తా అవసరం. గుర్రాల విషయంలో చెప్పిన మేత పరిస్థితులూ, లాయముల ఏర్పాట్లూ, వీటికి కూడా వర్తిస్తాయి. అయితే ఇవి నాసిరకపు మేత పెట్టినా గడుపుకో గలవు. సాధారణంగా వీటికి జబ్బులు రావు.

మిలిటరీలో పిరంగులు మోసే కంచరగాడిదలకి రోజూ పెట్టే మేతలో ఒక కిలోగ్రాముకి కాస్త హెచ్చుగా దంచిన సెనగలు, బార్లీ, తొమ్మిది కిలోగ్రాముల ఎండుగడ్డి లేక లూసెర్న్, 28 గ్రాముల ఉప్పూ ఉంటాయి. కాడి పనులకి ఉపయోగించే వాటికి ఒక కిలోగ్రాముల తవుడు అదనంగా పెట్టాలి.

కంచరగాడిదలు దప్పికకి బాగా ఓర్చుకోగల వైనప్పటికీ వాటికి వలసినంత మంచినీరు రోజూ లభింపజెయ్యాలి. పారుతూన్న నీటికంటే, తొట్టెలో గాని బాల్చీలోగాని నీరు పెడితే అవి ప్రీతిగా తాగుతాయి. కంచరగాడిదలు బాగా యీదగలవు. లోతుగా ఉన్న ఏళ్లూ చిన్న నదులూ ఇవి సులభంగా యీది అవతల గట్టుకి చేరుకుంటాయి.

వీటికి రోజూ క్రమబద్ధంగా మాలీసు చెయ్యాలి. జీను తీసివేసిన తరవాత, వీటిని యథేచ్ఛగా నేలని దొర్లనివ్వాలి. గట్టి నేలమీద పనిచేసే కంచర గాడిదలకి, గుర్రాలకి లాగే, డెక్కలకి నాడాలు వేయించాలి.

సామాన్యంగా, మూడునాలుగేళ్ల ప్రాయం వచ్చేసరికి కంచరగాడిదచేత పని చేయించవచ్చును. కంచరగాడిద మామూలుగా గంటకి సుమారు అయిదుమైళ్లు పోగలదు. రోజుకి 24 మొదలు 32 కిలోమీటర్లు సులభంగా వెళుతుంది. 18-20 సంవత్సరాలు వచ్చేవరకూ, ఇంకా కాస్త ఎక్కువ వయస్సు వరకూ కూడా, కంచరగాడిదలు పనిచెయ్యగలవు.

## గుర్రపుజాతి జంతువుల ఆరోగ్యం

ఈజాతి జంతువులు, ముఖ్యంగా గుర్రాలు, అనేకమయిన వ్యాధులకి గురి అవుతాయి. అంచేత వీటి ఆరోగ్యవిషయంలో ప్రత్యేకించి శ్రద్ధ కనపరచాలి. ఆరోగ్యంగా ఉన్న జంతువు చురుకుగానూ, మెళుకువతోనూ ఉంటుంది. దాని కళ్లు కాంతివంతంగా ఉంటాయి. చెవులు తరుచు అటూయిటూ తిప్పుతూ ఉంటుంది. దాని శరీరంపైనున్న రోమాలు మృదువుగా ఉండి శరీరం నిగనిగలాడుతూ ఉంటుంది. ఆకలిదప్పులు మామూలుగా ఉండి, జంతువు చక్కగా నిద్రపోతుంది. ఆరోగ్యంగా ఉన్న గుర్రం తన భారం అంతా ముందరికాళ్లు రెండింటిమీదా సమానంగా ఆనిస్తుంది. కాలికి ఏదైనా (వ్యాధి వంటిది) వస్తే తప్ప అది ఒంటికాలు వంచి నిలుచోదు. గుర్రానికి విశ్రాంతి కావలసినప్పుడు, అది వెనుకకాళ్లు కాస్త ఎడంగా ఉంచి, ఒక కాలు విడిచి ఒక కాలిమీద ఆనుకుని నిలుచుంటుంది.

జంతువుకి వ్యాధి సోకిన లక్షణాలు ఏవంటే, మందంగా ఉండడం, ఆకలి మందగించడం, విపరీతంగా చెమటపొయ్యడం, చెవులు వేలాడి ఉండడం, జ్వరం, శ్వాసరేటు, నాడిరేటు హెచ్చు అవడం, కన్ను పుసికట్టడం, ముక్కు నీరుకారడం, విరేచనాలు లేదా మలబద్ధం, కుంటితనం లేదా శరీరంలో ఏదైనా ఒకభాగం పొంగడమున్నూ.

గుర్రం యొక్క సాధారణపు దేహ ఉష్ణత 37.8 డిగ్రీలు సెంటిగ్రేడు (100 డిగ్రీలు ఎఫ్.) జంతువుకి ఉద్రేకం కలిగినప్పుడు, పనిచేసినప్పుడు ఉష్ణత

పెరుగుతుంది. గుర్రము యొక్క ఉష్ణత మామూలు థర్మామీటరు గుదస్థానంలో జొనిపి, మూడు నిమిషాలు ఉంచి, తెలుసుకోవచ్చును.

గుర్రం యొక్క నాడి రేటు నిమిషానికి 36 మొదలు 40 వరకు ఉంటుంది. చాలా లేబ్రాయం గల జంతువులలో యింకా అధికంగా ఉంటుంది. ఎక్కువ శ్రమతో కూడిన పనిచేసిన తరవాత నాడిరేటు 80, 90 వరకు ఉండవచ్చును. కాని 1 గంటలోగా మామూలు రేటుకి దిగిపోతుంది. దవడ దగ్గరనున్న కండరానికి ఎదురుగా దవడ ఎముకని మట్టివచ్చే ధమనిపై మునివేళ్లుంచి గుర్రం యొక్క నాడి తెలుసుకోవచ్చును.

సామాన్యంగా గుర్రపు శ్వాసరేటు నిమిషానికి 8 మొదలు 16 వరకూ ఉంటుంది. కాస్త అలిసిపోతే ఇది 70 కి పైగా కూడా ఉండవచ్చును. ఆరోగ్యంగా ఉన్న గుర్రానికి, నాడికంటే శ్వాసరేటు, పరిశ్రమ ఆపివేసిన తరవాత, త్వరగా యథాస్థితికి వస్తుంది. శ్వాసరేటు, పరిశ్రమ ఆపివేసిన తరవాత, త్వరగా యథాస్థితికి వస్తుంది. శ్వాసరేటు డొక్కలు ఎగరడం బట్టిగానీ, ముక్కుపుటాలు ఎగరడం బట్టిగానీ తెలుసుకోవచ్చును.

ఆరోగ్యం బాగా ఉన్న గుర్రం 24 గంటలలో ఎనిమిది పదిసార్లు లద్దెలు వేస్తుంది. లద్దె సామాన్యంగా ఉండలాగ ఉండి, క్రిందపడగానే విచ్ఛిన్నం అయిపోయేట్టు మెత్తగా ఉంటుంది. రోజుకి చాలాసార్లు గుర్రం మూత్రం విసర్జన చేస్తుంది. మూత్రం లేత పసుపురంగులో ఉంటుంది.

గాడిదయొక్క సామాన్యపు దేహ ఉష్ణత 37.5 మొ।। 38 డిగ్రీల సెంటిగ్రేడు (99.5 మొ।। 100.4 ఎఫ్) శ్వాసరేటు నిమిషానికి సుమారు 15, నాడిరేటు 38 న్నీ.

కంచరగాడిదల సామాన్యపు దేహోష్ణత, శ్వాసరేటు, నాడిరేటు గాడిదల వాటిలాగే ఉంటాయి.

## గుర్రపుజాతి జంతువులకి వచ్చే సామాన్యపు వ్యాధులు

ఇన్ఫ్లూయింజా లేక "పింకై" అనేది వీటికి వచ్చే సామాన్య వ్యాధి. దీని ముఖ్య లక్షణాలు : మూడు నాలుగు రోజులవరకు జ్వరం కాయడం, కళ్లు బాగా ఎర్రబడడం, కనురెప్పలు పొంగి నీటితో ఉన్నట్టు ఉండడం, కఠినమైన దగ్గు, ముక్కు సంతతిధారగా కారడమున్నూ.

వ్యాధి సోకిందని అనుమానం తగిలిన జంతువులన్నింటినీ వేరుచెయ్యడం, త్రాగేనీటిలో హరినము (క్లోరిను) కలపడం, ఆరోగ్యకరమైన పద్ధతులు అవలంబించడం వ్యాధి నిరోధక మార్గాలు. క్రొత్తగా కొన్న వాటన్నింటినీ రెండు-మూడు వారాల వరకూ వేరొక లాయంలో ఉంచాలి.

స్ట్రాంగిల్స్ అనేది ఒక పెద్ద అంటు వ్యాధి. దీని ముఖ్య లక్షణాలు : మాంద్యం, క్రుంగిపోయి ఉండడం, జ్వరమున్నూ, ఆదిలో ముక్కు కాస్త నీరు కారుతుంది. శీఘ్రంగా అది చిక్కగా కొంచెం పసుపురంగుతో తెల్లగా అయి, ఇరుపార్శ్వాల లోంచి వెలువడుతుంది. గొంతు ప్రాంతంలో నొప్పి పుడుతుంది; అక్కడ గడ్డలు లేస్తాయి. అవి క్రమంగా పెరిగి పెద్దవవుతాయి. మేత మింగడానికి, శ్వాసపీల్చుకోడానికి జంతువు ఆయాసపడుతుంది.

వ్యాధి సోకిన జంతువును వేరుపరచాలి. లాయము, మేత ఉంచే తొట్టి, నీళ్ల తొట్టి మొదలైన వాటిని క్రిమినాశక మందులతో పరిశుభ్రపరచాలి. తేలికగా జీర్ణం అయే పోషక ఆహారం పెట్టాలి. జబ్బునుంచి కోలుకొన్న వాటిని వెంటనే పనికి నియమించకూడదు.

సేంబా లేక అగ్నివాయురోగం (గ్లాండర్స్‌ఫార్సీ) అనేది ప్రాణహానికరంగా పరిణమించగల తీవ్రమైన అంటువ్యాధి ముక్కులోని మ్యూకస్‌పొరల మీద కురుపులు పుట్టడం యీ వ్యాధి లక్షణం. ముక్కుపుటాలు కాంతి హీనంగానూ, మురికిగానూ, కాస్త నీలిగానూ అయిపోతాయి. శోషకవాహికలు **(Lymph Vessels)** పొంగి, వాహికలమ్మటే పొక్కులు లేస్తాయి. ఇవి చితికినప్పుడు లేత పసుపు రంగులో చిక్కటి చీము కారుతుంది. ఈ చీము కురుపుల అంచులనే గడ్డకట్టుకు పోతుంది.

ఈ వ్యాధి వ్యాపించకుండా ఉండడానికి, వ్యాధి వచ్చిన జంతువులని చంపి వెయ్యాలి. ఆ కళేబరాలని తగులబెట్టించడమో, పూడ్చిపెట్టించడమో చెయ్యాలి. వ్యాధి సోకిందని అనుమానం తగిలిన జంతువులన్నింటినీ, ఆరోగ్యంగా ఉన్నవాటి నుంచి వేరుపరచాలి. వ్యాధి సోకిన వాటికి ఉపయోగించే మేత తొట్టెలూ, నీటి తొట్టెలూ ఆరోగ్యంగా ఉన్నవాటికి వాడకూడదు.

ఎపిజూఆటిక్ లింఫెన్‌జైటిస్ కూడా ఒక తీవ్రమైన అంటువ్యాధి. ఇది వస్తే శోషకవాహికలు పొంగి, పగిలి, కురుపులు అవుతాయి. లేత పసుపు రంగులో చిక్కగా చీము కారుతుంది. వ్యాధి సోకిన అవయవం అంతాకూడా పొంగి పోవచ్చును. మ్యూకసుపొరలు రక్తహీనంగా ఉంటాయి.

వ్యాధి సోకినదని అనుమానం తగిలిన జంతువులన్నింటినీ వేరుచెయ్యాలి. వ్యాధి వచ్చినవాటిని చంపివెయ్యాలి. వ్యాధి వచ్చిన జంతువులకై ఉపయోగించిన పాత్రలన్నింటినీ క్రిమినాశకమందులతో శుభ్రపరచాలి.

ఈడుపు వాయువు లేక ధనుర్వాయువు (టెటేనస్), ఈ వ్యాధి వస్తే శరీరంలో అక్కడక్కడ చెమట పడుతుంది. మలబద్ధం ఏర్పడుతుంది. జంతువు ఆహారం నమలడం మానివేస్తుంది. గుటక వెయ్యడం కష్టమయిపోతుంది. ముక్కు ముందుకి పొడుచుకు వచ్చినట్టు ఉంటుంది. ముక్కుపుటాలు విరివి అయి ఉంటాయి. జంతువుపళ్లు పైకి కనపడేటట్టు పెదిమలు లాగి ఉంచుతుంది. శరీరంలో భాగాలు కొయ్యబారిపోతాయి. జంతువు తోక ఎత్తిపెట్టి, వణుకుతూ ఉంటుంది. కాళ్లతో గడ్డి యీడ్చుకుంటూ అది యీడిగిలబడుతూ నడుస్తుంది.

వ్యాధి సోకిన జంతువుని ప్రశాంతంగా ఉన్న చీకటి స్థలంలో ఉంచాలి. ఉద్రేకంగా ఉన్నప్పుడు దానిని కడగకూడదు. కురుపులన్నింటినీ క్రిమినిరోధక మందులతో శుభ్రంగా కడగాలి.

శూలనొప్పి (కోలిక్) అన్నది గుర్రపుజాతి జంతువులకి సామాన్యంగా వచ్చే జబ్బు. ఇది వస్తే జంతువు విశ్రాంతి లేకుండా ఉంటుంది; బెంగగా ఉన్నట్టు కనిపిస్తుంది. శరీరం అంతటా దద్దుర్లు లేస్తాయి. జంతువు క్రిందపడి దొర్లుతుంది. లేస్తుంది; తరచుగా వెనుకతట్టు చూచుకుంటుంది; ముందుకి పొట్టపై తన్నుకుంటుంది. దాని శ్వాస తొందరగా గొట్టంలోంచి ఊదినట్టు వస్తుంది. లద్దెలు తక్కువ పరిమాణంలో వేస్తుంది.

నిరోధకమార్గాలు : తక్కువ పరిమాణంలో ఎక్కువసార్లు మేతపెట్టడం, మేత క్రమబద్ధంగా సకాలంలో పెట్టడం, నాసిరకపు మేతలూ, పాచిపోయిన మేతలూ పెట్టకుండా ఉండడం; మేతలో అకస్మాత్తుగా మార్పులు చెయ్యకుండా ఉండడంన్నూ, త్వరితంగా కావలసిన పనికి గుర్రాన్ని ఉపయోగించే ముందు, కడుపు నిండుగా మేత పెట్టగూడదు; శ్రమించి పనిచేసి వచ్చినవెంటనే దానికి చల్లటినీరు పెట్టకూడదు.

సౌత్ఆఫ్రికన్ గుర్రపు జబ్బు చాలా తీవ్రమయినటువంటిదీ, ఎక్కువ ప్రాణహానికరం అయినదిన్నీ. ఈ జబ్బు కంచరగాడిదలు, గాడిదలకన్న గుర్రాలకి ఎక్కువగా వస్తుంది. ఉక్కపెట్టి వానలు పడేకాలంలో యీ జబ్బు ఎక్కువగా వస్తుంది. శీతాకాలంలో సామాన్యంగా ఇది బొత్తిగా కనిపించకుండా

పోతుంది. ఈ జబ్బు శ్వాసనాళానికిగాని, గుండెకిగాని లేదా యీ రెండింటికీ గాని రావచ్చును. జబ్బు తీవ్రతని బట్టీ, ఏ అంగానికి సంబంధించి వచ్చిందో దాన్నిబట్టీ జబ్బు లక్షణాలు ఉంటాయి.

శ్వాసకోశానికి సంబంధించినదైతే, ఆ భాగం అంతా పీడింపబడుతుంది. జ్వరం వస్తుంది; ఊపిరి తీసుకోవడం కష్టం అవుతుంది; ముక్కుపుటాల నుంచి నురగలాంటిది వస్తుంది. 36 గంటలలోగా జంతువు చచ్చిపోతుంది. ఈ జబ్బు రకాలన్నిటిలోకీ యిది తీవ్రమయినది. ఈ వ్యాధి వచ్చిన జంతువులలో ప్రాణనష్టం నూటికి నూరుపాళ్లూ ఉండవచ్చును.

ఈ జబ్బు హృదయానికి సంబంధించినదైతే, గుండె పీడింపబడుతుంది; కొద్దిగా జ్వరం వస్తుంది. గుండె నీరసించిపోతుంది; నుదుటిమీద పొంగులు కనిపిస్తాయి; అవి రొమ్ము, ముంగాళ్లవరకూ కూడా వ్యాపించవచ్చును. ఒక్కొక్కప్పుడు యీ వాపులు, కంటిగుడ్డుని ముందుకి త్రోసివేసేటంత పెద్దవిగా ఉంటాయి. చనిపోయేవరకూ జంతువు మునిపళ్ళతో గ్రాసం కొరుకుతూనే ఉంటుంది. చావుకి ముందు శరీరపు ఉష్ణత మామూలు కన్నా తక్కువకి పడిపోతుంది. మరి మూడు నాలుగు రోజులకి జంతువు చచ్చిపోతుంది. ఈ రూపంలో వచ్చిన వ్యాధివల్ల కలిగే జంతునష్టం నూటికి 95 పాళ్లు ఉంటుంది. చచ్చిపోయిన తరవాత శవపరీక్ష చెయ్యగా తేలింది ఏమిటి అంటే హృత్కోశం బాగా ఉబ్బి ఉండడమూ, అందులో లేత పసుపురంగులో ద్రవం అమితంగా చేరిపోవడం దీనికి కారణం అని.

ఒక్కొక్కప్పుడు యీ వ్యాధి గుండెకీ ఊపిరితిత్తులకీ కూడా వస్తుంది. భారతదేశంలో ఇది చాలా తరచుగా సంభవిస్తుంది.

నిరోధక మార్గాలు : ఈ వ్యాధిని సంక్రమింపజేసే "క్యులికోయిడ్స్" అనబడే ఒక రకపు కందిరీగలు కుట్టకుండా తగిన రక్షణ యివ్వాలి. ముందు జాగ్రత్త కోసం ఇంజక్షన్లు యిప్పించాలి. జంతువులని ఉంచే లాయములు, పరిసరాలూ చాలా పరిశుభ్రంగా ఉంచాలి. జంతువుని క్రమం తప్పకుండా మాలీసుచేస్తూ ఉండాలి. వర్షాకాలంలో, గుంటలు, చెరువులు గల పల్లపు ప్రదేశాల నుంచి జంతువులని ఎత్తైన ప్రదేశాలకి తీసుకుపోవాలి. సాయంకాలం జంతువులని పచ్చికబీళ్లమీదనే విడిచి పెట్టకుండా, లాయములలోకి తీసుకు పోవాలి. వాటిశక్తి తగ్గిపోకుండా ఉండడానికి జంతువులకి సుపోషకమైన మేత పెట్టాలి.

# VI. ఒంటెలు

## ఉపోద్ఘాతం

ఒంటెని ఎడారి ఓడ అంటారు. బాగా వేడిగా ఉండి, నీరవ్వది లేక, ఇసుకమయంగా ఉన్న ప్రాంతాలలో బరువులు మొయ్యడానికి, రవాణా పనులకి నిజంగా యిది పన్నెకెక్కింది. ఆకలిదప్పులకి తట్టుకునే శక్తి అమితంగా దీనికి కలదు ; అంచేత ఇది ఒక అద్భుత జంతువు అనిపించుకుంది. ఎడారిలో అక్కడక్కడ దొరికే ముళ్ల తుప్పలనే ఆహారంగాగొని ఇది గడుపుకోగలదు. ఈ ఆహారమే మిగతా శాఖాహారి జంతువులకు పెడితే అవి ఆకలితో చచ్చిపోతాయి. ఆవులూ మొదలైన పశువులూ, మేకలూ, గొర్రెలూ లాగే ఒంటె కూడా నెమరువేసే జంతువు.

ఎడారి జీవనానికి అనుగుణంగా ఉండేలాగ, ప్రకృతి సిద్ధంగానే ఒంటెకు కొన్ని ప్రత్యేక లక్షణాలు ఏర్పడ్డాయి. దాని మూపురం క్రొవ్వు పదార్థంతో నిండి ఉంటుంది. నీరులేని పరిస్థితులలో మేతకూడా ఎక్కువ అక్కర లేకుండానే బతకగలిగేటందుకు యీ క్రొవ్వు పదార్థం ఆహారపు కోశములాగ ఉపయోగపడుతుంది. చర్మం మిక్కిలి దళసరిగా ఉండటం మూలాన్ని, దేహంలోని నీరు చెమట ద్వారా యిగుర్చుకుపోయే అవకాశం చాలా తక్కువ. దీనివల్లా, యింకా తదితరమైన అనేక కారణాలవల్లా, ఇది మిగతా పాలిచ్చే జంతువులకన్నా చాలాకాలం నీరులేకుండా గడుపుకోగలదు. వాతావరణంలో గల తీవ్రమైన ఎండ వేడిమినుంచి దీని వొంటిమీద నున్న సన్నని రోమరాజి కాపాడుతుంది. ఒంటె పెదవులు చాలా దళమైన చర్మంతో కప్పబడి ఉండడంవల్ల, అది ముళ్లతోనున్న గట్టి చెట్లకొమ్మలని కూడా మెయ్యగలదు. పొడుగాటి మెడ ఉండడంవలన, ఎత్తుగా ఉన్న చెట్ల కొమ్మలని సులువుగా అందుకోగలదు. దాని పాదాలకు మెత్తలలాంటిది (దిండ్లు) ఉండడం వలన అది ఎక్కువ ప్రయాస పడకుండా, వేడి యిసుక మీద నడచిపోగలదు.

కనిరెప్పల మీద ఉండే పొడవైన వెంట్రుకలు, చెవుల మీది వెంట్రుకలు, ఎడారిలో వీచే యిసుక దుమారపు బారినుంచి దాన్ని కాపాడుతాయి. ఇసుక దుమారం రేగినప్పుడు ఒంటె ముక్కుపుటాలు మూసివేసి ఉంచుకోగలదు.

ఎంత నిర్దయగాను, ఉపేక్షతోను దానిని చూసినా, ఒంటెకు అమితమైన ఓర్పు ఉంటుంది. కాని ఒక్కొక్కప్పుడు, పరిస్థితులు మరీ దుర్భరం అయిపోతే అది మొండికేసి పగపట్టవచ్చును.

భారతదేశంలో ఒంటెని సవారీకి, బరువులు మొయ్యడానికీ, పొలం దున్నడానికీ, ధాన్యాదులు నూర్చడానికీ, పెర్షియనువ్హీల్ (ఇది నూతిలోంచి నీళ్లతోడే యంత్రం) తిప్పడానికీ, చెరకు, నూనెవిత్తులు గానుగ ఆడడానికీ, యీ విధంగా అనేకరకములైన పనులకి ఉపయోగిస్తున్నారు. సాధారణంగా ఒక్క ఒంటెనే పనికివాడతారు ; క్వాచిత్కంగా జత ఒంటెలని కూడా వాడడం కలదు. ఒంటెని ఎద్దుతోగాని, పోతుతోగాని, ఇంకా ఒక్కొక్కప్పుడు గాడిదతోగాని కాడికికట్టి పనిచేయించడం అసాధారణం కాదు. బెలూచీ స్థానంలో ఒక్కొక్కప్పుడు, ఆడమనిషి ఒంటె కలిసి నాగలి లాగడం కూడా కానవస్తుంది. మిలిటరీ రవాణా పనులకి ఒంటె ప్రత్యేకించి పేరుపడింది. వంట ఒక్కటి తప్ప, తన యజమానికి కావలసిన పనులన్నీ ఒంటె చేస్తుంది అంటారు.

రగ్గులకీ, తదితరమైన వేడిని కలిగించే దుస్తులకీ, ఒంటె రోమం చాలా శ్రేష్ఠం. నిడుపుగా తోకవద్ద ఉండే రోమాలతో తాళ్లు, మోకులు నేస్తారు ; ఇవి గట్టితనానికీ, మన్నికకీ పేరు పొందాయి. జీనులు వగైరా సరకులు ఒంటె తోలుతో చేస్తారు. చాలా దేశాల్లో ఒంటె మాంసం తింటారు. ఒంటె పాలు చాలా పుష్టికరమైనవి ; ఇవి మనుష్యుల ఉపయోగానికి కూడా వాడతారు.

1982 సెన్సెసు ప్రకారం మనదేశంలో 1.07 మిలియన్ ఒంటెలున్నాయి. 1977 సం॥లోని ఒంటెల కంటే ఇవి 0.94 శాతం అధికంగా ఉన్నాయి. రాష్ట్రవారీగా రాజస్థానులో 0.756 మిలియను, హర్యానాలో 0.121 మిలియను, గుజరాతులో 0.75 మిలియను, మధ్యప్రదేశ్‌లో 0.016 మిలియను, పంజాబులో 0.064 మిలియను మరియు ఉత్తరప్రదేశ్‌లో 0.04 మిలియన్ ఒంటెలున్నాయి.

## ఒంటెలలో రకాలు

ఒంటెలలో రెండు రకాలున్నాయి. బాక్ట్రియను ఒంటె మధ్య ఆసియా నుంచి వచ్చింది. దీనికి రెండు మూపురాలుంటాయి. రెండవది అరేబియన్

లేక డ్రోమిడరీ అనే ఒంటె. దీనికి ఒక్కటే మూపురం ఉంటుంది. భారతదేశంలో ఒక్క మూపురంతో ఉన్న ఒంటెలే కానవస్తాయి. బాక్ట్రియను ఒంటె కంటె అరేబియను ఒంటె సాధారణంగా తక్కువ స్థూలంగా ఉంటుంది. దీని వెనుక భాగం పొడవుగా ఉంటుంది. దీని శరీరం మీద రోమాలు మృదువుగా, కాస్త పల్చగా ఉంటాయి.

## దేశవాళీ ఒంటెల జాతులు

ఇవి, సమతల ప్రదేశాలలో ఉండే ఒంటెలూ, కొండ ప్రదేశాలలో ఉండే ఒంటెలూ అని వాటిని పెంచే ప్రాంతాలనిబట్టి రెండు తెగలుగా ఉన్నాయి. నదీ ప్రాంతాల ఒంటెలూ, ఎడారి ప్రాంతాలలోవీ కూడా సమతల ప్రదేశాల ఒంటెలలోనే చేరతాయి. సమతల ప్రదేశాల ఒంటెతో పోల్చిసూస్తే, కొండ ప్రదేశాల ఒంటె చాలా గౌణంగా ఉంటుంది ; దాని కాళ్లు కురుచ ; పాదాలు ఎక్కువ గుండ్రంగా ఉంటాయి. కండ పుష్టి బాగుంటుంది.

కొండ ఒంటె, నదీప్రాంతపు ఒంటె కూడా సరుకులు మోసే రకం ; ఎడారి ఒంటె సవారీకి ఉపయోగిస్తుంది.

సరుకులు మోసే ఒంటెకి చక్కగా ఎదిగిన మూపురం, దళసరి అయిన మెడ, పెద్ద తల, విశాలమైన ఉరస్సు, బలిష్ఠమైన కాళ్లు, పాదాలకి గట్టి దిండ్లు ఉంటాయి. మంచి సవారీ ఒంటె కాస్త తేలికయిన జంతువు ; ఎక్కువ చురుకుగా ఉంటుంది. దీని కాళ్లు ఎత్తుగాను, అవయవాలు సన్నగానూ ఉంటాయి. దీని తల చిన్నది. మెడ సన్నగా ఉంటుంది. కళ్లు చిన్నవి. చెవులు పొట్టిగా ఉంటాయి. దీని చర్మం పల్చన. పాదాలు చిన్నవి. ఎడారి ఒంటె రాజస్థాన్‌లో గల బికనీరు, జైసల్మీరు ; యిసుక ప్రాంతాలలో కానవస్తుంది.

గుర్రాలలో "థరోబ్రెడ్" జాతిలాగే, ఒంటెలలో ఎడారి ఒంటె చాలా ముఖ్యమైనది. ఎక్కువ సంతతికీ, మిక్కిలి సహనశక్తికీ ఇది పేరు పడింది. మేలురకపు ఎడారి ఒంటె చాలా ఎక్కువ దూరం, అనగా రోజుకి 48 కిలోమీటర్ల చొప్పున అలాగ కొన్ని రోజుల వరకూ పోగలదు. సగటున యిది గంటకి 9, 10 కిలోమీటర్లు వెళుతుంది.

ఎడారి ఒంటె ఎక్కువ భారీ అయిన జంతువు కాదు. దీని ముట్టె సాగసుగా ఉంటుంది. మెడ సన్నగా ఉంటుంది. చెవులు పొట్టిగానూ

ఒకదానికొకటి దగ్గరగానూ ఉంటాయిముక్కుకొనకొంచెం పైకి లేచి ఉంటుంది. కళ్లకి పైగా నుదుటి భాగం లోతుగా (పల్లంగా) పళ్లెంలాగ ఉంటుంది. దీని ఉరస్సు విశాలమైనది. దీని కండరాలు బాగా పెరిగి ఉంటాయి. దీని కాళ్లు కాస్త పొట్టి. తోక పొడవుగా అందంగా ఉంటుంది. ఈ జంతువు చలనం చురుకుగానూ, దర్జాగానూ ఉంటుంది.

నదీప్రాంతపు ఒంటె ఉత్తరప్రదేశ్ యొక్క పశ్చిమభాగాలలోను, పంజాబులోనూ కానవస్తుంది.

ఈ జాతి ఒంటెలు ఎక్కువ బరువులు మొయ్యగలవు. ఇవి ఆకృతిలో పెద్దవి. కాని వీటి చలనం మందంగా ఉంటుంది. ఇది 3.4 క్వింటాల్స్ బరువు సులువుగా మొయ్యగలదు. సగటున గంటకి 4 కిలోమీటర్లు వెళ్లగలవు. ఒకేసారి 19 మొదలు 22 కిలోమీటర్ల వరకు ఆగకుండా వెళ్లగలవు.

నదీప్రాంతపు ఒంటె తల మోటుగా ఉంటుంది. ముక్కు శిల్పి చెక్కినట్టుగా ఉంటుంది. దీని మెడ, కాళ్లు పొడవుగానూ, పాదాలు కోలగా మెత్తగానూ ఉంటాయి. దీని పృష్ఠభాగం అంతగా బలిసి ఉండదు.

కొండ ఒంటె, రాతిమయమైన ఉత్తరపంజాబు కొండప్రాంతాలలో కానవస్తుంది. బరువులు మొయ్యడానికి ఇది బహుయోగ్యమైనది. ఆకృతిలో యిది చిన్నదిగా ఉంటుంది. దీని పాదాలు దృఢంగా ఉంటాయి. కొండ ప్రాంతాలకి ఇది మిక్కిలి అనుగుణమైన జంతువు.

కొండ ఒంటె కండరపుష్టి గలిగి, గౌణంగా ఉంటుంది. దీని మెడ కురుచ, ఉరస్సు విశాలం ; పృష్ఠభాగం బాగా బలిసి ఉంటుంది. దీని కాళ్లు కురుచగానూ, పాదాలు గుండ్రంగా గట్టిగానూ ఉంటాయి.

పంజాబులోను, ఉత్తరప్రదేశ్‌లోను, ఆ పరిసరాలలోనూ కానవచ్చే ఒంటెలలో చాలాభాగం, రాజస్థానులో ఉన్న బికనీరు, జైసల్మీరు జిల్లాలనుంచి, గుజరాతులో ఉన్న కథియవార్, అహమ్మదాబాద్ జిల్లాలనుంచి వచ్చినవి. ఒంటెలని పెంచే ప్రతీ ప్రాంతంలోనూ, ఆయా ఒంటెలకు ఆయా ప్రాంతాల జాతులని పేర్లు ఉన్నాయి. ఉదా : బాగ్రి, ఆళ్వారు, కచ్ఛీ, జైసల్మీరు, బికనేరీ ఇత్యాదులు.

## ఒంటెల పెంపకం

ఒంటెకి జతకట్టే కాలం ప్రత్యేకించి విస్పష్టంగా ఉంది. మగ ఒంటెకి ఏడాదిలో చాలా భాగం కామోద్రేకం అణిగి ఉంటుంది. ఒక్క శీతాకాలంలో, అనగా నవంబరు మొదలు ఫిబ్రవరి-మార్చి వరకు దానికి మదం పుడుతుంది ; ఈ మదం జంతువు యొక్క ఆరోగ్యపరిస్థితినిబట్టి ఉంటుంది.

మగ ఒంటెలను ఒకచోట ఉంచినప్పుడు, వాటిలో బలంగా ఉన్న ఒకటో రెండో ఒంటెలకి 'మదం పుడుతుంది. వీటి భయం మూలాన్ని మిగతా ఒంటెలు తమ కామవాంఛ లక్షణాలు బయటికి కనబడనివ్వవు. కాని, ఒక్కొక్కప్పుడు, మందలో ఏదైనా ఒంటె తన మదాన్ని అణుచుకోలేని పరిస్థితులలో, ధానికీ, మందలో ప్రాముఖ్యమైన ఒంటెకీ పోట్లాట జరుగుతుంది. ఈ పోట్లాటలో ఓడిపోయిన జంతువు తన మదం అణిచివేసుకుంటుంది.

ఒంటె మదంలో ఉన్నప్పుడు తరుచుగా పళ్లు కొరుకుతుంది ; నోటి వెంట నురగలు వస్తాయి ; అది గాలి మింగి తేనుస్తూ ఉంటుంది ; తిరిగీ గాలి మింగినప్పుడు అంగుడికి అంటిఉన్న మ్యూకసుపొర నోటికి ఒక ప్రక్కగా, రబ్బరు బుంగలాగ పొంగి వచ్చి, మరికొద్ది క్షణాలకి ముడుచుకుపోతుంది. తలవద్దనున్న మాంసగ్రంథులలో నుంచి, బాగా ఎర్రరంగులో, దుర్గంధ భూయిష్ఠమైన ద్రవం, మెడమీద నుంచి కారుతుంది. ఒంటె, వెనుక కాళ్లు ఎడంగా ఉంచి నుంచుంటుంది ; తోక పైకీ క్రిందికీ కొట్టుకుంటుంది. వీర్యస్థలనం కావచ్చుకూడాను.

జతకట్టేకాలం సమీపిస్తున్నకొద్దీ, మందలోఉన్న ఒంటెకి దేహస్థితి క్షీణిస్తుంది ; దీనికి కారణం ఆకలి మందగించడంవల్లనూ, గాలి మింగి తేనుస్తూ ఉండడంవల్లనున్నూ, గాలిమింగి తేన్చడంవల్ల ఒంటెకి కొద్దిగా విశ్రాంతి కలుగుతుంది. పరిస్థితులు మరీ విషమంగా ఉన్నప్పుడు, ఎక్కువ బరువులు వేసి, శ్రమతో కూడుకున్న పనులు చేయించీ, ఒంటెకి ఉపశమనం కలిగించవచ్చును. మదంలో ఉన్న ఒంటెలని లొంగదియ్యడం చాలా కష్టం. అంచేత వాటిపట్ల అతిజాగర్తతో వ్యవహరించాలి. పొర్లే కాలంలో మగ ఒంటెలనీ ఆడ ఒంటెలనీ వేరుగా ఉంచాలి.

సామాన్యంగా రెండేళ్ల ప్రాయం వచ్చేసరికి మగ ఒంటె కామవాంఛా లక్షణాలు కనపరుస్తుంది ; కాని ఆరేళ్లు వచ్చేవరకూ దానిచేత జతకట్టించ కూడదు. ఎనిమిదేళ్ల ప్రాయంలో మగ ఒంటె మంచి ప్రౌఢిమలో ఉండి, లైంగిక పరిపూర్ణత పొందుతుంది.

పొర్లే కాలంలో మగ ఒంటెచేత 30 మొదలు 50 ఆడ ఒంటెల వరకూ జతకట్టించ వచ్చును. సరిఅయిన మేత, సంరక్షణ ఉండేటట్టయితే 70 ఒంటెల వరకూ కూడా జత కట్టించవచ్చును.

ఆడ ఒంటె నాలుగేళ్ల ప్రాయానికి, జతకట్టడానికి యుక్తవయస్సులో ఉంటుంది. 20 ఏళ్ల వరకూ అది యీనుతుంది. ఒంటె రెండేళ్లకి ఒకసారి ఈనుతుంది. విషమమైన ఎడారి పరిస్థితులలో తట్టుకోడానికి దీనివల్ల ఒంటెకి కావలసిన విశ్రాంతి లభిస్తుంది.

మిగతా నెమరువేసే పెంపుడు జంతువులకంటె, ఒంటెకి చూలుతో ఉండే కాలం ఎక్కువ ; 375 మొదలు 392 రోజుల వరకూ చూలుతో ఉంటుంది ; సగటున 389 రోజులు. ఒక్కొక్కసారి ఒంటె ఒకే పిల్లను పెడుతుంది.

ఒంటె ఎదకివచ్చిన కాలంలో విశ్రాంతి లేకుండా ఉంటుంది. మగ ఒంటె కోసం వెతుకుతుంటుంది. తరుచుగా అరుస్తుంది. ఈ కాలంలో దీని భగరంధ్రం ఉబ్బి ద్రవిస్తుంది. ఎదకాలం 3, 4 రోజులదాకా ఉంటుంది.

మిగతా నెమరువేసే పశువులలాగ, ఒంటెలు నిలబడి జతకట్టవు. ఆడ ఒంటె కాళ్లు ముడుచుకుని ఒంగిఉంటుంది. దానివెనుక, మగ ఒంటె, కుక్కలాగ వెనుక కాళ్లు మణిచి కూర్చొని, ముందరి కాళ్లు రెండూ ఆడ ఒంటెపైన ఇరుప్రక్కలా వేసి పట్టుకుని, మైథునక్రియ చేస్తుంది. రెండు ఒంటెల ముఖాలు ఒకవేపుకే ఉంటాయి. మైథునక్రియ సుమారు 15 నిమిషాలు జరుగుతుంది. ఈ సమయంలో మగ ఒంటె నోటితో గురగుర శబ్దం చేస్తుంది. నోటిలోంచి నురగవస్తుంది. మందలోని మిగతా ఒంటెలు, జతకడుతూన్న ఒంటెలు ఎవరికీ కనిపించకుండా ఉండేటట్టు చుట్టూ నిలుచుంటాయి.

ఒంటె, చూలుతో ఉందని తెలిపే ప్రకృతిసిద్ధం అయిన లక్షణం ఏమిటీ అంటే మగ ఒంటె దగ్గిరకి వచ్చినపుడు కాని, లేదా, మనిషి దాని వద్దకు వెళ్లినప్పుడుగాని, అది తోక పైకిఎత్తి పెడుతుంది. జతకట్టిన 15 రోజులకి

యీ చిన్నె అగుపడితే; అది తప్పకుండా చూలు అయింది అన్నమాట చూలు ఉన్న ఆరునెలలకి ఒంటె కడుపు పెరగడం ఆరంభిస్తుంది.

ఈనే కాలం సమీపిస్తోందనగా, పొదుగు పెద్దది అవుతుంది ; భగరంధ్రం ఉబ్బి ఉంటుంది ; పొత్తికడుపు చుట్టూ ఉండే అస్థిపంజరం తాలూకు నరాలు కృంగి ఉంటాయి. తోక మొదటికొన వద్ద యిరుప్రక్కలా గాడీలు పడతాయి

ఈనినప్పుడు ఒంటె సామాన్యంగా కూచుంటుంది. ఈనే సమయంలో దానిని విచ్చలవిడిగా వదలివెయ్యకూడదు. అలాగ వదలివేస్తే, అది బెదిరిపోయి అటూ యిటూ పరిగెత్తడం వల్ల పిల్లకి ప్రాణహాని కలగవచ్చును.

పిల్ల పుట్టేటప్పుడు, తలను ముందరికాళ్లు రెండింటి మధ్యా పెట్టుకుని పుడుతుంది. ఒంటె యీనేటప్పుడు, సాధ్యమైనంతవరకు,అనవసరంగా కలగజేసు కోకుండా, సహజంగా ప్రసవం కావడానికి వదలెయ్యాలి. మావి పిండంతోగాని, లేదా పిండం బయటపడిన అరగంటసేపటికిగాని బయట పుడుతుంది.

పిల్ల పుట్టిన తరువాత, దాన్ని శుభ్రంగా తుడిచి తల్లి పొదుగువద్దకు తీసుకు వెళ్లాలి. మిగతా పశువులలాగ, ఒంటె కొత్తగా పుట్టిన పిల్లని నాకదు ; కాని అది పిల్లని గురించి మంచి శ్రద్ధ తీసుకుని కాపాడుతుంది.

కొత్తగా పుట్టిన పిల్లకి మొదటి మూడువారాలు చాలా గడ్డుదినాలు. ఈ కాలంలో పిల్ల అమితంగా పాలు తాగకుండా చాలా శ్రద్ధ తీసుకోవాలి. జీవితపు ప్రారంభదశలోనే, అనగా, 4, 6 వారాలనాటికి పిల్ల మేత ఆరంభిస్తుంది. దానికి 15 నెలల ప్రాయం వచ్చేసరికి స్తన్యం మానిపిస్తారు.

ఒంటె రోజుకి రెండుసార్లు పాలిస్తుంది. సాధారణంగా 10 మొదలు 18 నెలల దాకా అది పాలు యిస్తూనే ఉంటుంది. సగటున 15 నెలల వరకూ పాలిస్తుంది. పిల్లకి కావలసిన పాలుకాక, రోజుకి సుమారు 9 లీటర్ల వరకూ పాలివ్వగలదు. పాలు యిచ్చే కాలం మొత్తం మీద చూస్తే 2,750 లీటర్లకి పైగా యిస్తుంది. దాన్ని సరిగా పోషించి, సంరక్షణ చేసినట్టయితే, ఎడారి ప్రదేశాలలో ఒంటె పాలకి చక్కటి మూలం అవుతుంది.

ఒంటె పాలు చాలా రుచిగా ఉంటాయి. వీటిలో చక్కెరపాలు కాస్త ఎక్కువ అన్నమాట తప్ప, మిగతా పదార్థాలన్నీ ఆవుపాలల్లో ఉన్నట్టే ఉంటాయి. చాలా ప్రయాసమీదగాని, ఒంటె పాలలోంచి వెన్న పడదు. ఒంటె పాలు సుపోషకం అవడం చేత, తరుచుగా పిల్లలకి వాడతారు. సగటున

ఒంటె పాలల్లో 86.57 శాతం నీరు, 4.0 శాతం ప్రొటీన్లు 3.07 శాతం కొవ్వుపదార్థం, 5.59 శాతం చక్కెర, 0.77 శాతం ఖనిజాలూ ఉంటాయి.

## ఒంటెలకి మేత

ఒంటె శాకాహారి. అది చెట్లు, పొదలు వీటి తాలూకు ఆకులని మేసి బతుకుతుంది. లేతగా ఉండి పొడవుగా ఎదిగిన రసభరితం అయిన గడ్డి మెయ్యడం దీనికి ప్రీతి.

ఒంటె బతకడానికి చెట్ల ఆకులు, గడ్డిమేత చాలును. కాని దాని శరీరపు పరిమాణం పెద్దది అవడంవల్ల, రోజుకి కనీసం 6 మొదలు 8 గంటలయినా దాన్ని మెయ్యనివ్వాలి. ఒంటె మూపురం పెద్దదిగా ఉంది అంటే దానికి మేత సరిగా ఉందన్నమాట. చాలినంత మేత మెయ్యడంతోనే మూపురపు పరిమాణం ఎక్కువ అవుతుంది.

చాలినంత మేత బయటదొరకనప్పుడు, దానికి సాలలో అదనంగా మేత పెట్టాలి. పచ్చిగడ్డిగాని, ఎండుగడ్డిగాని ఈ అదనపు మేతకి ఉపయోగించవచ్చును.

అవిరామంగా ఒంటెకి ఎండుగడ్డి మొదలైన మేతలు పెట్టడం వల్ల మలబద్ధం, చర్మరోగాలు రావచ్చును. అంచేత యీ ఎండుగడ్డి మొదలైన మేతలు సామాన్యంగా చెట్ల ఆకులు అలమలు చాలినంతగా లభించనప్పుడు పెట్టాలిగాని, వాటికి బదులుగా పూర్తిగా యీ ఎండుగ్రాసమే వాడకూడదు. ఒంటెకి పెట్టే పచ్చిమేత రసపుష్టిగాను, పొట్టిగను ఉండాలి ; లేని పక్షంలో ఆ మేతను దగ్గరగా కోసి పెట్టాలి. ఇలాగ చెయ్యడం వల్ల మేత దుబారాపోదు. ఎండుగ్రాసం నుంచి పచ్చి మేతలకు మార్చినప్పుడు ఒంటె అమితంగా మెయ్యకుండా చూసుకోవాలి ; లేకపోతే వాయుసంబంధమైన శూలనొప్పి వచ్చి ప్రాణహాని కూడా సంభవించవచ్చును. మేతలో మార్పులు క్రమంగా తీసుకురావాలి. హఠాత్తు మార్పులు చెయ్యడంవల్ల ఒంటెల ఆరోగ్యం దెబ్బతింటుంది. ఏదైనా కొత్త రకపు మేత పెట్టేముందు, ఆ మేతను కొద్దికొద్దిగా, అంతకుముందు అలవాటుపడిన మేతతో కలిపి పెడుతూ క్రమంగా ఆ కొత్త రకపు మేత ఎక్కువ చెయ్యాలి. ఒంటె నెమరు వెయ్యడానికి చాలినంత వ్యవధి యివ్వాలి.

సామాన్యంగా ఒంటెకు పచ్చిమేతలు, పచ్చి బఠాణీలు, పెసరమొక్కలు, చిక్కుడు మొక్కలు, ఆవ, మోత్, గ్వారా, షఫ్తల్, సెంజి, తరోమిరా,[1] దీనికిపెట్టే ముఖ్యమైన ఎండుగడ్డి మొదలైన గ్రాసం ఏది అంటే గోధుమపొట్టు, బార్లీగడ్డి, మోత్, చిక్కుళ్లు, పెసరమొక్కలువంటి కాయధాన్యపు గ్రాసం, జొన్న చొప్ప, ఒంటె ప్రీతిగా తినే ఎడారి మొక్కలు, తుమ్మ, పీటా ఫర్వాన్, కపాల్ (ఎడారిలో ఉండు ఆకులులేని ఒక పొద), ఝండ్ మొక్కలు, మారేడు, సంద్ర, వేప, మర్రి, రావి, మామిడి, ఫుల్లాహ్, ఖయీర్ షాతూత్ చెట్ల ఆకులూ, చిగుళ్లూ అంటే ఒంటెకి ఎంతో ప్రీతి.

ఒంటెచేత బరువైన పని చేయించి, బయట వెయ్యడానికి చాలినంత ఆహారం దొరకనప్పుడు, దానికి గింజలు మేతపెట్టాలి. ఉలవలు, బార్లి, ఓట్సు, చిక్కుడు, మొక్కజొన్న, ప్రత్తిగింజలు, తవుడు సామాన్యంగా ఒంటెలకు పెడతారు. ఉలవలు అత్యుత్తమైన ఆహారం. గింజలు దంచి పెట్టడం శ్రేష్ఠం. అది వీలుకానప్పుడు, మేతకి పెట్టేముందుగా వాటిని నీటిలో నానబెట్టి మరీ పెట్టాలి. మితంగా పనిచేసే ఒంటెకు ఇంట్లో మేత పెట్టినప్పుడు, ఒక కిలోగ్రాము దంచిన ఎలవలు, ఒక కిలోగ్రాము దంచిన బార్లీ, 9-18 కిలోగ్రాముల పచ్చిమేతలు, 7 కిలోగ్రాముల చిట్టు (తవుడు) 28-56 గ్రాముల ఉప్పు కలిపిన రేషను రోజూ పెడితే చాలును.

ఒంటెలు ఒకదానినొకటి కరుస్తాయి. అంచేత ఒక తొట్టెలో ఒక ఒంటెకే మేత పెట్టాలి. ఇలా చెయ్యడంవల్ల మేత దుబారా కాదు కూడాను. లేకపోతే అర్భకంగా ఉన్న ఒంటెకి తగినంత మేత దొరకదు ; తొందర తొందరగా తినడం వల్ల దానికి అజీర్ణపు వ్యాధులు కూడా పట్టుకుంటాయి.

గింజల మేత సాయంకాలపు వేళ పెట్టడం మంచిది. పరగడుపు మీదగాని, చాలాసేపు దప్పిగొని ఉండి దాహం తీర్చుకున్న వెంటనేకాని యీ మేత పెట్టకూడదు.

ఒంటె ఆరోగ్యంగా ఉండడానికి ఉప్పు ముఖ్యం. రోజూ పెట్టే కాయధాన్యపు రేషనుతో కలిపిగాని, ఊరికేగాని ఉప్పు ఒంటెకి పెట్టాలి.

---

1 మోత్, గ్వారా, షఫ్తల్, సెంజి, తరోమిరా మొదలైనవి ఉత్తరాది (హిందూస్థానీ) మాటలు. వీటికి సరి అయిన తెలుగుపదాలు దొరకనందున ఆ పదాలే వాడడం అయింది.

దేనితోనూ కలపకుండా ఉప్పు పెట్టే మాటయితే ఉదయాన్నే ఏ మేత పెట్టకముందు, ఉప్పు పెట్టాలి. కాయధాన్యాలతో కలిపి పెట్టినప్పుడు సాయంకాలం పెట్టడం మంచిది.

అప్పటప్పట ఎక్కువ శ్రమతో కూడిన పనిచేసిన తరువాత, ముఖ్యంగా శీతాకాలంలో, ప్రత్యేకమైన మసాలాలు ఒంటెకి పెడతారు. మూడుపాళ్లు వాము, రెండు పాళ్లు నల్లజీలకర్ర, రెండుపాళ్లు నల్ల ఉప్పు, ఒకపాలు మెంతులు, ఒక పాలు కర్రూ[1] కలిపిన 250 గ్రాముల మసాల పొడి నెలకి రెండుసార్లు పెడతారు. ఒక్కొక్కప్పుడు 32-50 గ్రాముల వరకు పటిక, 600-700 గ్రాముల బెల్లంతో కలిపి ఉండలుగా చేసి పెడతారు.

## నీరు

అమితమైన ఎడారి ఎండకు గురిఅయి, తన శరీరపు తూకంలో 30 శాతం నీరు ఇగుర్చుకుపోయినాకూడా ఒంటె ఓర్చుకోగలదు. తదితరమైన పాలిచ్చే జంతువులు అటువంటి పరిస్థితులలో తమ శరీరపు తూకంలో 12 శాతం నీరుపోయినప్పటికీ రక్తస్రావం సరిగా ఉండక చచ్చిపోతాయి. మరి చాలాకాలం నీరులేకుండా ఓర్చుకుని ఉండగలిగే శక్తి ఒంటె రక్తంలో ద్రవపదార్థం ఎక్కువగా ఉండడం వల్ల కలుగుతోంది. నెమరువేసే మిగతా జంతువుల కన్నా ఒంటె నెత్తురులో ద్రవపదార్థం ఎక్కువ ఉంటుంది. మలమూత్రాల ద్వారా పోయే నీరు కూడా, ఒంటెలలో చాలా తక్కువ.

ఈ కారణాలన్నిటివల్ల, మిగతా జంతువులన్నిటికంటె ఒంటె నీరు లేకుండా ఎంతోకాలం ఉండగలదు. ప్రయోగాత్మకంగా, ఒక ఒంటెకు నీరులేని పొడి మేత పెట్టి, మండువేసంగిలో పదిహేడురోజులూ, శీతాకాలంలో ముప్పైరోజులూ ఉంచితే, దాని స్వాస్థం చెడలేదు. కాని, మామూలుగా ఒంటెకి క్రమబద్ధంగా రోజుకి ఒకసారో, రెండుసార్లో నీరు పెట్టాలి. ఎడారిప్రాంతాలలో దినం విడచి దినం నీరుపెట్టడం పరిపాటి.

ఒంటె అమితంగా నీరు తాగుతుంది. ఒక్క ఊపున 135 లీటర్ల వరకు త్రాగగలదు. నీరు తాగినప్పుడు, రక్తంలో ఉండే ఎర్రకణాల పరిమాణం మామూలు పరిమాణం కన్నా నూటికి 240 రెట్లు పెరుగుతుంది. ఇతర

1 ఈ ఉత్తరాది (హిందూస్థానీ) పదానికి సరిఅయిన తెలుగుపదం దొరకనందువల్ల ఆ పదమే వాడడం అయింది.

జంతువులలో కణాల మొత్తపు పరిమాణం 130 శాతం కన్నా ఎక్కువ పెరిగిందంటే, జీవకణాలు పగిలిపోయి జంతువు చనిపోతుంది. మనుష్యులలో వీటి పరిమాణం 165 శాతంకన్నా ఎక్కువ కావడం అపాయకరం.

ఒంటెకు కావలసిన నీరు దానికి పెట్టే మేతనుబట్టీ, శీతోష్ణస్థితినిబట్టీ, ఏయే పరిస్థితులలో పనిచెయ్యవలసి ఉంటుందో దాన్నిబట్టీ ఉంటుంది. సామాన్యంగా, రోజూ నీరు పెట్టే పక్షంలో రోజుకి 18 మొదలు 36 లీటర్ల వరకూ కావలసి ఉంటుంది. కాని అంతకుముందు చాలాకాలం నీరులేకుండా ఉంటే అది ఇంకా యెక్కువ నీరు తాగవచ్చును.

ఒంటెకు పరిశుభ్రమైన మంచినీరు పెట్టాలి. ఏళ్లలోనూ, వాగులలోనూ జోరుగా ప్రవహించే నీటికన్నా, ఒంటెలకు, నిలకడగా ఉన్న నీరుగాని, నెమ్మదిగా ప్రవహిస్తూన్న నీరుగాని ఎక్కువ ప్రీతి. మేతపెట్టేముందు, బరువులు తీసివేసిన తరవాత, ఒంటెకు నీరుపెట్టాలి. కావలసిన నీరంతా ఒంటె ఒక్కసారిగా తాగదు ; యథేచ్ఛగా నెమ్మదిగా తాగుతుంది. మిక్కిలి దప్పిగొన్న ఒంటె, త్వరత్వరగా ఎక్కువ నీరు తాగితే, ఒక్కొక్కప్పుడు కడుపు ఉబ్బి బాధపడవచ్చును.

## ఒంటెల సాలలు

మిగతా పెంపుడు పశువులకిలాగే, ఒంటెలకు కూడా గాడ్పులూ, ఎండా, వర్షాల నుంచి తగిన రక్షణ కావాలి. వేసవికాలంలో ఒంటెలను ఆరుబయట ఉంచవచ్చును. ఏదైనా చెట్టుక్రింద, నీడలో, సులభంగా తీసుకు వెళ్లగలిగిన మేత తొట్టె ఉంచాలి. ఇసుక నేలపైన కొంచెం నీళ్లుజల్లి ఉంచితే రాత్రిపూట ఒంటె విశ్రాంతికి సౌకర్యంగా ఉంటుంది.

సాధారణంగా ఒంటెలకు బాగా గాలీ, వెలుతురూ సోకే సాలలు ఉండాలి. వీటిని ఏ ఆడంబరం లేకుండా చవకగా కట్టవచ్చును. పరిసరాలకన్నా కాస్త ఎత్తైన ప్రదేశంలో సాలకడితే, మురికినీరు సహజంగా క్రిందికి పోవడానికి వీలుగా ఉంటుంది. ఒంటెల సాల ఒకవేపు తెరచి ఉండి, మూడువేపుల గోడలుంటాయి. తెరచి ఉంచిన వైపు గాడ్పులు వీచే దిశగా మాత్రం ఉండకూడదు. సాలకప్పుకి పెంకుగాని, చొప్పగాని ఉపయోగించ వచ్చును. గోడలు మట్టితో కట్టవచ్చును. నేల మట్టి నేలగా ఉండవచ్చును గాని, దాన్ని

బాగుగా గట్టిచేసి, నీరు యింకకుండా ఉండేలాగు చెయ్యాలి. నేల, వెనుకకు కాస్త ఏటవాలుగా ఉండేటట్టు చేసి, మురికి నీరు పోవడానికి కాలువ సదుపాయం ఏర్పరచాలి. మేతపెట్టే తొట్టి ఇటుకలతో, నేలకి సుమారు 8 సెంటిమీటర్లు ఎత్తుగా కట్టాలి.

## బరువులు మోసే ఒంటెల సంబాళింపు

మిగతా జంతువులకన్నా ఒంటెలకి బుద్ధి పరిణతి ఆలస్యం. గుఱ్ఱానికి అయిదేళ్ల ప్రాయంలో కలిగే పరిణితి ఒంటెకి ఎనిమిదేళ్లకి కలుగుతుంది. అయిదేళ్లలోపు వయస్సు గల ఒంటెల చేత పనిచేయించడం మంచికాదు ; ఆరేళ్లు వచ్చేదాకా వాటిచేత శ్రమతో కూడుకొన్న బరువైన పనులు చేయంచరాదు.

బరువులు మోసే ఒంటెల విషయంలో, రెండేళ్లు వచ్చిన దగ్గిర్నించీ ఏ వయస్సులోనైనా తర్ఫీదు యివ్వవచ్చును. ఎంత లేతవయస్సులో సంబాళించుకుంటే, తర్ఫీదు యివ్వడం అంత సులభం. ఆదిలో, చిన్న ఒంటెమీద బరువులు వెయ్యకుండా, బరువులు మోస్తున్న పెద్దల ఒంటెల వెంబడే నడిపించాలి. దీనివల్ల, అది బాటకీ, సంబాళింపుకీ అలవాటు పడుతుంది. తర్ఫీదు ఇవ్వడానికి ఒకనెల ముందుగా, ఒంటెకి ముక్కు కుట్టించి, ముక్కుతాడు వెయ్యడానికి వీలుగా చెయ్యాలి.

తర్ఫీదులో ఉన్న ఒంటెకి వరసలో ఎలాగ నడవాలో నేర్పాలి. ఇందుకు, దీని మెడకి ఓ తాడుకట్టి, ఆ తాడు రెండవకొన ఇంకొక బలిష్ఠమైన సాధు ఒంటె మెడకి కట్టాలి. ముక్కుతాడు పట్టుకుని నడిపించి, ఒంటె తనంతటతాను నడిచేటట్టు చెయ్యాలి. ఆ తరవాత బిడారులో మరిఒక ఒంటె తోకకి ఈ ఒంటె ముక్కుతాడు కడితే సరిపోతుంది. ముక్కుతాటితో ఒంటెలు సామాన్యంగా ఒకదాని వెనుక నొకటిగా వరసలో నడుస్తాయి.

ఒంటె నాలుగు క్వింటాల బరువు వరకూ మొయ్యగలదు. అది పోవలసిన దూరాన్నిబట్టీ, జంతువుయొక్క జాతినిబట్టీ బరువు మోసే శక్తి ఉంటుంది. ఎదిగిన ఒంటె సగటున రెండు, మూడు క్వింటాలుల బరువు మొయ్యగలదు. మిలిటరీలో మాత్రం 1.8 క్వింటాలుల బరువుకన్నా ఎక్కువ వెయ్యరు. ఆడ ఒంటెలు ఇంకా తక్కువ బరువు మోస్తాయి. త్వరగా పోవలసివచ్చినపుడు బరువు తక్కువగా వెయ్యాలి.

రోజుకి ఒంటె నడవగలిగె దూరం, నడువవలసిన దానినిబట్టీ, పోయే వేగాన్ని బట్టీ లభించే మేత సదుపాయాన్నిబట్టీ ఉంటుంది. బరువులు వేసిన ఒంటె చేత రోజుకి ఎనిమిది గంటలకన్నా ఎక్కువసేపు పనిచేయించరాదు. ఒక్క ఊపున ఆరుగంటల కన్న ఎక్కువకాలం పనిచేయించకూడదు. సగటున రోజుకు 19-24 కిలోమీటర్ల దూరం ఒంటె పోగలదు. దక్షత, పోషణ గల ఒంటె రోజుకి 32 కిలోమీటర్లు సులువుగా వెళుతుంది. ఒంటెని దూరాలు నడిపించినప్పుడు వారానికి ఓ రోజు విశ్రాంతి యివ్వాలి.

రోడ్డు బాగా ఉంటే, బరువులు వేసిన ఒంటె గంటకు 3 మొదలు 5 కిలోమీటర్లు వరకూ హాయిగా పోగలదు. ఒక్క ఒంటెగాని, మూడు ఒంటెలు వరసగాగాని, బిడారుకన్నా త్వరగా వెళతాయి.

ఒంటెలు పయనం చెయ్యడానికి రాత్రిపూటగాని, తెల్లవారుజామునగాని అత్యుత్తమమైన సమయం. రాత్రిపూట ప్రయాణం చెయ్యడం శ్రేష్ఠం ; ఎంచేతనంటే ఎండబాధ తప్పుతుంది. దారిలో జంతువు మెయ్యడానికి వీలు అవుతుంది. ఇలాగ చేస్తే మేతకయ్యే ఖర్చు తక్కువ అవడమే కాకుండా, మేతకూడా మోసుకు వెళ్లవలసిన ఆగత్యం తప్పుతుంది. కాని, రాత్రిపూట ప్రయాణం చక్కగా వెన్నెల కాస్తూ ఉన్నప్పుడూ, దారిలో కావలసినంత మేత లభించేటప్పుడూ మాత్రమే చెయ్యాలి.

12, 16 మైళ్లకి ఒకసారి, జంతువులు మూత్రం విడవడానికీ, విశ్రాంతి తీసుకోడానికి వీలుగా కాస్సేపు ఆగాలి. మగ ఒంటె మాత్రం మూత్ర విసర్జనకి చాలాకాలం తీసుకుంటుంది.

సామాన్యంగా అవసరం అయినదానికంటె ఎక్కువసేపు బరువులతో ఉన్న ఒంటెలని నిలబెట్టి ఉంచకూడదు. ప్రయాణంలో మధ్య మధ్య ఆగేటప్పుడు, వాటిని కూచోనివ్వాలి. గమ్యస్థానం చేరిన వెంటనే బరువులు తీసెయ్యాలి. కాని "పల్లన్" (జీను వంటిది) వెంటనే తీసివెయ్యకూడదు ; అలాగ తీసివేస్తే, వీపు పైని ఉన్న భారం ఒక్కసారిగా పోవడం వల్ల, చర్మం ముడుచుకుపోయి పుండు కావచ్చును. శీతాకాలంలో, ఒంటె అలిసిపోయిన తరువాత మామూలుస్థితికి వచ్చేలోగా పల్లన్ తీసివేస్తే, ఒంటెకి జలుబు చేసి న్యుమోనియాగాని, పక్షవాతంగాని రాగలదు.

లోతైన నదులు ఈధి దాటవలసి వచ్చినప్పుడు, ఒంటెకి తగినంత విశ్రాంతి నిచ్చిన తరవాత నదిని దాటింపచెయ్యాలి.

ఒంటె మీద బరువు వేసినప్పుడు ఎంతో శ్రద్ధ అవసరం. మూపురానికి రెండు ప్రక్కలూ భారం సమానంగా ఉండేటట్టు చూడాలి. పల్లన్ (జీను) సమంగానూ, చౌకంగానూ అమర్చాలి.

## సవారీ ఒంటెల సంబాళింపు

మూడేళ్లప్రాయంలో ఒంటెకు సవారీ పనులకి తర్ఫీదు ఇవ్వడం శ్రేష్ఠం. కాని ఆరేళ్ల వయస్సు వచ్చేవరకూ, ఒంటెను క్రమబద్ధం అయిన పనికి ఉపయోగించకూడదు. సవారీ పనులకు ఆడ ఒంటెలు శ్రేష్ఠమైనవి.

సవారీ ఒంటెకు, సంజ్ఞ చెయ్యగానే కూర్చోడం, జీను కట్టించుకోవడం ముందుగా నేర్పాలి. ఆరంభంలో, అది కూర్చుని ఉండగానే దానిపైన మనిషి ఎక్కి, ఆ తరవాత దాన్ని అటూఇటూ తిప్పుతూ కళ్లెం ద్వారా ఆజ్ఞలని తెలుసుకొని ఆ ప్రకారం ప్రవర్తించేటట్టు నేర్పాలి. సవారీ చేస్తూన్నప్పుడు ఒంటెను ఎప్పుడుకూడా మెడ మీద కొట్టకూడదు. సవారీ చేసే మనిషి యొక్క కుడికాలు వెనుకభాగం ఒంటెని ముదలకించడానికి ఉపయోగించాలి. సవారీ ఒంటె యొక్క తోక, తాటితో ఒక ప్రక్కగాగాని లేదా జీనుకికాని కట్టాలి.

ఒంటెను నడక వేగంతో సవారీ చేయించకూడదు. మంచి సవారీ ఒంటె బహుదూరం, అంటే రోజుకి 60, 80 కిలోమీటర్లు పోతుంది. అలాగ ఆగకుండా 10–15 రోజులు వెళ్లగలదు. ఆ తరవాత దానికి తగినంత విశ్రాంతి ఇవ్వాలి. పుష్టిగా మేత కలిగిన సవారీ ఒంటె, సగటున, రోజుకి 40 కిలోమీటర్లు ఏ మాత్రం అలసట లేకుండా పోగలదు. మంచి సవారీ ఒంటె సగటున గంటకి ఎనిమిది మొదలు పదకొండు కిలోమీటర్లు వెళుతుంది.

## కాడి ఒంటెల ఆలనపాలన

భారతదేశంలో సాధారణంగా ఒంటెను వివిధములైన కాడిపనులకి ఉపయోగిస్తారు. ముఖ్యంగా దున్నడానికి, పెర్షియను వ్హీలు లాగడానికి దీన్ని వాడతారు ; ఎంచేతనంటే ఒక జత ఎడ్లు చేసే పని ఒక ఒంటె చెయ్యగలదు. బరువులు లాగే పనుల రకాలబట్టి పలువిధాలుగా ఒంటెలని పూన్చుతారు. మామూలుగా ఒంటె, మూడు క్వింటాలు బరువుతో ఉన్న బండిని లాగగలదు.

సవ్యంగా తయారుచేసిన బండి ఉంటే అది ఎనిమిది క్వింటాలు సుళువుగా లాగుతుంది.

ఒంటెను అయిదేళ్ల వయస్సులో కాడిపనులకి పూన్చడం ఉత్తమం. ఒంటెను, దున్నడానికి గాని పెర్షియను వీలు లాగడానికి గాని వినియోగించి నప్పుడు, ఉదయం నాలుగు గంటలు, మధ్యాహ్నం రెండు గంటలు, మొత్తం రోజుకి ఆరు గంటల కన్నా దానిచేత పనిచేయించకూడదు.

## సకాలంలో ఒంటెల వెంట్రుకల కత్తిరింపు

ఒంటెలకు రోమరాజి బాగా పెరిగే ప్రాంతాలలో, ఒంటె వెంట్రుకలు అనేక విధాలుగా ఉపయోగపడతాయి. అతిమృదువైన రోమం లేత వయస్సులో ఉన్న ఒంటెల నుంచీ, మచ్చిక చెయ్యని ఒంటెల నుంచీ లభిస్తుంది. సాధారణంగా వసంత ఋతువులో ఒంటెల రోమం కత్తిరిస్తారు. ఈ కాలంలో ఒక్కొక్క ఒంటె నుంచి సగటున 1, $1\frac{1}{2}$ కిలోగ్రాముల రోమం లభిస్తుంది. బాగా చలి ప్రదేశాలలో 6 కిలోగ్రాముల వరకూ కూడా లభించవచ్చును.

ఒంటెల రోమం చేతికత్తెరతో కత్తిరిస్తారు. జంతువుకి హాని కలగకుండా చర్మానికి దగ్గరగా రోమాలు కత్తిరించడంలో జాగ్రత్తగా ఉండాలి. పనులుచేసే ఒంటెకి, జీను వేసే చోట రోమం కత్తిరించకూడదు. ఇలాచేస్తే రాపిడివల్ల గాయాలు పడవు. ఎండగాడ్పుల నుంచి రక్షణ ఉండేటందుకుగాను, పిల్ల ఒంటెల రోమం, వర్షాలు ఆరంభించేదాకి కత్తిరించకూడదు. రాత్రిళ్లు చలిగా ఉండేటట్టయితే, రోమం కత్తిరించిన ఒంటెలకి కంబళీ కప్పాలి.

రోమం కత్తిరించిన తరవాత, చర్మానికి తెగులుపట్టకుండా, ఒంటెకి ఆవనూనె పూస్తారు. శీతాకాలంలో పెరిగిన రోమరాజి ఎక్కువగా ఉన్నప్పుడు, ఇలా చెయ్యడం చాలా మంచిది. నూనె రాసిన తరవాత ఒంటెని నీడని ఉంచాలి ; లేకపోతే ఎండ వేడిమికి ఒక్కొక్కప్పుడు బొబ్బలెక్కుతాయి. నూనె రాసిన తరువాత రెండు రోజులకి ఒంటె శరీరం నిండా బురద పులుముతారు. మరో మూడు రోజులకి ఆ మట్టిపార నొలిచేస్తారు.

## ఒంటె వయస్సు నిర్ణయం

పళ్లు చూసి వయస్సు నిర్ణయించడం, గుర్రం విషయంలోకన్నా, ఒంటె విషయంలో చాలా సులభం. ఒంటె పుట్టిన మొదలు పన్నెండు రోజులలోగా రెండు తాత్కాలికమైన ముందరి కత్తెర పళ్లు వస్తాయి. 12 నెలల ప్రాయానికి

6 తాత్కాలికమైన కత్తెర పళ్లు ఉంటాయి. 4 ఏళ్ల వయస్సుకి ఇవి అరిగిపోనారంభించి, మొండి తునుకలుగా మిగులుతాయి. 5 ఏళ్లు వచ్చేసరికి శాశ్వతమైన కత్తెర పళ్లు వస్తాయి. ఒంటెకి 8 ఏళ్ల వయస్సు వచ్చేసరికి కత్తెర పళ్లు రానారంభిస్తాయి. ఎదిగిన ఒంటెకి 10 దంతాలు 6 కోరపళ్లూ పైదౌడకీ, 8 దంతాలు, 6 కత్తెరపళ్లు, 4 కోరపళ్లూ క్రింది దౌడకి ఉంటాయి.

తొమ్మిది ఏళ్లు పైబడ్డ ఒంటె యొక్క వయస్సు, కోరపళ్ల అరుగుదలని బట్టీన్నీ కత్తెరపళ్ల ఆకారాన్నిబట్టీన్నీ చెప్పవచ్చును. 11 ఏళ్ల తరవాత ఒంటె యొక్క వయస్సు నిర్ణయించడం ఊహామాత్రంగానే ఉంటుంది. వయస్సు ముదురుతూన్న కొద్దీ కోరపళ్లు అరిగిపోతాయి. సన్నగా పొడుగ్గా ఉండవలసిన కత్తెరపళ్లు గుండ్రంగా పొట్టిగా తయారవుతాయి. బాగా ముసలితనంలో ఇవి మొండితునకలుగా మాత్రం మిగులుతాయి.

సుమారు 12 ఏళ్లు పైబడేసరికి, తోకచుట్టూ ఉన్న పొడుగాటి వెంట్రుకలు నెరసిపోతాయి. ముసలి ఒంటెల తల మధ్యవయస్సులో ఉన్న ఒంటెల తలకన్నా బరువుగా ఉంటాయి.

గుర్రాలలాగే ఒంటెలు కూడా 40 ఏళ్లకి పైగా జీవిస్తాయి. అవి పనులకి ఉపయోగించే కాలం, వాటికి పెట్టే మేతపైనా, వాటి సంరక్షణ గురించి తీసుకున్న శ్రద్ధపైనా చాలావరకు ఆధారపడి ఉంటుంది. సాధారణముగా ఆరేళ్ల వయస్సు నుండి 26 ఏళ్ల వయస్సు దాటాకా 20 ఏళ్లపాటు ఒంటెచేత పనిరాబట్టుకోవచ్చును.

## ఒంటెల అనారోగ్య లక్షణాలు

నెమరువేసే జంతువులకి వచ్చే వ్యాధులన్నీ యించుమించుగా ఒంటెలకి కూడా వస్తాయి.

ఒంటెకి వ్యాధి వచ్చినపుడు కనబడే ముఖ్యలక్షణాలు : జ్వరం రావడం ; వొణుకు ; ఆకలి మందగించడం లేదా పూర్తిగా ఆకలి లేకపోవడం ; నెమరువేత మానెయ్యడం ; మందంగా ఉండడం ; పెదిమలు వేలాడబడి ఉండడం ; విశ్రాంతి లేకపోవడం ; కళ్లు సగం మూతలు పడిఉండడం, వాటిలోంచి నీరుకారడం ; ప్రక్కలు క్రుంగిపోయి ఉండడం ; నాడిరేటు, శ్వాసరేటు అధికంకావడమున్నూ, మూత్రం చిక్కటి రంగులో ఉంటుంది. మూత్రవిసర్జన తక్కువగా ఉంటుంది. ఆడ ఒంటెల విషయంలో పాలు

తగ్గిపోతాయి ; జబ్బుపడిన ఒంటె సూర్యుడు ఉన్నవైపు ముఖంపెట్టి నిలుచుంటూ ఉంటుంది.

ఒంటె యొక్క సామాన్యపు దేహ ఉష్ణత ఉదయాన్ని 36.1 డిగ్రీ సెంటిగ్రేడు (97 డిగ్రీలు ఎఫ్), తెల్లవారుజామునుంచి పొద్దుపోయేవరకూ యీ ఉష్ణత పెరుగుతూ ఉంటుంది. పొద్దుపోయే సమయానికి దేహపు ఉష్ణత సగటున 37.9 డిగ్రీలు సెంటిగ్రేడు (110.3 డిగ్రీలు ఎఫ్) ఉంటుంది. ఒంటె కూర్చుని ఉన్నప్పుడు గుద స్థానంలోకి థర్మామీటరు జొనిపి ఉష్ణతాపం తెలుసుకోవచ్చును.

ఆరోగ్యంగా ఉన్న పెద్ద ఒంటె యొక్క నాడిరేటు ఉదయాన్న నిమిషానికి 32 మొదలు 44 వరకూ, సాయంకాలం 36 నుంచి 50 వరకున్నూ ఉంటుంది. తోక మొదట అడుగుభాగాన్నిగాని, లోతొడలో 18 సెంటిమీటర్ల పైనిగాని చెయ్యి ఉంచి ఒంటె నాడి తెలుసుకోవచ్చును.

ఆరోగ్యంగా ఉండి-విశ్రాంతి తీసుకుంటూన్న ఒంటె యొక్క శ్వాసరేటు నిమిషానికి అయిదు మొదలు పన్నెండువరకూ ఉంటుంది. శీతాకాలంలో శ్వాసరేటు తక్కువగా ఉంటుంది. నిమిషానికి ఎనిమిదికన్నా మించదు.

## ఒంటెలకు వచ్చే సామాన్యపు వ్యాధులు

"సుర్రా" (అంటే కుళ్లిపోవడం అని అర్థం) అన్నది మిక్కిలి సామాన్యంగా ఒంటెలకు వచ్చే ప్రాణహానికరమైన వ్యాధి. ఇంచుమించుగా ఇది భారతదేశంలో గల ఒంటెలన్నింటికీ వచ్చే స్థానిక వ్యాధి. జంతువుని కరచి, రక్తం తాగే యీగల వల్ల యీ వ్యాధి, జబ్బుపడ్డ ఒంటెల నుంచి ఆరోగ్యంగా ఉన్నవాటికికూడా వ్యాపిస్తుంది. వర్షాకాలంలో ఈగలు మరీ ఎక్కువగా ఉంటాయి కనక, యీ వ్యాధి వర్షాకాలంలో సంక్రమిస్తుంది.

ఒంటెకి సుర్రా వ్యాధి తగిలితే, మిక్కిలి ప్రమాదకరంగాగానీ, దీర్ఘవ్యాధిగా గాని పరిణమిస్తుంది. ప్రమాదకరంగా వచ్చినపుడు, ఇది తీవ్రంగా అధికం అయిపోయి, కొద్దినెలలలో ఒంటె చచ్చిపోతుంది. దీర్ఘవ్యాధిగా పరిణమించి నప్పుడు ఇది మూడు నాలుగేళ్లవరకూ ఉంటుంది.

ప్రమాదకరంగా సుర్రా వ్యాధి వచ్చిన ఒంటెకి ఆకలి మందగిస్తుంది ; ప్రక్కలు క్రుంగిపోయి ఉంటాయి ; మెడ వేలాడబడి ఉంటుంది. ఒంటె నిస్సత్తువుగా, కళ్లు సగం మూసుకుని ఉంటుంది. కళ్ల వెంట నీరు కారుతుంది.

ఉదయాన్నే 37.2 మొదలు 39.4 డిగ్రీలు సెంటిగ్రేడు (99 మొదలు 103 డిగ్రీలు ఎఫ్) వరకూ జ్వరంకాస్తుంది. ఆడ ఒంటె అయితే పాలివ్వదు. చూలుతో ఉన్నదానికి గర్భస్రావం కలుగుతుంది.

సుర్రా దీర్ఘవ్యాధిగా పరిణమించినప్పుడు, పదేపదే జ్వరం వస్తుంది ; జంతువు రక్తహీనంగా ఉంటుంది ; చిక్కిపోతుంది ; ఈ వ్యాధి వచ్చిన జంతువు అంతకంతకీ మరీ చిక్కిపోతూ వచ్చి, చివరికి దానికి చర్మశల్యాలే మిగులుతాయి. మూపురం ఇంచుమించుగా హరించుకుపోతుంది.

దొమ్మ : ఒంటెలకి దొమ్మ అనుకున్నదానికంటె ఎక్కువ సాధారణంగానే వస్తుంది.

దీని ముఖ్య లక్షణాలు : జ్వరం రావడం ; నెమరువేత మానెయ్యడం ; త్వరత్వరగా శ్వాసపీల్చడం ; ఒంటె కూలబడి మరి లేవలేదు. వ్యాధి వచ్చిన కొద్దిగంటలలో మరణం సంభవిస్తుంది. శీఘ్రంగా అపాయం కలగడమే యీ జబ్బు లక్షణం ; అకస్మాత్తుగా జంతువులు చచ్చిపోయాయంటే ఈ వ్యాధి సంక్రమించిందని అనుమానించవచ్చును.

వ్యాధి నిరోధక మార్గాలు : వ్యాధి తగిలిన ఒంటెలతో కలిసి ఉన్న మిగిలిన ఒంటెలని వేరుపరచాలి. వ్యాధి తగిలి చనిపోయిన ఒంటె కళేబరం, దాని తాలూకు సామానూ తగులబెట్టించాలి. పరిసరాలు క్రిమినాశక మందులతో పరిశుభ్రంగా కడగాలి. దొమ్మ సోకిన ప్రాంతాలలో ఒంటెని మేతకి బయటికి తీసుకుపోకూడదు.

కుక్కకాటు వలన వచ్చే రోగం (రాబీస్) : ఈ రోగం వెర్రి కుక్కలూ, నక్కలూ, తోడేళ్లూ ఒంటెలను కరవడంవల్ల సంభవిస్తుంది. అలాగ కరిచిన కొద్దిరోజులనుంచీ రెండు నెలల లోపుగా, ఎప్పుడైనా, ఒంటెలో యీ వ్యాధి లక్షణాలు కనిపించవచ్చును.

ఈ వ్యాధి యొక్క ప్రత్యేక లక్షణాలు : జంతువు పోట్లాటకి సిద్ధం అవుతుంది. దాని చూపు శూన్యంగా ఉంటుంది ; ముక్కు పైకి ఎత్తి ఉంచుతుంది ; నోటివెంట చొంగ కారుతుంది ; ఒక్కొక్కప్పుడు పక్షవాతం కూడా కలగవచ్చు.

ఈ వ్యాధి వచ్చిన జంతువుని చంపివెయ్యాలి. దాని కళేబరం తగులబెట్టాలి. వెర్రిఎత్తిపోయిన ఒంటె మనిషికీ జంతువుకీ కూడా ప్రమాదకరమే.

ఒంటెలకు వచ్చే మశూచి : ఒంటెలలో ఒకదానినుంచి మరొకదానికి సంక్రమించే వ్యాధి మశూచి. రెండేళ్లలోపు వయస్సుగల లేత ఒంటెలకి ఇది సామాన్యంగా సంక్రమిస్తుంది.

ఈ వ్యాధి తాలూకు అతి సామాన్యమైన లక్షణాలు ఏమంటే పెదిమలు రెండింటి పైనా పొక్కులు లేవడం, ప్రమాదంగా జబ్బు వచ్చినపుడు ఈ పొక్కులు ముఖము, కంటిరెప్పలు, తల, గొంతు, మెడ, వెనుక కాళ్లు, పాదాలు మొదలయిన మిగతా శరీర భాగాలకి వ్యాపించవచ్చును.

వ్యాధిసోకిన జంతువులని వేరుపరచాలి. వాటి సంరక్షణ కోసం వేరు మనుష్యులుండాలి. జబ్బుపడ్డ జంతువుల కోసం ఉపయోగించే సామాన్లు క్రిమినాశక మందులతో కడిగి, శుభ్రపరచాలి.

కుమ్మ అనే వ్యాధి వస్తే, ఒంటె కూర్చోడానికి చాలా ప్రయాస పడుతుంది. ఇలాగ కూర్చునేటప్పుడు వెనుకకాళ్ల కండరాలు గజగజ వొణికి పోతాయి. ఒంటెకి కుమ్మ జబ్బు లక్షణాలు కనబడ్డాయి అంటె అది జబ్బు నుంచి కోలుకోవడం దుర్లభం.

# VII. ఏనుగులు

## ఉపోద్ఘాతం

మానవుడు మచ్చిక చేసి పెంచిన జంతువులన్నిటిలోకి మిక్కిలి పెద్దదీ, ఎక్కువ దర్జా అయినదీ ఏనుగు. ప్రాచీన భారతీయ గ్రంథాలలో ఏనుగు తరుచుగా పేర్కొనబడింది. దేశంలోని మత-ఆచార వ్యవహారాలలో ఏనుగుకి ఎక్కువ ప్రాధాన్యం కనబడుతుంది. హిందూపురాణాలలో విఘ్నేశ్వరుడుకి ఏనుగు తల ఉన్నట్టు నిరూపించబడింది.

భారతదేశం, సింహళం, అస్సాం, బర్మా దేశపు అర్యణ్య ప్రాంతాలలో ఏనుగు కానవస్తుంది. మలయా ద్వీపకల్పం, సయాం, కొచ్చిన్-చైనాలలోనూ, సుమత్రా-బోర్నియో దీవులలోనూ కూడా ఏనుగు కానవస్తుంది. ఆసియా ఖండపు ఆగ్నేయ భాగమే బహుశా ఏనుగు పుట్టినిల్లు అని చెప్పుకున్నప్పటికీ, ఆఫ్రికా ఖండంలో కూడా ఏనుగు ఎక్కువ సంఖ్యలో ఉన్నాయి.

ఆఫ్రికా దేశపు ఏనుగుకు భారతదేశపు ఏనుగుకు భేదం ఏమిటంటే ఆఫ్రికా ఏనుగు కన్నా భారతదేశపు ఏనుగకు ఎత్తూ, బరువూ తక్కువ. దీని చెవులు కూడా చిన్నవే. ఆఫ్రికా ఏనుగులాగ కాకుండా, దీని పృష్ఠభాగపు ఆకృతి పుటాకారంలో ఉంటుంది.

భారతదేశంలో ఏనుగులు చాలావరకు హిమాలయపు దిగువ ప్రాంతాలలో పశ్చిమాన డెహ్రాడూన్ లోయవరకూ కానవస్తాయి. గంగా-కృష్ణానదుల నడుమనున్న అడవిప్రాంతాలలో యివి స్థానికంగా ఉన్నాయి. పశ్చిమ కనుమల్లోనూ, మైసూరు, అస్సాం, పర్వతారణ్యాలలోనూకూడా ఏనుగులు కలవు.

భారతదేశంలోగల ఏనుగుల సంఖ్య ఫలానా అని నిరూపితం కాలేదు. అంచనాలని బట్టి 7,000 అడవి ఏనుగులు ఉన్నాయట ; వీటిలో సుమారు 3,000 కేవలం దక్షిణ భారతదేశంలోనే ఉన్నాయి.

చిరకాలంనుంచీ భారతదేశంలో ఏనుగులని పట్టి, మచ్చికచేసి, సాంసారిక పనులకి ఉపయోగిస్తున్నారు. ప్రాచీనకాలంలో వీటికి బరువులు మొయ్యడానికీ, యుద్ధరంగంలోనూ ఉపయోగించేవారు. కలప పరిశ్రమకి ఏనుగులు

తప్పనిసరిగా ఉండాలి. అడవి ప్రాంతాలలో కర్రదుంగలని నదీతీరానికి లాగి ఎగుమతి చెయ్యడానికి ఏనుగులని వియోగిస్తారు. దట్టంగా పెరిగిన చిట్టడవులలో ఏనుగులు సవారీ చెయ్యడానికి కూడా ఉపయోగపడుతున్నాయి. మగ ఏనుగులకి దంతం వల్ల విలువ ఎక్కువ. ఊరూరా పర్యటించే సర్కస్సుల మృగబృందంలో ఏనుగు ముఖ్యంగా కనిపిస్తుంది. సంస్థానాధీశులకి, మొన్నమొన్నటివరకూ, ఏనుగు ముఖ్యమైన రాజచిహ్నంగా వెలుగొందింది. పర్వదినాలలో వారు వీటిని ఆడంబరంతో ప్రదర్శించేవారు.

అడవి ఏనుగులు ఎప్పుడూకూడా వేటగాళ్లని అమితంగా ఆకర్షిస్తున్నాయి. భారత దేశంలో పులి వేటకి ఏనుగుని ఉపయోగిస్తారు.

## ఏనుగు సామాన్య లక్షణాలు

ఏనుగుకి అమితమైన తెలివితేటలూ, జ్ఞాపకశక్తి ఉంటాయని ఉత్ప్రేక్షగా చెబుతారు. కాని యీ ప్రజ్ఞలు కుక్కకీ, గుర్రానికీకన్నా, ఏనుగుకి ఎక్కువ కాదు. ఏనుగు చర్మం సుమారు 2 సెంటీమీటర్ల మించిన దళంలో ఉంటుంది కాని చాలా సున్నితమైనది. ఏనుగు చర్మం యొక్క మందం వేరువేరు భాగాలలో వేరువేరుగా ఉంటుంది. కటి ప్రదేశంలోనూ, పిరుదులపైనా చర్మం అత్యధిక దళంలో ఉంటుంది. ఏనుగు సూక్ష్మ దృష్టికల జంతువు. కాని అది సాధారణంగా యీ దృష్టిని వినియోగించకోలేదు. దాని మెడ కురచగా ఉండడంవల్ల, తల ప్రక్కకి తిప్పి వెనుకనున్న వాటిని ఏనుగు చూచుకోలేదు. సునిశితమైన దాని ఘ్రాణేంద్రియమూ, శ్రవణేంద్రియమూ, దృష్టి పరిమితం అవడంవల్ల కలిగిన లోటుని పూర్తిగా తీరుస్తాయి.

ఏదైనా అసాధారణమైన ధ్వనికాని సందడికాని విన్నప్పుడు ఏనుగు బెదిరి, గట్టిగా ఘీంకరిస్తుంది. ఏనుగు విరుచుకు పైబడడానికి వచ్చేముందుకూడా కీచుమనేటట్టు ఘీంకరిస్తుంది.

భారతదేశపు ఆడ ఏనుగులకి సామాన్యంగా దంతాలు ఉండవు. చాలా మగ ఏనుగులు కూడా దంతాలు లేనివి ఉన్నాయి. వాటిని "మఖానా" అంటారు. ఏనుగ దంతాలు అడవిపంది కోరలవంటివి కావు ; కొరుకుపళ్ల లాంటివి. ఇవి పైదవడ నుంచి పుట్టి, ఏనుగ ఆజీవాంతం పెరుగుతూనే ఉంటాయి. ఏనుగుకి దంతాలు ప్రబలమైన ఆయుధాలు. వీటిని అది

యించుమించుగా ఏ వంకగానైనా తిప్పి ఉపయోగించు కోగలదు. ఇతరత్రా యీ దంతాలు సార్థకంగా ఉపయోగపడేటట్టు చెయ్యవచ్చును. వీటివల్లకాని సాధ్యమవని అనేకరకములైన పనులు ఏనుగుచేత, దంతాల సహాయంతో, చేయించవచ్చును. మిక్కిలి పొడవుగా ఎదిగినట్లు ఉల్లేఖించబడిన దంతం 2.6 మీటర్ల పొడవుంది. మిక్కిలి బరువు తూగిన దంతం యొక్క తూనిక 46 కిలోగ్రాములు.

సాధారణంగా భారతదేశపు ఏనుగు ముందు కాలికి, నిగనిగలాడుతూ డెక్కలాగ ఉండే గోళ్లు అయిదు, వెనుక కాలికి నాలుగు ఉంటాయి. గుర్రంలాగ కాకుండా, ఏనుగు గమనంలో ఒకే పద్ధతి-నడక. సామాన్యపు బరువు వేసిన ఏనుగు మంచిరోడ్డు మీద, గంటకి సుమారు అయిదు కిలోమీటర్లు పోగలదు. సుమారు 2 మీటర్ల వెడల్పు, 1.8 మీటర్లు లోతుగల గొయ్యి ఉంటే ఏనుగు దాటలేదు. కాని ఏనుగులు చాలా బాగా యీదగలవు.

బంధించి తెచ్చిన ఏనుగులకంటె అడవి ఏనుగులు చాలాకాలం జీవిస్తాయి. ఒక్కొక్కప్పుడు ఏనుగు ఆయువు మరీ ఉత్ప్రేక్షించి చెబుతారు. సామాన్యంగా 25, 35 ఏళ్ల ప్రాయంగల ఏనుగు, చిన్న ఏనుగగా పరిగణింపబడుతుంది. 35, 45 ఏళ్ల వయస్సుగలది పూర్తిగా ఎదిగిన జంతువు అనీ, 45, 50 ఏళ్ల ప్రాయంలో ఏనుగు నడివయస్సులో ఉంటుంది అనీ, 50, 60 ఏళ్ల ప్రాయంలో దానికి వృద్ధాప్యం ప్రాప్తిస్తుంది అనీ అంటారు. సర్కసుల్లో ఉపయోగించే ఏనుగు సగటు వయస్సు 35 ఏళ్లు.

ఏనుగు వయస్సు చెవుల యొక్క పై అంచు వంగి ఉండడాన్ని పట్టి తెలుసు కోవచ్చును. లేబ్రాయపు ఏనుగులకి 8-9 ఏళ్లు వచ్చేదాకా చెవి అంచు తిన్నగా ఉంటుంది. ఆపైన అది వంగడం ఆరంభిస్తుంది. 30 ఏళ్లు వచ్చేసరికి చెవి అంచు 2.5 సెంటిమీటర్ల వరకూ ముట్టుకుపోయి ఉంటుంది. 30-60 ఏళ్ల మధ్య 5 సెంటి మీటర్లకి పైగా ముట్టుకుపోయి ఉంటుంది. ఏనుగు పళ్ల వల్ల కూడా చూచాయగా దాని వయస్సు తెలుసుకోవచ్చును.

అప్పుడప్పుడు, ఏనుగు ఎత్తుగూడా విపరీతమైన అంచనావేసి లిఖితం చేసేరు. కాని సుమారుగా 2.7 మీటర్లు ఎత్తు ఉన్న మగ ఏనుగులూ, 2.4 ఎత్తు ఉన్న ఆడ ఏనుగులూ మంచి ఎత్తైన జంతువులుగా పరిగణించాలి. సర్కస్సు ఏనుగుల సగటు ఎత్తు 2.2 మీటర్లు.

భారీ అయిన ఏనుగు 3,630 కిలోగ్రాములకి పైగా బరువు తూగుతుంది. సర్కస్సు ఏనుగు యొక్క బరువు సగటున 2,720 కిలోగ్రాములు. వాటి బరువు 1,040 కిలో గ్రాములు మొదలు 4,170 కిలోగ్రాముల వరకూ ఉంటుంది.

ఏనుగు యొక్క శరీరం ఎప్పుడూ చలిస్తూ ఉంటుందని ఒక అభిప్రాయం ఉంది. కాని ఏనుగులు ఎన్నో గంటలవరకు నుంచునే ఉంటాయి. ఆ సమయంలో శరీరాన్ని ముందుకీ వెనకకీ ఊగిస్తూ ఉంటాయి. దీన్ని "వీవింగ్" నేతవేయడం అంటారు. ఈ చలనం తప్ప మిగతా శరీరం, మొత్తం మీద, అచంచలంగానే ఉంటుంది. శరీరంలోని అవయవాలు అనగా తొండపు కొన, చెవులు తోక ఎడతెగకుండా చలిస్తూనే ఉంటాయి. తొండపు చిట్టచివరిభాగం ఎల్లప్పుడు కదుల్తూనే ఉంటుంది. తోకకు చలనం ఇంకా ఎక్కువ. మనుషుల కనిరెప్పలు తెలియకుండా మాటిమాటికీ మూతలు పడుతూన్న ట్టుగానే, ఏనుగు చెవి కదలిక కూడా నాడీజాలంలో కలిగే పోటుపాటు వల్ల కలుగుతుంది.

ఏనుగు యించుమించుగా అస్తమానం నిలుచునే ఉంటుంది. రాత్రిపూట ఏ కాస్సేపో పడుకుంటుంది. పగటిపూట ఎప్పుడూ సాధారణంగా పడుకోదు. మరీ అలిసిపోతేతప్ప.

ఏనుగులు ఎప్పుడూ నిద్రపోవనీ, అసలు నిద్రపోవడం అంటూ ఉంటే చాలా కొద్దికాలం నిద్రపోతాయనీ ఓ ప్రబలమైన నమ్మకం ఉంది. కాని, యథార్థం పరిశీలిస్తే, అవకాశం లభించేటట్టయితే ఏనుగు పడుకుని నిద్రపోతుందనీ, అందులోనూ ముఖ్యంగా రాత్రి 11 గంటలు మొదలు తెల్లవారుజామున 4 గంటల వరకూ నిద్రపోతుందని తేలింది. అయితే, ఏనుగు నిలుచుని ఉండికూడా కునుకుతియ్యవచ్చును. అలాంటి సమయంలో తలా, తొండమూ కదలిక లేకుండా ఉంటాయి. తొండపుకొన నెమ్మదిగా నేలపై ఆనుకుని ఉంటుంది.

ఏనుగు విలువ దాని వయసునిబట్టీ, వాటికి యిచ్చిన శిక్షణనిబట్టీ ఉంటుంది. బాగా శిక్షణ పొందిన దంతపు ఏనుగులకి అత్యధికమైన వెల ఉంటుంది. కలప దొడ్లలోనూ, అడవులలోనూ కూడా అవి ఎంతో ఉపయోగపడతాయి ; దంతాల సహాయంతో అవి కలపచేర్చి పెట్టగలవు.

అడ్డంకులు ఉన్నప్పటికీ కఱ్ఱ దుంగలని ఎత్తుకుని వెళ్లగలవు. దంతాల పొడవునీ, దళాన్నిబట్టి ఏనుగు విలువ ఉంటుంది.

మంచి ఏనుగు యొక్క ముఖ్యలక్షణాలు ఏమిటంటే, అది మరీ ఎత్తుగానూ బొత్తిగా కురచగానూ కాకుండా మధ్యమ పరిమాణంలో ఉండాలి. వక్షస్థలం విశాలంగా ఉండాలి; మొసలి చర్మంలాగ చర్మం ముడుతలుపడి ఉండాలి ; తల స్థూలంగానూ, నుదురు విశాలంగానూ, చెవులు పెద్దవిగానూ, కళ్లు ఎక్కువ నీరు కారకుండా చురుకుగానూ ఉండాలి. తొండం చక్కగా పొడవుగా ఉండాలి; తొండం మొదలు వెడల్పుగా ఉండాలి. దాని ముందరిభాగాన్ని ఎఱ్ఱని చుక్కలుండాలి ; మెడ కురుచగా, లావుగా, నిండుగా ఉండాలి ; వీపు తిన్నగా వెడల్పుగా ఉండాలి ; ముందరికాళ్లు పొట్టిగా ఉండి కొస్త ముందుకు వంగి ఉండాలి. పృష్ఠభాగం నిండుగా ఏటవాలుగా ఉండి, కాళ్లు కురుచగా బలిష్ఠంగా ఉండాలి. పాదాలక్రింద ఉండే దిండ్లు గట్టిగానూ, గోళ్లు నున్నగా నిగనిగ లాడుతూనూ ఉండాలి. ఏనుగు అడుగులు త్వరగానూ సులభంగానూ పడుతూ ఉండాలి. చక్కని వెంట్రుకలు కలిగిన కుంచె ఉండి, తోక పొడవుగా ఉండాలి.

ఎత్తుగా, విలువంపుగా ఉండే వీపూ, స్ఫుటంగా ఉండే వెన్నెముకా, పల్చగా లేతరంగులో ఉండే చర్మం, పొడుగాటి కాళ్లూ ఏనుగలో అవలక్షణాలని పించుకుంటాయి.

## ఏనుగుల పెంపకం

ఏనుగుల సంతాన పద్ధతి క్రమం గురించిన సమాచారం అంతగా లభ్యంకాలేదు. బందీలో ఉన్నప్పుడు అది సామాన్యంగా జతకట్టదు. అడవిలో మేతకోసం వదలిన ఏనుగులూ, లేదా రాత్రిపూట అడవిలో విచ్చలవిడిగా తిరగడానికి వదలివేసిన ఏనుగులూ సహజమైన జీవనం గడుపుతాయి ; అటువంటి ఏనుగులు, మచ్చికచేసిన ఆడ ఏనుగులతో అడవులలో జతకట్టడం అరుదుకాదు.

ఏనుగులలో సంతాన ఉత్పత్తి, కలుగజేసే శక్తి 8 మొదలు 15 ఏళ్లవరకూ ఉంటుంది; కాని అవి సుమారు 70 ఏళ్లు వచ్చేదాకా కంటూనే ఉంటాయి.

అడవి ఏనుగులలో ఆడ ఏనుగు రెండున్నర, మూడు సంవత్సరాలకి ఒకసారి కంటుంది ; తన జీవితంలో అది పదిహేను పిల్లలకి పైగా కంటుంది.

ఏనుగుకి వచ్చే "మదం" అన్నదాని గురించి పూర్తి అయిన పరిశీలన పూర్తిగా జరగలేదు. జ్ఞానం లభ్యంకాలేదు. మచ్చిక చెయ్యబడిన ఏనుగులకి సాధారణంగా ప్రతీ యేటా "మదం" కలుగుతుంది ; ఈ అవస్థ సుమారు మూడువారాల వరకూ ఉంటుంది. జతకట్టేముందు, పోట్లాడడానికీ చంపి వెయ్యడానికి కూడా ఏనుగులో సహజంగా కలిగే వాంఛని సూచిస్తుందిట మదం. ఆడ ఏనుగులు యీ స్థితిలో ఉద్రేకం పొందవు.

మదంలో ఉన్న ఏనుగు చాలా ప్రమాదకరమైనది. మదంలో ఉన్నప్పుడు ఏనుగులు తమ మావటీళ్లనే చంపివేసిన ఉదంతాలు ఉన్నాయి. ఆ స్థితిలో ఉన్న ఏనుగని గొలుసులతో బంధించి, చాలా జాగ్రత్తగా మేతపెట్టాలి. మదపు కాలం సాఫీగా జరిగిపోడానికి, సామాన్యంగా ఏనుగులకి ఈ కాలంలో ఎక్కువ పరిశ్రమ కల్పిస్తారు

ఏనుగు మదంలో ఉన్నప్పుడు దాని చెవులకీ, కంటికీ మధ్యనున్న ప్రదేశం నుంచి నల్లటి జిగురుపదార్థం వెలువడుతుంది. కాని యీ జిగురు పదార్థం వెలువడడానికీ, ఏనుగ మదంలో ఉండడానికీ సంబంధం ఏమీలేదు.

ఆడ ఏనుగుకి కామవాంఛ చాలా తక్కువస్థాయిలో ఉంటుంది. మిగతా పెద్ద జాతి పెంపుడు జంతువులతో పోల్చిచూస్తే, ఆడ ఏనుగు ఉద్రేకాన్ని కనపరచడనే చెప్పాలి. ఆడ ఏనుగు ఎదకి వచ్చిన లక్షణాలు ఏమీ కనిపించవు.

అన్ని పెంపుడు జంతువులలాగే ఏనుగులు కూడా జతకడతాయి. జతకట్టేముందు లైంగిక వాంఛ ఎక్కువగా కనబడుతుంది. మగ ఏనుగు, తన తొండంతో ఆడ ఏనుగుతో సరసాలాడుతూ, ఒక్కొక్కప్పుడు ఆ తొండంతో పట్టుకుంటుంది. ఈ సందర్భంలో ఆ ఏనుగుల తొండం, తోక, చెవులూ త్వరత్వరగానూ, అవిరామంగానూ చలిస్తూ ఉంటాయి. అట్టి చలనం వాటి ఉద్రేకాన్ని తెలియజేస్తుంది.

జతకట్టేటప్పుడు మగ ఏనుగు మిగత మగజంతువులలాగే, ఆడ ఏనుగు వెనుక తట్టున ఉంటుంది. తరుచగా, ఆడ ఏనుగు ముందు కాళ్లు వంచి మోకాలు పడ్డట్టు ఉండడం గమనించబడింది. మగ ఏనుగు, ముందరికాళ్లు ఆడ ఏనుగు నడుముపై ఇరుప్రక్కలా భుజాలదాకా ప్రసరింపజేస్తుంది. మగ

ఏనుగు, ఆడ ఏనుగుని అణచిపట్టుకోదు. అలాగని ముందరికాళ్లపై ఆనుకుని తన స్థావరం స్థిరం చేసుకోదు కూడాను. కాని క్రమంగా వెనుక కాళ్లువంచి, ఇంచుమించుగా కూచున్నస్థితిలోకి వస్తుంది. తరవాత వెనుకకాళ్లపై లేచి నిలుచుంటుంది. అసలు జతకట్టే ప్రక్రియ అంతా కూడా చాలా తొందరగా జరిగిపోతుంది ; సుమారు ఒక్క నిమిషం కన్నా ఎక్కువ పట్టదు. గ్రుచ్చిపెట్టినట్టుకూడా ఎక్కడా గమనించబడలేదు. జతకట్టడం అయిపోగానే మగ ఏనుగు వేరుగాపోయి, ఊరకే ఉంటుంది. ఆడదిమాత్రం ఇంకా ఉద్రేకంలో ఉండి నెమ్మదిగా ఘీంకరిస్తుంది ; చెవులు రెపరెప లాడిస్తుంది ; తోక అల్లల్లాడిస్తుంది.

ఏనుగు 18 మొ॥ 22 మాసాలు - సగటున 20 మాసాలు - చూలుతో ఉంటుంది. చూలుతో ఉన్నప్పుడుకూడా ఆడ ఏనుగు కామవాంఛ నభిలషిస్తుంది. కాని, పిల్ల పుట్టిన తరవాత మాత్రం ఎనిమిది పది మాసాల వరకూ మగ ఏనుగును దగ్గిరకి రానివ్వదు. ఏనుగుకు కవలపిల్లలు పుట్టడం బహు అసాధారణం.

స్తనగ్రంథులు పెద్దవికావడం తప్ప, చూలున్న ఏనుగులో ఏ మార్పూ కానరాదు. అది మామూలుగానే ఉండి, చూలు ముదిరిన తరవాత కూడా ప్రయాసతో కూడుకున్న పనులు చెయ్యగలదు. అధిక్రమకి లోనైన కారణంగా గర్భస్రావం కలగడం ఎక్కడోగాని సంభవించదు.

## ఏనుగు ప్రసవం

సామాన్యంగా ఏనుగు ప్రసవించడానికి తక్కువకాలం పడుతుంది. కనేముందు అది నొప్పులవల్ల విశ్రాంతి లేకుండా ఉంటుంది ; మూలుగుతూ, చుట్టుకొనిపోతూ ఉంటుంది ; తరుచుగా తొండం గాలిలోకి పైకిఎత్తి ఉంచి అల్లల్లాడిస్తూ, తల అటూ ఇటూ విసురుకుంటూ రొప్పుతుంది.

ఇంక ఒక గంట సేపటికి కంటుందనగా, భగరంధ్రం ద్రవిస్తుంది. కనేముందు ఏనుగు మెత్తటి ప్రదేశాన్ని, ప్రశాంతంగా ఉండు పరిసరాలను వెతుక్కుంటుంది. అడవి ఏనుగుల విషయంలో, ప్రసవించే ఏనుగు ఏ మందకి చెందిందో, ఆ మందలోని ఏనుగులు చాలా తత్తరపాటు పడతాయి. కొన్ని ఆడ ఏనుగులు మందనుంచి విడిపోయి, ప్రసవించే ఏనుగుని ఊవేచోటుకి,

సామాన్యంగా చెట్లు దట్టంగా ఉండే తోపుకి, తీసుకుపోయి దానికి అండగా నిలుస్తాయి. కనడం అయిపోగానే అవి తిరిగి మందని చేరుకుంటాయి.

ఈ సమయంలో, మొట్టమొదటి నెత్తురుముద్ద పోయిన తరవాత, తొండం నేలపైని ఉంచి ఏనుగు స్థిమితపడుతుంది. ఒక ప్రక్కనుంచి రెండవ ప్రక్కకి చుట్టుకుంటుంది. ఒక్కొక్కప్పుడు ముందరికాళ్లు చాచి, తొండం వాటిమధ్యగా ఉంచుకుని, పిండం వెనుకకి తోసుకుపోయేటట్టు పండుకుంటుంది; మలం విసర్జిస్తున్న కుక్కలాగ ముందరికాళ్ల మధ్య తొండం ఉంచుకొని, బరువంతా వెనుకకాళ్లపై ఆనిస్తుంది. ఈనుతూన్నప్పుడు ఏనుగు ఒరిగి పడుకొని ఉండడం తరుచుగా కానవస్తుంది. పిల్లలు అక్రమంగా పుట్టడం వల్ల ప్రాణ నష్టం సంభవించడం అరుదుకాదు.

పిల్లకి తల, ముందుకాళ్లు ముందుగా బైటకి వస్తాయి. ఆ తరవాత పిల్ల నేలని పడిపోతుంది. అలాపడ్డప్పుడు బొడ్డుతాడు దానంతట అదే తెగిపోతుంది. అలాగ తెగక పోతే, తల్లి, పాదాలతో మెట్టి తెంపివేస్తుంది.

ఏనుగు పిల్లకి ఒంటినిండా బొచ్చు ఉంటుంది. సర్వసామాన్యంగా పిల్ల ఏనుగులకి ఉండే లక్షణం యిది. ఎదుగుతూన్నకొద్దీ వెంట్రుకలు రాలిపోతాయి. ఏనుగు పిల్ల పుట్టగానే మలవిసర్జనచేసి, ఉండిఉండి చెవులూ, తొండం కదిలిస్తూ, ఒకగంట, రెండు గంటలసేపు పడుకొని ఉంటుంది. ఆ తరవాత అదే లేచి నిలబడి నడుస్తుంది.

ఈనిన పిమ్మట మావి పడేముందు ఒకగంట రెండుగంటలసేపు నొప్పులు కలుగుతాయి. తరవాత ఒకటిరెండు గంటలలో మావి పడిపోతుంది; వెంబడే అధికంగా రక్తస్రావం కలుగుతుంది. రక్తపు ముద్దలుకూడా పడతాయి. మావి పడిన వెంటనే తల్లి ఏనుగు దానిని తినేస్తుంది.

కొత్తగాపుట్టిన ఏనుగుపిల్ల 100 కిలోగ్రాముల బరువు ఉంటుంది. అంటే, పిల్ల బరువు తల్లి బరువులో మూడు లేక నాలుగు శాతం ఉంటుందన్నమాట. మిగతా జంతువుల విషయంలో పిల్ల బరువు తల్లి బరువులో ఎంత ఉంటుందో, దానితో యీ శాతం పోల్చిచూస్తే, ఏనుగుపిల్ల బరువు చాలా తక్కువ. మనుష్యులలో పిల్ల బరువు తల్లి బరువులో ఆరు లేక ఏడు శాతం ఉంటుంది. కొత్తగా పుట్టిన ఏనుగు పిల్ల, భుజాల దగ్గర 90 సెంటిమీటర్ల ఎత్తు ఉంటుంది.

ఏనుగు పిల్ల నోటితో పాలు తాగుతుంది. అతిశీఘ్రంగా అది ఉల్లాసంగానూ చురుకుగానూ తయారవుతుంది. ఆదిలో పిల్ల చాలా వేగంగా ఎదుగుతుంది. కొద్ది రోజులయ్యేసరికి తల్లితోకూడా కొద్దిదూరం చక్కగా నడవగలుగుతుంది. అడవి ఏనుగుల విషయంలో, పిల్ల తల్లితో కలిసి నడవగలిగేదాకా, సుమారు 48 గంటలు మందలోని ఏనుగులు ఆ చుట్టపక్కలే ఉంటాయి.

ఆడ ఏనుగుకి తన పిల్ల యందు వాత్సల్యం ఎక్కువ.. పరాయిపిల్లకి అది ఎప్పుడూ పాలివ్వదు. పిల్లలు దాపున ఉన్నప్పుడు ఏనుగు లొంగిరాదు. పిల్ల 2, 3 ఏళ్ల వరకు తల్లి దగ్గిర పాలు తాగుతుంది. బందీచేసి ఉన్న ఏనుగుల విషయంలో, పిల్లకు సుమారు $1\frac{1}{2}$ ఏళ్లు రాగానే మానిపిస్తారు.

## ఏనుగు పాలు

ఏనుగు పాలకి ఒక విధమైన రుచీ, వాసనా ఉంటాయి. ఈ పాలలో సగటున 9.10 శాతం క్రొవ్వు పదార్థాలు, 2.51 శాతం మాంసకృత్తులు, 8.59 శాతం చక్కెర, 0.60 శాతం ఖనిజాలు, 79.30 శాతం నీరు ఉంటాయి. ఆవుపాలతో పోల్చిచూస్తే, ఈ పాలల్లో సుమారు 8 శాతం ఘనపదార్థాలు, 4 శాతానికిపైగా కొవ్వుపదార్థాలు ఎక్కువ.

పిల్ల ఏనుగులు చాలా నెలలవరకు కేవలం పాలమీదనే బతుకుతాయి. గడ్డితినడం ఆరంభించిన తరవాతకూడా కొంతకాలం, అవి పాలుతాగుతూనే ఉంటాయి. (ఏనుగు పొదుగుకి రెండు గ్రంథులుంటాయి. పొదుగు ఏనుగు వక్షస్థలంపైన, ముందరికాళ్ల తరవాత ఉంటుంది. చూలున్న చివరిభాగంలో పొదుగు చాలా పెద్దది అయి, ఈనడానికి ముందుగానే ఒక్కొక్కప్పుడు అందులోంచి పాలుకారతాయి.

## ఏనుగులకి మేత

ఏనుగు అవిరామంగా అలా మేస్తూనే ఉంటుంది. పూర్తిగా పొట్ట నిండినప్పటికీ కూడా, మేత కంటపడితే చాలు ; అది మేస్తూనే ఉంటుంది. అడవి ఏనుగులకి 24 గంటలలో చాలాభాగం ఏదోఒకటి నములుతూ ఉండడం అలవాటు.

ఏనుగు తొండంతో మేత నోటిలో పెట్టుకుంటుంది. మిగతా శాకాహారులలాగ కాకుండా, ఏనుగుపొట్ట ఒక పెద్ద సంచిలాగ ఉంటుంది. దాని పొడవు ఒక మీటరు. ఏనుగు యొక్క మొత్తం పొడవు 30 మీటర్లు. ఏనుగు యొక్క బ్రహ్మాండమైన శరీర పరిమాణంబట్టి చూస్తే, యీ పేగు చాలా చిన్నది. గుర్రానికి, కంచరగాడిదకీ కూడా యీ మాత్రం పేగు ఉంటుంది మరి.

మేత ఈ పేగుగుండా కాస్త త్వరగానే వెళుతుంది. ఇలాగ జరగడానికి, ఏనుగు నెమరువేసే జంతువు కాకపోవడం ఒక కారణం. పేగులో ఆహారం 24 గంటలదాకా ఉంటుంది.

ఈ పేగు, ఏనుగు శరీరభారంలో పది శాతం ఉంటుంది. ఆబోతు పేగు భారం, దాని శరీరభారంలో 40 శాతం ఉంటుంది. అంటే, శరీరభారంలో పేగుల బరువు తులనాత్మకంగా పోల్చిచూస్తే, ఆబోతువంటి నెమరువేసే పెద్దజాతి పశువుల పేగుకన్నా, ఏనుగు పేగు తక్కువ. రోజుకి మొత్తంమీద ఏనుగు 110 కిలోగ్రాముల మలవిసర్జన చేస్తుంది. మలవిసర్జన చేసిన ప్రతిసారి అయిదారు లద్దెలు వేస్తుంది. ఇవి ఒక్కొక్కటి 2 కిలోగ్రాముల వరకూ బరువు తూగుతాయి. లద్దెలు, సన్నగా తరిగి ముద్దచేసిన ఎండుగడ్డి ఉండలలాగ కనిపిస్తాయి. తదితర పెంపుడు పశువులకన్నా ఏనుగకి గడ్డి జీర్ణం చేసుకునే శక్తి తక్కువ.

ఏనుగు అపరిమితంగా మూత్రవిసర్జన చేస్తుంది. రోజుకి యాభై లీటర్ల వరకూ మూత్రవిసర్జన చేస్తుంది. మూత్రవిసర్జన ప్రతిసారి అయిదు లీటర్లు ఉంటుంది.

ఏనుగు ముఖ్యంగా అడవిజంతువు, చెట్ల ఆకులూ, లేత వెదురుచిగుళ్లూ, పచ్చిగడ్డీ చాలావరకు దానికి ఆహారం. దాని ఆరోగ్య సౌభాగ్యానికి విచ్చలవిడిగా తిరిగి మెయ్యడం కన్నా వేరొక మార్గం లేదు. పరిస్థితులు అనుకూలించి నప్పుడల్లా, ఏనుగులని బయటకి తీసుకువెళ్లి, విరివిగా తిరిగి వాటిమేత అవే ఎంచుకు తినేటట్టు చెయ్యాలి. కాని, బురదగా ఉన్న ప్రదేశాలలోనూ, వరదలు వచ్చి మునిగిపోయిన జాగాల్లోనూ మేతకి వదలకూడదు.

ఏనుగు మేత విషయంలో, అది మెయ్యడానికి పుష్కలంగా ఉండేటట్టూ, ఆ మేత తాజాగానూ, రుచికరంగానూ, ఏనుగకి యిష్టమైనదిగానూ ఉండేటట్టూ చూసుకోవాలి ; ఏనుగు చాలా సున్నితమైన జంతువు ;

దానిముందు ఏది పెడితే అది తినదు. సాధ్యమైనంతవరకు మేత మంచిది అవడమే కాకుండా, రకరకాల మేతలు పెట్టడం మంచిది.

పచ్చిగడ్డి రకాలుకాక, ఏనుగు, రావిచెట్టు, మఱ్రిచెట్టు, పనసచెట్టు మొదలైన చెట్ల కొమ్మలూ, ఆకులూ, వెదురుచిగుళ్లూ లేత ఆకులూ, కొబ్బరి మొదలైనవీ తింటుంది. చెరుకు గడలూ, అరటి ఆకులూ, బోదెలూ, పుచ్చ, మారేడు, పనస, అనాస, తాటి, కొబ్బరి మొదలైన ఫలజాతులూ అంటే ఏనుగకి ప్రీతి.

ఏనుగుకి పెట్టవలసిన మేతల పరిమాణం. దానికి నిత్యమూ పెట్టే మేతనిబట్టి ఉంటుంది. ఏనుగుకు, అది తినగలిగినంత పచ్చిమేత లభింప జెయ్యాలి. ఇరవై నాలుగు గంటలలో ఎంతతిని అరిగించుకోగలుగుతుందో, దాన్నిబట్టి మేత పరిమాణం నిర్ణయించాలి. సాధారణంగా రోజుకి 160, 180 కిలోగ్రాముల అప్పుడే కోసిన పచ్చిగడ్డి గాని, యితర రకములైన మేతగాని సరిపోతుంది.

బందీలో ఉన్న ఏనుగులకు, ముఖ్యంగా పనిచేసేవాటికి, మామూలుగా పెట్టే గడ్డి వగైరా మేతలే కాకుండా, కొంత పౌష్టికమైన మేతకూడా అదనంగా పెట్టాలి. బియ్యం, ధాన్యం, ముతకగా విసిరిన గోధుమపిండి, సామాన్యంగా పౌష్టికమైన మేతలకు ఉపకరిస్తాయి. బియ్యం లేక ధాన్యం దంపిపెడితే సులభంగా జీర్ణం అవుతుంది. గోధుమ పిండితో చపాతీలు చేసిపెడతారు. చపాతీలు తియ్యగా ఉండడానికి బెల్లం చేరుస్తారు ; ఉడికించిన ఉల్లిపాయలూ, చింతపండు మగ్గూకూడా – ముఖ్యంగా వేసవి కాలంలో చేరుస్తారు.

మిలిటరీలో, ఉత్తర్వుల ప్రకారం పనిచేసే మధ్యమ పరిమాణంలో ఉన్న ఏనుగులకి, రోజుకి 68 కిలోగ్రాముల ధాన్యం, 80 కిలోగ్రాముల ఎండుమేతలు, 180 కిలోగ్రాముల పచ్చిమేతలూ పెడతారు. ఇదిగాక రోజుకి 56 గ్రాముల చొప్పున ఉప్పు, 28 గ్రాముల నూనె అదనంగా పెడతారు. పెద్ద పరిమాణంలో ఉన్న ఏనుగలకి 90 కిలోగ్రాముల ఎండుమేత, 215 కిలోగ్రాముల పచ్చిమేత పెడతారు.

జంతుప్రదర్శనశాలలో ఉండే ఏనుగులకి జొన్న చొప్ప, ఓట్సు మొక్కలూ చేరిన పచ్చిమేత 100 కిలోగ్రాములు, 75 కిలోగ్రాములు మఱ్రి, వేప మొదలైన చెట్ల ఆకులూ, కాలాన్నిబట్టి, 1 కిలోగ్రాము క్యారట్టు దుంపలూ

పెడతారు. ఇవిగాక, అదనంగా రోజుకి 5 కిలోగ్రాములు గోధుమ పిండి చపాతీరూపంలోనూ, 2 కిలోగ్రాముల బెల్లం, 100 గ్రాములు ఉప్పు, 100 గ్రాములు వేరుసెనగనూనె యిస్తారు.

పనిచేస్తూన్నప్పుడు తప్ప, మిగతా అన్నివేళలయందు, ఏనుగులని మేత మెయ్యనియ్యాలి. పనిచేసేముందు, పనిముగిసిన వెనుక, తాజామేత పెట్టడానికి అతి ఉచితమైన కాలం. పర్కుసు ఏనుగులకి రోజుకి అయిదుసార్లకి పైగా మేత పెడతారు. మామూలు మేత పెట్టిన తరవాత పౌష్టికపు మేత పెట్టడం శ్రేష్ఠం.

## ఏనుగులకి నీరు

ఏనుగు ఆరోగ్యంగా ఉండడానికి పరిశుభ్రమైన మంచినీరు ఎక్కువగా కావాలి. పూర్తిగా ఎదిగిన ఏనుగు, నీరు త్రాగినప్పుడు ప్రతీసారి సుమారు 70 లీటర్లు తాగుతుంది; రోజుకి 190 లీటర్ల వరకూ తాగుతుంది. నీరు తొండంతో పీల్చుకుని గొంతుకలో పోసుకుంటుంది. నీరుతాగే యీ ప్రక్రియ, అనగా నీరు తొండంనిండా పీల్చుకోవడం, ఆ తొండం నోటిలో జొనుపుకోవడం, తొండంలోని నీళ్లు గొంతుకలో పోసుకోవడం, అంతా కూడా సుమారు 4 సెకండ్లలో జరిగిపోతుంది.

ఉదయం, సాయంకాలపు వేళలలో స్నానం చెయ్యడానికి వెళ్లినప్పుడు సాధారణంగా ఏనుగు నీరు తాగుతుంది. సాన్నం చేసేచోట ఉండేది నిలవనీరయితే, ఏనుగు స్నానానికి వెళ్లేముందే ఇంకొక శుభ్రమైన జాగాలోంచి నీరుపెట్టాలి. వడిగా ప్రవహించే నదులలోని నీటికంటె, నెమ్మదిగా పారే ఉపనదులు, ఏర్లు, వాగులు మొదలైన వాటినుంచి నీరు తాగడం ఏనుగులకి ప్రీతి. ఇటువంటి నీరు లభ్యం కానప్పుడు చలమలలో ఊరిన నీరుగాని, నూతి నీరుగాని పెట్టడం శ్రేష్ఠం. పశువులని కడగడానికి ఉపయోగించే చెరువులు, గుంటలలో నీళ్లు ఏనుగుకి ఎప్పుడూ పెట్టకూడదు. ఏనుగుకి రోజుకి ముమ్మారు, కనీసం రెండుసార్లు నీరు పెట్టాలి. మేత పెట్టడానికి ఒక గంట ముందుగా నీరు పెట్టాలి. వేసవికాలంలో దారిలో మంచినీటి సదుపాయం చూసుకుని ఏనుగని బయటకి తీసుకువెళ్లాలి.

## ఏనుగుల ఆలన, పాలన

సామాన్యంగా ఏనుగులు సాధుజంతువులు, వాటికి తర్ఫీదు యివ్వడం లోను, పెంచడంలోనూ ఏమీ కష్టం ఉండదు. విపరీతపు పరిమాణంలో ఉన్న జంతువు అయినప్పటికీ, ఏనుగులు చురుకుదనం, విధేయత ఆశ్చర్యం కలిగిస్తాయి. మనిషికి ఉపయోగపడే యోగ్యత వాటిలో విశేషంగా ఉంది. కాని అవి సులువుగా బెదిరిపోయి, ఉద్రేకం చెందుతాయి. ప్రత్యక్షమైనది ఏ కారణం లేకుండానే అవి భీతాహం చెందుతాయి. ఈ కంగారువల్ల, యుద్ధసమయంలో ఏనుగులు, శత్రుసేనలకంటె తమ సేనలలోవారికే, కాలితో మట్టి, ఎక్కువగా హాని కలగజేసేయి. ఏనుగుని సంబాళించడంలో మిక్కిలి జాగ్రత్తగా వ్యవహరించాలి.

ఏనుగు పెద్ద జంతువయినప్పటికీ, మనం అనుకునేటంత సహనశక్తి దానికి లేదు. దాని తత్త్వం చాలా సున్నితం అయినది. బందీలో పుట్టిపెరిగే తదితర పెంపుడు జంతువులలాగ కాకుండా, ఏనుగు, పట్టుబడేముందు, చాలా ఏళ్లు సహజమైన వాతావరణంలో విచ్చలవిడిగా జీవిస్తుంది. దాని సహజ పరిస్థితులకి భిన్నమైన పరిస్థితులలో దానిచేత పనిచేయించవలసి ఉంటుం దన్నమాట. అంచేత ఏనుగుల విషయంలో చాలా శ్రద్ధ, జాగ్రత్త అవసరం. ఏమాత్రం ఉపేక్ష చూపించినా, అమూల్యమైన జంతువు కొరగాకుండాపోతుంది.

ఒక్కొక్క ఏనుగు శరీరతత్త్వాన్నిబట్టీ, అది చేసే పనినిబట్టీ, ఏనుగు అంత పని చెయ్యగలదో నిర్ణయించవలసి ఉంటుంది. సాధారణంగా, వేసవికాలంలో ఉదయం పది గంటలు మొదలు మధ్యాహ్నం మూడుగంటల వరకూ ఆరుబయట ఏనుగులచేత పనిచేయించకూడదు. వీలైనప్పుడు, ఏనుగుకి అనవసర శ్రమ తప్పించడానికి, బళ్ల మీద బరువులు వేసి లాగించడం మంచిది.

స్వతహాగా ఏనుగు బరువులు మోపే జంతువు. అది ఎంత బరువు మొయ్యగలదు అన్న విషయం గురించి అభిప్రాయభేదాలున్నాయి. ఏనుగు మొయ్యగలిగిన గరిష్ఠ పరిమాణపు బరువు 450 కిలోగ్రాములు మొదలు 550 కిలోగ్రాముల వరకూ ఉంటుంది.

ఏనుగు పని పూర్తిఅయిన తరవాత, రాపిడివల్ల దాని శరీరంపై గాయాలుపడే భాగాలన్నీ జాగ్రత్తగా పరిశీలించాలి. అది బరువుమ గనక మోసి ఉంటే, దాని వీపు మాలీసు చెయ్యాలి. తొండానికీ, పాదాలకీ ఎక్కడైనా దెబ్బలే తగిలేయో, లేకపోతే ముళ్లూ అవి గ్రుచ్చుకుని ఉండిపోయేయోమోనని జాగ్రత్తగా చూడాలి.

ఏనుగుని తోలడం నేర్పుతో కూడినపని. మంచి మావటీడు అనిపించుకున్న వాడు ఏనుగును కేకలువేసి గదమాయించడు ; అనవసరంగా అంకుశమూ ఉపయోగించడు, ఇదేమీ అక్కర్లేకుండా, నోటిమాటతో ఆజ్ఞాపించి, తన కాళ్ల పాదాలతో దాన్ని అనుగుణంగా తిప్పుకుంటాడు.

ఏనుగులకి సూటిగా పడే ఎండ పనికిరాదు. అలాగ సూటిగా పడే ఎండలో వాటిచేత పని చేయించరాదు. అలా పనిచేయిస్తే వాటికి ఎండదెబ్బ తగులుతుంది. ఎండలో పనిచేసేటప్పుడు ఏనుగులకి మెడకీ, తలకీ ఎండ తగలకుండా రక్షణ యివ్వాలి. వానలో తడిసినా, నీరు పోయే సదుపాయం బాగా ఉంటే అంత ఫరవాలేదు ; కాని చలి గాలి సోకితే మాత్రం ఏనుగు ఆరోగ్యం భంగపడుతుంది.

విశ్రాంతి, నిద్దుర ఏనుగ ఆరోగ్యానికి ముఖ్యంగా అవసరం. పనిచేసివచ్చిన తరవాత వెంటనే మేతపెట్టకుండా, మేతకోసం దాన్ని వేచిఉంచడం మంచిదికాదు. సరుర్రాత్రి అయ్యేలోపుగా దానికి తగినంత మేతపెట్టకపోతే, నిద్రలేకుండా రాత్రి అంతా అది అలాగ తింటూనే ఉంటుంది.

పనిలేని ఏనుగులకి రోజూ వ్యాయామం విధిగా కల్పించాలి. కొన్నిటివిషయంలో మేతకోసం నడిపిస్తే చాలును. ప్రొద్దుట ఒక గంట, సాయంకాలం ఒక గంట ఏనుగని నడిపించడం ఉత్తమమైన పద్ధతి.

సాధారణంగా ఏనుగులని "షెడ్డు"లనే గోతులలో పడేటట్టుచేసి, పట్టుకుని, తప్పించుకోలేకుండా కొయ్యలతో కట్టిన ఆవరణలలో బంధిస్తారు.

## ఏనుగు సాలలు

సహజంగా నీడగా ఉండే జాగాలు లేకపోయినప్పుడు ఏనుగులని కట్టడానికి సాలలు అవసరం. ఏనుగులు ఉండడానికి ఉత్తమమైన తావు నీడనిచ్చే చెట్లుండి, మురికి నీరు పోవడానికి సదుపాయంగా ఉన్న ప్రదేశం, ఏనుగులు నిలుచోడానికి తగినంత స్థలం యీ ప్రదేశంలో ఉండాలి ; అందులో ఏనుగులని ఒకచోటనుంచి మరొకచోటుకి మారుస్తూ ఉండాలి. కలప దొడ్లలో పనిచేసే ఏనుగులకి సాలలు అవసరం. అవి నీడగా ఉండే తావులలో, మురికి నీరు పోవడానికి తగిన సదుపాయాలు గలిగిఉండాలి. వాటి నేల, పరిసరాలకంటె ఎత్తుగా కాంక్రీటుతోగాని, బొంత రాయితోగాని గట్టిచేయబడి, ఏటవాలుగా ఉండాలి. బల్లచెక్కలు పరిచి ఉంచిననేల అంత శ్రేష్ఠమైనది

కాదు; ఎంచేతనంటే, మూత్రవిసర్జనవల్ల ఆ బల్ల చెక్కలనేల అసహ్యంగా తయారేవుతుంది.

ఏనుగులని ఒక తావు నుంచి వేరొక తావుకి తీసుకువెళ్లేటప్పుడు, మార్గమధ్యంలో విరామం కోసం ఆగినప్పుడు, ఆ ఆగేచోటు ఏటవాలుగా ఉండేటట్టు చూచుకోవడం ముఖ్యం. ఎత్తుగా ఉన్నవైపు ఏనుగు తల ఉండాలి. అలాగకాకుండా పల్లంగాఉన్న వైపుకి ముఖం ఉంటే, అది పడుకుంటే తిరిగి లేచేట ప్పుడు ఎంతో ఇబ్బంది పడుతుంది. ఏనుగులు నిలబడే తావులు సమతలంగానూ, రాళ్లూ, చెట్ల దుబ్బులూ అవీ లేకుండానూ ఉండాలి.

## స్నానం

ఏనుగులు ఆరోగ్యంగా ఉండడానికి, క్రమబద్ధంగా స్నానం చేయించడం అతిముఖ్యం. జంతువులన్నింటిలోకీ ఏనుగుకు నీరంటే ఎంతో సరదా. అడవిలో ఉండే ఏనుగులు ప్రతీరోజూ కొండయేళ్లకీ, పెద్దనదులకీ కూడా పోయి నీళ్లు పోసుకుంటాయి. ఏనుగులు చక్కగా యీదగలవు. వాటి శరీరం అంతా నీటిలో మునిగి ఉన్నా, తొండపు కొన మాత్రం నీటిపైకి పెట్టి ఏమాత్రం యిబ్బందిలేకుండా ఇవి గాలి పీల్చుకుంటాయి.

ఏనుగు స్నానానికి నీరు లోతుగా ఉండాలి. కనీసం అది మోకాళ్లు వంచి కూచుంటే, శరీరం అంతా నీటిలో మునిగిపోయేటట్టుగా ఉండాలి. స్నానానికి సదుపాయంలేని తావులలో ఎప్పుడూ ఏనుగులని ఉంచకూడదు. పొద్దు పొడవగానే ఉదయమందు, సూర్యాస్తమయపు వేళకి సాయంకాలమందు, వాటిని స్నానానికి తీసుకు వెళ్లడం మంచిది. స్నానం చేస్తూన్నప్పుడు, వాటి శరీరాన్ని కొబ్బరిపీచుతోగాని, మెత్తటి రాయితోగాని బాగా తోమాలి.

## ఏనుగులలో జబ్బు లక్షణాలు

సక్రమమైన జాగ్రత్త, శ్రద్ధా తీసుకుంటే ఏనుగులు సామాన్యంగా జబ్బుపడవు. కాని జబ్బుపడితే మాత్రం వాటికి చిరాకు ఎక్కువగా ఉంటుంది. వాటి ప్రాణాధారక పద్ధతులు నెమ్మదిగా పనిచెయ్యడంచేత, జబ్బుచేస్తే తిరిగీ పూర్వపు స్థితి పొందడానికి చాలాకాలం తీసుకుంటుంది.

మామూలుగా ఏనుగు శరీరపు ఉష్ణత 36.3 మొదలు 36.6 డిగ్రీలు సెంటిగ్రేడు (97.4 మొదలు 98 డిగ్రీలు ఎఫ్) ఏనుగ ఉష్ణత 37.8 డిగ్రీలు సెంటిగ్రేడు (100 డిగ్రీలు ఎఫ్) ఉన్నది అంటే, దానికి బాగా జ్వరం వచ్చింది అన్నమాట. ఉష్ణం రెండు మూడు డిగ్రీలు (సెంటిగ్రేడ) ఎక్కువయిందంటే ప్రమాదకరం.

ఏనుగుల జ్వరం, థర్మామీటరు గుదస్థానంలో ఉంచి తెలుసుకోవచ్చును. సామాన్యంగా మామూలు థర్మామీటరే వాడవచ్చును. కాని దాన్ని గుద స్థానంలో బాగా లోనికి జొనిపి పెట్టి కనీసం ఒక నిమిషం అయినా ఉంచాలి. ప్రత్యేకించి ఏనుగుల కోసం ఉద్దేశించబడిన థర్మామీటర్లు కూడా ఉన్నాయి.

మామూలుగా ఏనుగు శ్వాసరేటు, అది నిలబడిఉన్నప్పుడు, నిమిషానికి పది, శాంతంగా పడుకున్నప్పుడు నాలుగు లేక అయిదు ఉంటుంది. నాడిరేటు, నిలుచున్నప్పుడు నిమిషానికి 28, పడుకొని ఉన్నప్పుడు 35.

ఏనుగు జబ్బుపడ్డదని తెలిపే మొట్టమొదట చిన్నె ఏమిటి అంటే, అది ఆరోగ్యంగా ఉన్నప్పుడు తొండం, చెవులు, కాళ్లు, శరీరం కదిలిస్తూ ఉంటుంది. కాని జబ్బు పడినప్పుడు యీ కదలిక ఉండదు. జంతువు మందంగా ఉన్నట్టు అవుపిస్తుంది. ఆకలి మందగించడంకాని, నశించడంకాని కలుగుతుంది. జ్వరం వస్తుంది. నోరు ఎండిపోవడం, మలబద్ధం, మూత్రం గాఢమైన రంగులో తక్కువగా అవడం, కళ్లు నీరుపట్టి ఎర్రగా ఉండడం, నాడిరేటు ఎక్కువకావడం, జంతువు నిరుత్సాహంగా ఉండడం - యివి జబ్బు వచ్చినట్టు తెలిపే తదితర లక్షణాలు.

## వ్యాధి నిరోధక మార్గాలు

జబ్బుపడ్డ లక్షణాలు కనిపించగానే ఏనుగుకి కావలసినంత విశ్రాంతినివ్వాలి. వేసవి కాలం అయితే, నీడగాఉన్న ప్రదేశంలో దాన్ని ఉంచాలి. వానాకాలం అయితే, వర్షంలో తడిసిపోకుండాను, చలిగాలి తగలకుండాను, దానికి రక్షణ యివ్వాలి. కాయధాన్యపు మేతలు పెట్టడం మానెయ్యాలి. ముతకగా ఉన్న ఎండుమేతలు కూడా పెట్టకూడదు. సాధ్యమైనంతమట్టుకు, అప్పుడే కోసిన మేతలు పెట్టాలి. కావలసినంతగా నీరు పెట్టాలి. నీటికోసం ఏనుగని ఎక్కువ దూరం నడిపించకూడదు.

అంటువ్యాధి గనక సోకితే, దాన్ని, ఆరోగ్యంగా ఉన్న వాటినుంచి వేరుపరచి, ఇంకొక తావులో ఉంచాలి. పరిసరాలు క్రిమిసంహారక మందులతో శుభ్రపరచాలి. జబ్బుపడిన ఏనుగుకోసం వినియోగించే పాత్రలు, సామాను మరుగునీటిలో ఉంచి శుభ్రపరచాలి. వ్యాధిసోకిన ఏనుగువద్దనున్న చెత్త అంతా తగులబెట్టించాలి. అంటువ్యాధి వలన చనిపోయిన జంతుకళేబరాలని లోతుగా పూడ్చిపెట్టాలి.

## ఏనుగులకి సామాన్యంగా వచ్చే వ్యాధులు

దొమ్మ అన్నది ఏనుగులకి సామాన్యంగా వచ్చే అంటువ్యాధి. ఇది సామాన్యంగా వర్షాకాలంలో వస్తుంది. వచ్చిరావడంతోటే తీవ్రంగానూ, ఉధృతంగానూ పరిణమిస్తుంది. ఈ జబ్బు లక్షణాలు ; జ్వరం రావడం, ముక్కు పొరలనుంచి నెత్తురు కారడం.

వ్యాధి నిరోధక మార్గాలు : జబ్బుపడ్డ జంతువుని వెంటనే వేరుపరచాలి. ఆ జాగా అంతా క్రిమినాశక మందులతో శుభ్రపరచాలి. వ్యాధిసోకిన జంతువువద్ద ఉండే చెత్త అంతా తగులబెట్టించాలి. చనిపోయిన జంతువుని కొయ్యకుండా లోతుగా పాతిపెట్టించాలి.

గొంతుకవాపు తీవ్రమైన అంటువ్యాధి. వర్షాకాలం ఆరంభంలో కాని, చివరలో కాని ఇది ఎక్కువగా వ్యాపిస్తుంది. ఆకలి పూర్తిగా నశించడం, నోరు సాధారణంగా తెరచి ఉంచడం, తొండం ముడుచుకుపోయి ఉండడం, తీవ్రమయిన జ్వరం, తల, మెడ, భుజాలు, దవడలమధ్య వాపులు–యీ జబ్బు లక్షణాలు, విరేచనాలు కూడా ఎక్కువగా వెళ్లవచ్చును. మూత్రం గాఢమైన రంగులో తక్కువగానూ అస్వచ్ఛంగానూ ఉంటుంది.

మామూలుగా తీసుకునే వ్యాధినిరోధకచర్యలు తప్ప, వైద్యచికిత్సలవల్ల అట్టే ప్రయోజనం ఉండదు.

త్రిపనసోమియారిన్ లేక ఏనుగు సుర్రా అన్న జబ్బు వస్తే, అప్పుడప్పుడు జ్వరం తగులుతూ ఉండడం, ఒక్కొక్కప్పుడు జ్వరం తిరగబెట్టడం జరుగుతుంది. ఈ వ్యాధి తగిలిన ఏనుగు మందంగా ఉండి, కదలడానికి యిష్టం లేకుండా ఉంటుంది. ముక్కసు పొరలు పాలిపోయి,

లేత పసుపురంగులో ఉండవచ్చును. మూత్రం బాగా ఆకుపచ్చ రంగులో ఉండి, తక్కువగా అవుతుంది. క్రమేణా జంతువు నిస్సత్తువ అయిపోతుంది.

గాళ్లు ఏనుగుల పాదాలకు, నోటికీకూడా జబ్బులు వస్తాయి. గొంతునొప్పి, జ్వరంరావడం, మేత పూర్తిగా మానివెయ్యడం, నాలుకపైనా, చెక్కిళ్లమీదా, తొండం యొక్క మ్యూకసు పొరలపైనా బొబ్బలు లేవడం యీ జబ్బు లక్షణాలు. జంతువు సమంగా మేత మెయ్యలేని కారణంవల్ల, క్రమేణా చిక్కిపోతుంది. పాదాలకు వ్యాధి సంక్రమిస్తే, అవి వాచి, మెత్తగా అయిపోయి, ఏనుగు కుంటుతుంది.

ఇది అంటువ్యాధి. శుచిగా ఆరోగ్యప్రదంగా వుంచాలి. జంతువునోరు, పాదాలు రోజుకి మూడునాలుగుసార్లు వగరులోషనుతో కడగాలి. ఈ వ్యాధి వల్ల ప్రాణహాని లేదు; కాని వెంటనే తగుచర్య తీసుకోకపోతే ఏనుగువల్ల కావలసిన పనులకి ఆటంకాలు కలుగుతాయి.

ఏనుగులకి వచ్చే మశూచి : మనుష్యులకులాగే ఏనుగులకి పొక్కులు లేస్తాయి. జ్వరం కాస్తుంది. జంతువు నీరసంగానూ, విశ్రాంతిలేకుండానూ ఉంటుంది. పొక్కులు మొటిమలలాగ అయి, అవి ద్రవంతోనిండిన బొబ్బలుగా మారి, చివరకి అవి పగిలి కురుపులు లేస్తాయి. అవి పొక్కులు కడతాయి.

ఇది చాలా తీవ్రమైన అంటువ్యాధి. ఇది సోకిన జంతువును వేరుపరచి, పరిసరాలు క్రిమిసంహారక మందులతో శుభ్రపరచాలి.

రేబీస్ వెర్రికుక్కకాటువల్ల వచ్చే జబ్బు ; గుంటనక్కలూ, తోడేళ్ల వల్ల కూడా ఇది సంక్రమించవచ్చును. బొత్తిగా విశ్రాంతి లేకుండా ఉండడం, వణకు, మూర్ఛ, విడివడిపోవడానికి ప్రయత్నం - ఇవి వ్యాధి రాగానే కనిపించే లక్షణాలు. ఈ వ్యాధి సోకిన జంతువుకు ఆకలి తక్కువగానూ, నీరు తాగాలన్న వాంఛ ఎక్కువగానూ ఉంటుంది. తరుచుగా కీచుమని అరుస్తుంది. అసాధారణమైన ధ్వనులు చేస్తుంది. దౌర్జన్యంగా తయారవుతుంది.

మనుష్యులు నివసించే తావునుంచి, వ్యాధిసోకిన జంతువుని దూరంగా ఉన్న ప్రదేశానికి తీసుకుపోయి ఉంచాలి. దౌర్జన్యం ప్రబలిపోయే పరిస్థితులలో, ఎక్కువగా సంకెళ్లు వేసి, సమయం మించిపోకుండా దాన్ని చంపివెయ్యాలి.

# VIII. కోళ్లు

## ఉపోద్ఘాతం

ప్రస్తుతం కానవస్తూన్న పెంపుడు కోడిజాతి, ఆదిలో భారతదేశం, ఆ దేశపు పరిసరాలనుంచీ వచ్చింది. ఆహారానికీ, వినోదానికీ కూడా కోడి అనాదినుంచీ మానవుణ్ణి ప్రలోభపెట్టింది. క్రీ.పూ. వెయ్యి ఏళ్లకిపైగానే కోడిపందాలు భారతదేశంలో వెలిసేయి.

కోళ్లు, బాతులు, టర్కీకోళ్లు, గిన్నీకోళ్లు మొదలైన అనేకరకాలయిన పెంపుడు పక్షులకి సమూహ నామం "పౌల్ట్రీ". ఈ పక్షులు అన్నింటిలోకీ, భారతదేశంలో, పెంపుడు కోడి అతిముఖ్యమైనది.

భారతదేశపు గ్రామీణ ఆర్థికసంపదకు కోళ్ల పెంపకం చాలా ముఖ్యం. వ్యవసాయ దారుడికి కోళ్ల పెంపకంవల్ల సులభంగా రాబడి చేకూరుతుంది. మాంసం, గ్రుడ్లు మాత్రమే కాకుండా, పౌల్ట్రీ పక్షులవల్ల ఈకలూ, మంచి ఎరువుకూడా లభిస్తాయి. కోళ్ల పెంపకానికై మొదలుపెట్టే పెట్టుబడీ, తరవాత వాటిని పెంచడానికయ్యే ఖర్చూ కూడా సామాన్యపు కృషీవలుడు సైతం భరించగలిగినంత తక్కువగా ఉంటాయి.

ఆహారంలో పోషకస్థాయి తక్కువగా ఉన్న భారతదేశంలో ఆ స్థాయిని పెంపొందించడానికి పౌల్ట్రీ పక్షుల పెంపకం ఎంత ముఖ్యమో ప్రత్యేకించి నొక్కి వక్కాణించ నక్కరలేదు. కోళ్లు, బాతులు మొదలైన వాటి గుడ్లు, మాంసంవల్ల ప్రొటీన్లు విటమిన్లు సమృద్ధిగా లభిస్తాయి. ఈ రెండు అంశాలలోనూ కూడా సగటున భారతదేశపు ఆహారం చాలా కొరతపడిఉంది. అంచేత, మాంసకృత్తులు అధికంగా గల ఆహార ఉత్పత్తి, చాలా తక్కువ పెట్టుబడితో అతిత్వరగా దేశంలో జరగడానికి కోళ్ల పెంపకం ప్రశస్తమైనది.

## భారతదేశంలో ప్రస్తుతపు పౌల్ట్రీ పరిస్థితి

1966 సం॥ లో పొట్టిబాతులతో సహా 115.45 మి. పెంపుడు పక్షలుండేవి. 1977 లో వీటి సంఖ్య 160.87 మి.కు 1982 లో 209.74 మి. కునూ పెరిగింది. 1991 లో మొత్తం పెంపుడు పక్షల సంఖ్య ప్రకారం మన దేశంలో 380 మిలియన్ పక్షలున్నాయని ఎఫ్.ఎ.ఓ. అంచనావేసింది. మొత్తం ప్రపంచం లోని కోళ్ళ సంఖ్య 11034 మిలియన్లని పేర్కొంది. ప్రపంచంలోగల

దేశాలలో ఎక్కువ కోళ్ళు సంఖ్యగల దేశం చైనా దాదాపు 2077 మిలియన్లు. 1982 సం॥ లోని కోళ్ళ సంఖ్య ప్రకారం మన దేశంలో దాదాపు 207.74 మిలియన్ కోళ్ళు ఉన్నాయి. ఈ కోళ్ళసంఖ్య 1977 లో ఉన్న కోళ్ళ కంటే 29.1 శాతం ఎక్కువ. 1982 సం॥ లో 180.5 మి. కోళ్ళున్నాయి. వీటిలో మంచిజాతి కోళ్ళు 41 మిలియన్లని అంచనావేయడ్డది. 1980-81 సం॥ లో దేశంలోని గుడ్ల ఉత్పత్తి 10,000 మి. గుడ్లు. ఇవి 1991 సం॥ లో 20,000 మి. గుడ్లకు పైగా పెరిగింది. 1991 సం॥ లో కోళ్ల మాంసం దాదాపు 3.282 మి.టన్నులుగా ఉన్నదని అంచనా. అయితే మొత్తం దేశంలో దాదాపు 4,29,000 టన్నుల కోళ్ళ పిల్లలు ఉన్నాయి. సంవత్సరపు కోళ్ళ ఉత్పత్తి విలువ దాదాపు రు.15,000 కోట్లని చెప్పబడ్డది.

సగటున భారతదేశపు కోడి ఏడాదికి సుమారు 60 గ్రుడ్లు పెడుతుంది. అమెరికా జాతులు, వైట్‌లెగ్‌హారన్ జాతి కోడి ఏడాదికి 193 న్నూ, ర్హోడ్ అయిలెండ్ రెడ్ జాతి కోడి 212 గ్రుడ్లున్నూ పెడుతుంది. భారతదేశపు కోడిగ్రుడ్డు పరిమాణంలో కూడా చాలా చిన్నది. ర్హోడ్ అయిలెండ్‌రెడ్, బ్లాక్‌మినోర్కా వంటి విదేశ జాతి గ్రుడ్ల పరిమాణంలో, భారతదేశపు కోడిగ్రుడ్డు సగానికన్న కాస్త ఎక్కువగా ఉంటుంది.

ఇంతవరకూ, కోళ్లు మొదలగు పక్షుల పెంపకం, భారతదేశంలో, చాలవరకు, గ్రామీణ, కుటీర ఉద్యమంగానే ఉండిపోయింది. సామాన్యంగా పల్లెటూరి పెట్ట విషయంలో శ్రద్ధ, జాగ్రత్త ఎంత తక్కువగా ఉన్నప్పటికీ వ్యవసాయదారుని సంసారంలో అది ముఖ్యమైన భాగంగానే ఉంటుంది ఇప్పుడు వైజ్ఞానిక పద్ధతిలో పౌల్ట్రీలను పెంచడం జరుగుతూంది.

## పౌల్ట్రీ పక్షులలో ముఖ్యమైన జాతులు

మనదేశంలోగల కోళ్లు చాలవరకు, అనామకంగా ఉన్నవే. దేశవాళీకోడి, ఏ రకపుదైనాసరే, సాధారణంగా దేశీకోడి అనేస్తారు. మేలుజాతి కోళ్లసంఖ్య మనదేశం లో చాలాతక్కువ. దేశంలో మొత్తం కోళ్లలో 5.16 శాతం మాత్రమే శ్రేష్ఠమైనవి.

సాధారణంగా కనిపించే దేశీకోళ్లు రంగులోనూ, పరిమాణంలోనూ, ఆకారంలోనూ ఎంతోవ్యత్యాసం కనిపిస్తుంది. అయితే, వీటికి చక్కటి మాతృ భావం ఉంది ; ఇవి బాగా పొదుగుతాయి ; మేత వెతుక్కుని తినడంలో వీటికి సాటిలేదు. ఇవి దృఢంగా ఉంటాయి. సామాన్యంగా వీటికి వ్యాధి సోకదు.

కాస్త హెచ్చుతగ్గుగా, కేవలం దేశీజాతుల కోళ్లు అనేవి అసీల్, చిట్టాగాంగ్, ఘగుస్ జాతులు.

అసీల్ : దేశవాళీ కోళ్లు అన్నిటిలోకీ ప్రాముఖ్యం అయినది అసీల్ జాతి. పౌరుషానికి దానిది పెట్టింది పేరు. తినడానికి కూడా యిది చాలా యోగ్యంగా ఉంటుంది. సహజమైన మంచి వాసన కలిగి, చక్కటి రుచిగల మాంసం, యీ జాతి కోళ్లవల్ల ఎక్కువగా లభిస్తుంది. కాని యీ జాతిపెట్టలు శీఘ్రంగా ఎదగవు ; వీటికి సంతతి తక్కువ ; అంచేత ఇవి గ్రుడ్లు ఎక్కువగా పెట్టవు.

అసీల్ జాతి కోళ్లు దేశం అంతటా ఉన్నాయి. ఈ జాతిలో ఉత్కృష్టమైన పక్షులు ఆంధ్రప్రదేశ్‌లో హైదరాబాదు ప్రాంతాలలోనూ, ఉత్తరప్రదేశ్‌లో లక్నో-రాంపూర్ జిల్లాలలోనూ కానవస్తాయి.

అసీల్ జాతి కోడి గంభీరంగా ఉండే పెద్ద జాతి పక్షి. దీనికి ఫలానా రంగు అని, నిర్ణీతంగా లేదు. తలమీద ఉండే జట్టు చాలా చిన్నదిగానూ, రకరకాలు గానూ ఉంటుంది. ముఖం కాస్త కోలగా ఉంటుంది. మెడక్రిందనుండే చర్మం (గంగడోలు లాంటిది) కనిపించీ కనిపించనంత చిన్నదిగా ఉంటుంది. దీని చెవి తమ్మెలు చిన్నవి. మెడమీద ఈకలు తక్కువగా ఉంటాయి. ఈకలలో మృదువుగా ఉండే భాగం తక్కువ; యీకలు బిరుసుగా ఉంటాయి. దీని తోక చిన్నదిగా, నేలకు కొద్ది సెంటిమీటర్లలో అంటేలాగ నేలబడి ఉంటుంది ఈ జాతి పుంజాల యొక్క తూకం 4.5 కిలోగ్రాములునేఉన్న పెట్టల యొక్క తూకం 3.5 కిలోగ్రాములున్నూ అని నిర్ణయించబడింది.

చిట్టాగాంగ్ జాతికి ఆ పేరు, ఆ జాతి కోళ్లని చిట్టాగాంగు జిల్లాలో ఎక్కువగా పెంచడం వల్ల వచ్చింది. ఈ జాతి కోళ్లు త్వరగా ఎదుగుతాయి. వీటి మాంసం మిక్కిలి రుచిగా, తినడానికి ప్రశస్తంగా ఉంటుంది.

ఈ పక్షుల యీకలకు ఫలానా రంగు అని నిర్ణీతంగా లేదుగాని పసుపుపచ్చ, లేత పసుపుపచ్చ రంగులలో ఎక్కువగా తరుచుగా ఉంటాయి. వీటికి తలమీద ఉండే జుట్టు, ఏకంగా, పొట్టిగా ఉంటుంది. చెవితమ్మెలు, మెడక్రింది చర్మం చిన్నవిగా, ఎర్రగా ఉంటాయి. మెడ పొడవుగా ఉంటుంది. దాని ఎత్తునిబట్టి చూస్తే శరీరం పొట్టి అనిపిస్తుంది. దీని కాళ్లు పొడవుగానూ, బలిష్ఠంగానూ ఉంటాయి. దీని పిక్కలు పసుపుపచ్చ రంగులో ఉంటాయి ; వాటిమీద యీకలుండవు. గుండె ఎముక మీద ఉండే యీకలు తక్కువ. భుజాల దగ్గిర నుంచి రెక్క ఆరంభించి ఎత్తుగా ఉంటుంది. ఈ జాతి పుంజా

సుమారు 4.5 కిలోగ్రాముల బరువు తూగుతుందనీ, పెట్ట 2-5 మొదలు 4 కిలోగ్రాముల వరకూ తూగుతుందనీ నిర్ణీతం అయింది.

ఘగూస్ : ఇది దృఢంగా ఉండే పెద్దజాతి పక్షి. తినడానికి బాగా పనికివస్తుంది. ఈ జాతి పెట్ట కాస్త ఎక్కువగానే గ్రుడ్లు పెడుతుంది ; గ్రుడ్లని బాగా పొదుగుతుంది ; దీనికి మాతృభావం ఎక్కువ. ఈ జాతికి చెందిన ఉత్కృష్టమైన కోళ్లు ఆంధ్రప్రదేశ్ లోనూ, మైసూరులోనూ ఎరుకలవారూ మొదలైన దిమ్మరి జాతుల వారివద్ద కానవస్తాయి.

ఘగూస్ కోడికి తలమీద జుట్టు ఏకంగా, బటానీకాయ ఆకారంలో ఉంటుంది. మెడక్రింద చర్మం, చెవితమ్మెలు చిన్నవి, దీని మెడ పొదులుగా వేలాడుతూ ఉంటుంది. కాళ్లు కాస్త పొడవుగా, తిన్నగా, బలంగా ఉంటాయి ఈ జాతి పక్షుల యీకలు సాధారణంగా లేత ఎరుపు, గాఢమైన ఎరుపు, మట్టిరంగు, నలుపు, బూడిద రంగుల్లో ఉంటాయి.

భారతదేశపు శీతోష్ణస్థితులకి అనుకూలపడేటట్టు పెంచిన విదేశీ కోళ్లు వైట్‌లెగ్ హారన్, ర్హోడ్‌అయిలెండ్ రెడ్, బ్లాక్‌మినోర్కా జాతులు. ఇవికాక, ప్లిమత్‌రాక్, ఆస్ట్రలోర్ప్, వైట్‌ససెక్స్, న్యూహాంప్‌షైర్, వైట్‌రాక్, వైట్ కార్నిష్ జాతులు కూడా మనదేశంలో ప్రవేశపెట్టేరు. దేశీజాతుల నాణ్యతని పెంపొందించడానికి యీ విదేశీ జాతులు వాడబడుతున్నాయి.

వైట్‌లెగ్‌హారన్ : గ్రుడ్లు ఎక్కువ పెట్టే కోళ్ల జాతులలో ప్రపంచ ప్రసిద్ధి గాంచిందీ జాతి. ఈ జాతికోడి అద్భుతమైన గ్రుడ్లకోడి ; కాని తినడానికి దీనిని ఎక్కువగా ఎన్నిక చెయ్యరు. భారతదేశంలో, ముఖ్యంగా బెట్ట ప్రాంతాలకు వైట్‌లెగ్‌హారన్ జాతి అనువైనది. తేమ ఎక్కువగా ఉన్న ప్రదేశాలలోనూ, కొండ ప్రదేశాలలోనూ ఇది వృద్ధిచెందదు. ఈ జాతి పుంజు యొక్క ప్రామాణికమైన బరువు 2.7 కిలోగ్రాములున్నూ, పెట్ట 2 కిలోగ్రాములున్నూ.

ర్హోడ్‌అయిలెండ్‌రెడ్ అన్ని ఉపయోగాలకి పనికివచ్చే ఉత్తమమైన జాతి. దీనివల్ల లభించే మాంసం కూడా తూకానికీ, నాణ్యతకీ పేరు పొందినది. ఇది చక్కని గ్రుడ్ల జాతి. వీటి గ్రుడ్లు మట్టిరంగులో పెద్ద పరిమాణంలో ఉంటాయి భారతదేశంలో ప్రవేశపెట్టిన విదేశీ జాతులన్నిటిలోకి ర్హోడ్‌అయిలెండ్‌రెడ్ జాతి ఎక్కువగా ప్రజాదరణ పొందింది. కోళ్ల జాతులన్నిటిలోకి ఇది దృఢమైన జాతి. అపరిమితంగా వానలు కురిసి, తేమగా, చల్లగా ఉండే ప్రదేశాలలో, ఎటువంటి ఉత్కటమైన వాతావరణానికీ కూడా యిది తట్టుకోగలదు. ఈ

జాతి పుంజు యొక్క ప్రామాణికమైన బరువు 3.8 కిలోగ్రాములూ, పెట్ట 3 కిలోగ్రాములన్నూ.

బ్లాక్‌మినోర్కా : మధ్యధరా సముద్రప్రాంతపు జాతులన్నిటిలోకి యీ జాతి చాలా పెద్దది. పెద్ద పరిమాణంలో ఉండే తెల్లటి గ్రుడ్లకి యిది పేరు పొందింది. భారతదేశంలో, దీని ఉత్పత్తి పడిపోవడంమూలాన్ని, యీ జాతి అంటే ప్రజాదరణ తగ్గిపోయింది. ఈ జాతి పుంజు ప్రామాణికమైన బరువు 3.6 కిలోగ్రాములూ, పెట్ట 3 కిలోగ్రాములున్నూ.

ప్లిమత్‌రాక్ అన్నది ప్రజాదరణ పొందిన అమెరికాజాతి కోడి. ఈ కోళ్లు మంచి పరిమాణంలో ఉంటాయి. వీటివల్ల బహుశ్రేష్ఠమయిన మాంసం లభిస్తుంది. పెట్టలు గ్రుడ్లు ఎక్కువగా పెడతాయి. భారతదేశంలో యీ జాతి కోళ్లు, దేశీపెట్టల స్థాయి వృద్ధిపరచడానికి వాడబడుతున్నాయి. ఈ జాతి పుంజు యొక్క ప్రామాణికమైన బరువు 4.2 కిలోగ్రాములూ, పెట్ట 3.2 కిలోగ్రాములన్నూ.

ఆస్ట్రలోర్ప్ : ఇది ఎక్కువగా ఆస్ట్రేలియాలో పెంపొందించబడింది. సర్వవిధాలా యిది ఉపయోగిస్తుంది. భారతదేశంలో, ముఖ్యంగా అమిత వర్షాలు పడి తేమగా ఉండే ప్రాంతాలలో, ఈ జాతి త్వరగా ప్రజాదరణ పొందుతోంది. ఈ జాతి పుంజు యొక్క ప్రామాణికమైన బరువు 3.8 కిలోగ్రాములూ, పెట్ట 3 కిలోగ్రాములన్నూ.

వైట్‌సస్సెక్స్ : ఇది ముఖ్యంగా మాంసానికి పేరుపొందిన జాతి ; కాని ఎక్కువగా గ్రుడ్లు పెట్టే పెట్టల్ని కూడా యీ జాతిలో పెంపొందించేరు. ఈ జాతి పుంజు ప్రామాణికమైన బరువు 4 కిలోగ్రాములూ, పెట్ట 3.2 కిలోగ్రాములున్నూ.

న్యూహాంప్‌షైర్ : అమెరికాలో ఇటీవలికాలంలో పెంపొందించబడిన కొత్తజాతి యిది. భారతదేశంలోకి ఇప్పుడిప్పుడే ప్రవేశపెట్టబడింది. దృఢత్వానికి యిది పేరు మోసింది. ఈ జాతి పెట్టలు మట్టిరంగులో ఉన్న గ్రుడ్లు ఎక్కువగా పెడతాయి. ఈ జాతి పుంజు ప్రామాణికమైన బరువు 3.8 కిలోగ్రాములూ, పెట్ట 2.7 కిలో గ్రాములున్నూ.

వైట్‌రాక్, వైట్‌కార్నిష్ : భారతదేశంలో యీ జాతులకి త్వరగా ప్రజాదరణ ఎక్కువ అవుతూంది. ఈ జాతులు మాంసానికి ఎక్కువ పేరు పొందాయి. కాల్చితినే కోడిమాంసాల విషయంలో, వీటికి ఎక్కువ

ప్రాధాన్యత ఉంటుంది అని ఊహించ బడుతుంది. వీటివల్ల జనించిన సంకరజాతులు కూడా ఎక్కువగా ప్రజాదరణ పొందుతున్నాయి. ఈ జాతుల ప్రామాణికమైన బరువు, పుంజు 3.6 కిలోగ్రాములూ, పెట్ట 2.7 కిలోగ్రాములున్నూ.

## కోళ్ల జాతుల ఎన్నిక

కోళ్ల వ్యాపారం ఆరంభించడం ఎంత సులభమో, దగాపడిపోయి, వ్యాపారం ఎత్తికట్టివెయ్యవలసి రావడమూ అంతే సులభం. అంచేత వ్యాపారం జయప్రదంగా సాగాలంటే, తమ ప్రాంతాలలోని వాతావరణ స్థితులనిబట్టి, మార్కెట్టు అవసరాలని బట్టీ, సరిఅయిన జాతులని ఎంచుకోవడంలో అతి మెలకువగా ఉండాలి. గ్రుడ్ల కోళ్లనీ, మాంసానికి ఎన్నిక అయిన కోళ్లనీ యిలాగ ప్రత్యేకించి పక్షులని పెంపొందించడం వల్ల, తమతమ అవసరాలకి కావలసిన జాతికోళ్లని ఎంచుకుని, పెంచవలసి ఉంది.

పెరుగుదల విషయంలోనూ, గ్రుడ్ల విషయంలోనూ కూడా ఒకేజాతి కోడిపిల్లల సామర్థ్యాలు చాలా భిన్నంగా ఉంటాయి. ఆహారానికిగాను గ్రుడ్లు సరఫరా చేసి పౌల్ట్రీ ఫారం పెట్టాలి అనుకున్నప్పుడు, అందులో గ్రుడ్లు అధికంగా పెట్టగల జాతుల కోడిపిల్లల్నే కొని ఉంచాలి. తల్లి పక్షులనుంచి అధికంగా గ్రుడ్ల పెట్టగల గుణం సంక్రమించిన పెట్టలు చాలా లాభదాయకంగా ఉంటాయి. అట్టి గుణంలేని పెట్టలని పెంచితే ఆశాభంగమే కలుగుతుంది. గ్రుడ్లు తక్కువగా పెట్టే పెట్టలలో, మేత అంతా శరీరం పెరగడానికే వినియోగపడుతుంది. గ్రుడ్ల వ్యాపారంచేసే .సందర్భంలో వైట్‌లెగ్ హారన్ జాతిలోంచి ఎన్నికచేసిన పక్షుల సంకరం వల్ల కలిగిన పిల్లలు చాలా యోగ్యంగా ఉంటాయి.

మాంసం వ్యాపారం అయితే, త్వరగా ఎదిగివచ్చే పిల్లల్ని మాత్రమే ఎంచుకోవాలి. నెమ్మదిగా ఎదిగేవాటికంటె, ఈ పిల్లలకి మేత, చక్కగా శరీరం ఎదగడానికి ఉపయోగపడుతుంది. కాల్చుకుతినడానికి ఉపయోగపడే కోడిమాంసం విషయంలో వైట్‌కార్నిష్ జాతి పుంజులకీ, వైట్‌ప్లిమత్‌రాక్ జాతివికాని న్యూహాంప్‌షైర్ జాతివిగాని పెట్టలకి సంకరంగా పుట్టిన పిల్లలు శ్రేష్ఠం.

వ్యాపారం జయప్రదంగా సాగాలంటే, ఒక్కటే ఒక్క జాతి – అథవా రెండు జాతులు – ఎన్నికచేసి పెంచితే సురక్షితంగానూ లాభసాటిగానూ ఉంటుంది. ఎక్కువగా రకరకా పక్షులని పెంచేకంటే, కొద్దిజాతుల పెంపకంలో నిపుణత పొందడం ఉత్తమం. జాతులు పరిమితంగా ఉంటే, వాటిగూడు నిర్మాణం, వాటి సంతతిని వృద్ధిచేసుకోవడం, పెంపకం అన్నీ సులభం అవుతాయి.

## పౌల్ట్రీ పక్షుల యెన్నిక

పౌల్ట్రీ పక్షుల వ్యాపారం బాగుండాలంటే, జాతిపక్షులని పెట్టుకోగానే సరిపోదు. ఆ పక్షులవల్ల లభించే ఫలసాయం కూడా బాగా ఉండేటట్టు చూసుకోవాలి. అందుకోసం, పదేపదే జాగ్రత్తగా కనిపెట్టి, ఎంచి వేరుచేస్తూ ఉండాలి. పక్షులని ఎంచుకోవడం, వాటిలో నాసిగా ఉన్నవాటిని వేరుచెయ్యడం యీ రెండూ కూడా పౌల్ట్రీ పక్షులని సంబాళించుకోవడంలో ముఖ్యమైన విషయాలు. ప్రతీ పౌల్ట్రీ ఫారంలోనూ నాసిరకపు పక్షులని ఎంచి వేరుపరచడం పదేపదే జరగవలసినదని.

చక్కని ఆకృతిలేని వాటినీ, మాంసం పుష్కలంగా లేక, ఏపుగా ఎదగని పక్షులనీ, సత్తువ తక్కువగానూ, నిస్సత్తువగానూ, యీకలు అల్పంగానూ ఉన్న వాటినీ వెంటనే వేరుపరచాలి. బాగా పుష్టిగా ఉన్న పక్షుల కళ్లు చురుకుగా, లక్షణంగా ఉంటాయి ; ముక్కు దృఢంగా ఉంటుంది ; తల పెద్దదిగా తొడలు కాంతివంతంగా పసుపుపచ్చగా ఉంటాయి ; యీకలు నిగనిగలాడుతూ ఉంటాయి. శరీరంలో మాంసం పుష్కలంగా ఉంటుంది. గ్రుడ్లు పెట్టేకాలంలో, గ్రుడ్లు తక్కువగా పెట్టే పక్షులని వేరుచెయ్యాలి ; లేకపోతే అటువంటి పక్షుల సంఖ్య పెరిగిపోతుంది. కొంత కాలం గ్రుడ్లు ఎక్కువగా పెట్టి, తరవాత యేకారణంచేతనో గ్రుడ్లు పెట్టని పక్షులని కూడా వేరుచెయ్యాలి.

## కోళ్ల పెంపకపు పద్ధతులు

భారతదేశంలో పౌల్ట్రీ పెంపకం 1. సాంద్రపెంపక విధానం 2. సాంద్రం కాని పెంపక విధానం అని రెండు విధాలుగా ఉంటోంది.

రెండవ పద్ధతిలో పగటిపూట అంతా పిల్లల్ని విచ్చలవిడిగా ఆరుబయట వదిలేసి, రాత్రిళ్లు పంజరంలాంటిదానిలోనో, గూటిలోనో ఉంచుతారు. పల్లెటూళ్లలో యీ పద్ధతి చాలా అనుకూలంగా ఉంటుంది. దొడ్లో ఆరుబయట పక్షులకి కావలసినంత గాలీ, వెలుతురూ లభిస్తాయి. వ్యాయామం కూడా ఉంటుంది. అంతేకాకుండా అవి ఆరుబయట తిరుగుతూ గడ్డిపోచలూ, పురుగులూ మొదలైన సహజమైన ఆహారం తినడానికి వీలుగు ఉంటుంది.

కానయితే, వాటివల్ల గరిష్ఠఫలసాయం రాబట్టుకోవాలంటే, అవి మెసలడానికీ, నిద్రపోడానికీ తగినంత స్థలం ఏర్పాటు చెయ్యాలి. కోడి శరీరపు ఉష్ణత నియమితంగా ఉండడానికి వీలుగా దానికి స్వేదగ్రంథులుండవు. అంచేత విపరీతపు శీతోష్ణ పరిస్థితులలో, వాటి ఉనికిని గురించి ప్రత్యేకంగా శ్రద్ధ తీసుకుంటే తప్ప, అవి ఎక్కువగా బాధకి గురిఅవుతాయి. వాటిగూండ్ల విషయంలో ముఖ్యంగా గమనించవలసిన అంశాలు : పక్షికి సౌకర్యం, రక్షణ, వీలు. ఈ గూళ్లు మితవ్యయంతో అమరేటట్లు చూచుకోవాలి.

సాంద్రం కాని కోళ్ల పెంపకపు పద్ధతిలో, 50 గ్రుడ్ల కోళ్ల పెంచడానికి 230 చతురపు మీటర్ల స్థలం కావలసి ఉంటుంది. దొడ్లో ఉచిత పరిమాణంలో పందిరి లాంటిది వెయ్యాలి. ఈ పందిరిక్రింద మేతపెట్టే దొన్నెలు గ్రుడ్లు పెట్టడానికి నిర్దేశించిన గూళ్లు (పట్లు), నీరుపెట్టే గిన్నెలు, రాత్రిపూట వాటిని ఉంచే గూళ్లు ఉండాలి. ప్రబలంగా వీచే గాలులవల్ల పక్షులు దెబ్బతినకుండా చొప్పతోగాని, కేన్వాసు గుడ్డతోగాని తెరవెయ్యాలి. దొడ్లో నీడనిచ్చే చెట్లుంటే, అవి గాలి బాధ తగ్గించడమే కాకుండా, వేసవికాలంలో చల్లదనాన్ని యిస్తాయి. చెట్లు పొడవుగా పెరిగిపోకుండా కత్తిరిస్తే, పందిరిపైన వేసే తీగ చిక్కం పాడు అవకుండా ఉంటుంది. నేలమీద ఎనిమిది సెంటిమీటర్ల ఎత్తువరకు ఉన్న కొమ్మలన్నీ కత్తిరించెయ్యాలి. ఇలాగ చేసినందువల్ల ఆరుబయలుగా ఉన్న తావు ఎక్కువ అవుతుంది ; నేల తేమగా ఉండదు ; శుభ్రపరచడానికి వీలుగా ఉంటుంది. పూచికచెట్లు, నిమ్మ, దబ్బ మొదలైన చెట్లు చాలా మంచివి. వేసవికాలంలో వాటివల్ల గొడుగు వేసినట్టు, నీడ లభిస్తుంది ; శీతాకాలంలో యీ చెట్టకొమ్మలని దగ్గిరగా కత్తిరించే ఎండ బాగుంటుంది.

పెట్టలు గ్రుడ్లు పెట్టడానికి అనువుగా చాలినన్ని పట్లు (గూళ్లు) దొడ్లో కట్టాలి ; వీటిని, పందిట్లో ఉన్న గ్రుడ్లకోళ్లు కలవరపడకుండా ఉండేటట్లు,

చీకటిగా ఉన్న మూలని కట్టాలి. ఆరుబయట గ్రుడ్లు పెడితే, తరుచుగా అవి పగిలిపోతాయి లేదా మురికి అయిపోతాయి. వర్షాకాలంలో ముఖ్యంగా మురికి అయిపోతాయి.

పౌల్ట్రీ ఫారానికి ఆకుకూరలు మొలిచేనేల శ్రేష్ఠం. మన్ను గట్టిగా ఉండే నేలలు పౌల్ట్రీ ఫారానికి తగవు. నేలమాత్రం చెమ్మ లేకుండా ఉండాలి.

వ్యాపారం కోసం ఎక్కువ పౌల్ట్రీ పక్షులని పెంచినప్పుడు, సాంద్రపద్ధతిలో పెంచడం ఎక్కువ వీలుగా ఉంటుంది. ఈ పద్ధతిలో, ఊక, పొట్టు మొదలైనవి దట్టంగా వేసిఉంచిన ఒక గదిలోగాని, పందిరిలోగాని, లేదా ప్రత్యేకపు గూళ్లలో గాని పెట్టలు ఉంటాయి. దీన్ని "డీప్‌లిట్టర్" విధానం అంటారు.

ప్రత్యేకించి కట్టిన గూళ్లలోనో, లేదా, గదిలో నేలపైనో దట్టంగా తుక్కు వేసి ఉంటుంది. దీనివల్ల పక్షులు అనారోగ్యపు పరిసరాల్లో ఉంటాయి అని అనుకోరాదు. నేలమీద వేసిన తుక్కూ, పక్షుల రెట్టలూ అన్నీ ఒకరకం సూక్ష్మక్రిముల వల్ల ఛిన్నాభిన్నం అయి, అది పొడిగా, నల్లమట్టిలాగ తయారవుతుంది. దీనికి శోషణశక్తి అధికంగా ఉండడంవల్ల, ఇది అపాయకరమైన క్రిములను నాశనం చేస్తుంది. కొన్ని నెలలకి, క్రిమిచర్యా ఫలితంగా, "రిబోఫ్లావిన్" అనే జంతుమాంసకృత్తుల అంశం, విటమినులు, ట్రేసు ఎలిమెంట్సు అనబడే మూలపదార్థాలూ యిందులో జనిస్తాయి. వీటన్నిటిని కూడా గ్రుడ్లకోళ్లు తినడంవల్ల అవి ఎక్కువగా గ్రుడ్ల పెడతాయి. గ్రుడ్లు పొదగడానికికూడా ఎక్కువ వీలుగా ఉంటుంది.

ఈ సాంద్రత పద్ధతిలో జాగాకీ, పనివాళ్లకీ-అయ్యే ఖర్చు బాగా తగ్గుతుంది. మేతకూడా వృథాపోదు. నక్కలు మొదలైన జంతువులవల్ల పక్షులకి అపాయం బాగా తగ్గుతుంది ; గ్రుడ్లు పగిలిపోవడంవల్ల కాని, యితరత్రా పాడైపోవడంవల్ల కాని కలిగే నష్టం కూడా తక్కువగా ఉంటుంది. క్రిందనుండే తుక్కు పొడిగా ఉంచడంవల్ల గ్రుడ్లు శుభ్రంగా ఉంటాయి ; అంచేత మంచిధరకి అమ్ముడుపోతాయి.

నేలపై పరిచే తుక్కు కాయధాన్యాలు మొదలైన మొక్కల జీవసంబంధమైనదిగానూ, దుమ్ములేకుండా మెత్తగానూ, పొడిగానూ ఉండి, ఎక్కువగా శోషణశక్తి గలిగి ఉండాలి. ధూళిగాగ అది మరీ మెత్తగా ఉండకూడదు ; అలాగని రెట్టలతో కలిసిపోవడానికి వీలు లేకుండా బొత్తగా గట్టిగానూ,

ముతుకగానూ ఉండకూడదు. ఈ తుక్కుకి సాధారణంగా వాడే వస్తువులు ఊక, వేరుసెనగ డొలకలు లేక పత్తిగింజల డొల్లలు, గోధుమపొట్టు, పొడిచేసిన జొన్న మొదలైన కంకులు, వట్టిగడ్డి, చెరకుపిప్పి, రంపపుపొట్టు, చిత్రిక పొట్టునూ.

నేలమీద యీ తుక్కు పరిచినప్పుడు ప్రతీసారి పాతతుక్కు అంతా తీసివేసి శుభ్రపరచాలి. నేల, గూటిగోడలు, గూటికి ఉండే తలుపులు వగైరా, గూటిలోపల ఉంచే సామగ్రి, ఇవన్నీ క్రిమినాశక మందులతో శుభ్రపరచాలి. నేలమీద, మొదట 5 మొదలు 8 సెంటీమీటర్ల వరకూ పొడిమట్టిజల్లి, గట్టిపరచి, దానిమీద 8 మొదలు 10 సెంటీమీటర్ల వరకూ ఊక మొదలైన వాటితో కూడిన, పై చెప్పిన తుక్కు ఒత్తుగా పరచాలి. వేసవికాలంలోనూ, వర్షాకాలంలోనూ తడి అయిన భాగాల మార్పులకి తప్ప, ఇంక ఏ కొత్త పదార్థం చేర్చకూడదు. వర్షాకాలానికి రెండు నెలలు ముందుగా యీ పని మొదలుపెట్టాలి. వర్షాకాలంలో ఎప్పుడూ కూడా యీ పని ఆరంభించ కూడదు. వర్షాకాలం అయిపోయిన తరవాత, పొట్టు మొదలైనవాటితో కూడిన యీ పదార్థం క్రమంగా అధికంచేస్తూ, నవంబరు చివరికి నేల 15 మొదలు 20 సెంటీమీటర్ల దళంలో ఉండేటట్టు ఏర్పరచాలి. శీతాకాలం అంతా నేల యిదే దళంలో ఉండి, తిరిగి వేసవి కాలం, వర్షాకాలం వచ్చేసరికి 8 మొ॥ 10 సెంటీమీటర్ల దళంలో ఉండేటట్టు తగ్గించుకు రావాలి. ఈ తుక్కు ఎప్పుడూకూడా చెమ్మగిలకుండా ఉండేటట్టు చూసుకోవాలి. ఈ నిశితపద్ధతి జయప్రదంగా కొనసాగాలంటే, యీ పదార్థం పొడిగా ఉండడం అతిముఖ్యం. రెట్టలు దీనితో బాగా కలిసిపోయేటట్టు, తరుచుగా దీన్ని కదుపుతూ ఉండాలి. ఇలా కదపడంవల్ల పదార్థం పొడిగా ఉండడమేకాకుండా, కీటకాదులు పెరగవు.

“డీప్‌లిట్టర్” పద్ధతిని కట్టే గూళ్లలో పక్షులని అమితంగా ఉంచకూడదు. ఒక వంద తేలిక అయిన పక్షులకి (బరువు తక్కువ తూగేవి) ఉద్దేశించిన గూడెంలో, ఒక్కొక్కదానికి కనీసం 28 చతురపు డెసిమీటర్ల జాగా కావాలి. బరువు ఎక్కువ తూగే పక్షులకి ఒక్కొక్కదానికి 32 చతురపు డెసిమీటర్ల జాగా కావాలి.

“డీప్‌లిట్టర్” పద్ధతిని కట్టే గూళ్లకి బాగా గాలీ వెలుతురూ ఉండాలి. దానివల్ల పక్షులకి సౌకర్యంగా ఉండి, వాటి ఫలసాయం పెంపొందుతుంది. ఈ

గూళ్ల యొక్క ప్రక్క భాగాలు తెరిచి ఉండాలి. పైభాగం నేలకి 60 మొదలు 75 సెంటీమీటర్ల ఎత్తులో, తీగచిక్కంతో కప్పాలి. శీతాకాలంలో, చలి ఎక్కువగా ఉన్నప్పుడు, కాన్వాసుగుడ్డలు గాని, గోనెపట్టాలుగాని, తెరచిఉన్న ప్రక్కభాగాలకి తెరలుగా వాడితే, పక్షులకి చలి తగలకుండా వెచ్చగా ఉంటుంది.

జాగాలు తక్కువగా ఉండే పట్టణాల్లో, సాంద్రపద్ధతిని కోళ్లపెంపకానికి "లేయింగ్ బ్యాటరీ"లు ఉపయోగిస్తారు. లేయింగ్‌బ్యాటరీ అంటే, గ్రుడ్ల కోళ్లని ఉంచే పంజరాలు (లేక అరల) వరస అన్నమాట. ఈ పంజరాలు వరుసలో ఉండి, ఒక వరుసమీద యింకొకటిగా అమర్చి ఉంటాయి. ఈ పంజరాలకి ఇనుపచట్రం, నాలుగువైపులా తీగచిక్కం ఉంటాయి. గ్రుడ్లకోళ్లని, ఒక్కొక్కదాన్ని ఒక్కొక్క పంజరంలో (అరలో) పెడతారు. రాత్రింబవళ్లు ఇవి ఆ పంజరాలలోనే ఉంటాయి.

మామూలు పరిమాణంలో ఉన్న లేయింగ్ బ్యాటరీలో, ఒకే చట్రంలో సుమారు ఏడు పంజరాలు ఉంటాయి. చట్రం ఇనుపకడ్డీలతో చెయ్యవచ్చును.

పంజరపు అడుగుభాగం, పెట్ట భారాన్ని ఆపగలిగేటట్టు, తగినదళంలో గట్టిగా ఉండే 2.5 సెంటీమీటర్ల తీగచిక్కంతో చేస్తారు. ఈ అడుగుభాగం చట్రానికి అతికించబడి ఉంటుంది. గ్రుడ్డ పెట్టగానే దొర్లిపోవడానికి వీలుగా, అడుగు, వెనక నుంచి ముందు వైపుకి 8 మొదలు 10 సెంటీమీటర్లు ఏటవాలుగా ఉంటుంది. ముందు చివర అంచున 6 మొదలు 8 సెంటీమీటర్ల ఎత్తులో ఉండడంవల్ల గ్రుడ్డు క్రిందికి జారిపోకుండా నిలిచి ఉంటుంది. పంజరపు అడుగుభాగానికి క్రిందుగా ఒక పళ్లెం (ట్రే) అమర్చి ఉంటుంది. పెట్టవేసే రెట్టలు అందులో పడతాయి.

పంజరాల వరసలు ఒకదానిమీద ఒకటిగా ఏర్పరచినప్పుడు, పై వరుస పంజరం తాలూకు రెట్టల పళ్లెం, దానిక్రిందనున్న పంజరానికి కప్పు అవుతుంది.

పంజరం ముందు భాగంలో, చాలావరకు, మేతకీ నీటికీ కావలసిన గిన్నెలుంటాయి. నీటి దోనె మేత ఉంచే దోనెకి పైగా అమర్చి ఉంటుంది. ఈ దోనెలు పంజరంలో ఉన్న అడ్డ ఊచలపైనగాని, లేదా చట్రానికి అతికించిన వెడల్పాటి ఇనుప రేకులమీద గాని ఉంటాయి. మేతదొన్నెకీ, పంజరం అడుగున ఉండే తీగచిక్కానికీ మధ్య సుమారు 6 మొదలు 8 సెంటీమీటర్ల అంతరం ఉంటే, పెట్ట పెట్టిన గ్రుడ్డు అడ్డంకులు లేకుండా,

ముందుకి జారిపోవడానికి వీలుగా ఉంటుంది. ఇలాగే మేత దోనెకి, నీటిదోనె అడుగుభాగానికీ మధ్య 8 మొదలు 10 సెంటిమీటర్ల అంతరం ఉంటే, పెట్ట, మేత మెయ్యడానికి వీలుగా ఉంటుంది. నీటి దోనెకి పైన 8 మొదలు 10 సెంటిమీటర్ల వరకూ ఖాళీగా ఉంటే, పెట్ట సులభంగా నీరు త్రాగడానికి వీలవుతుంది. ఆ పైన 1.3 సెంటిమీటర్ల తీగ చిక్కంతో పంజరం కప్పు ఉంటుంది. నీటి దోనెలూ, మేత ఉంచే దోనెలూ ఒక్కొక్క పంజరానికీ ఒక్కొక్కటి చొప్పున గాని, లేక మూడు నాలుగు పంజరాలకి కలిపి ఒక్కొక్కటి చొప్పునగాని ఏర్పరచ వచ్చును. పంజరం ఎత్తు 45 సెంటి మీటర్లూ, వెడల్పు 45 సెంటిమీటర్లూ, పొడవు 35-40 సెంటిమీటర్లూ ఉండాలి.

## కోళ్లకు మేత

భారతదేశంలో కోళ్లని, వాటికి ఏది దొరికితే అది తిని బ్రతకడానికి వదిలేస్తారు. కాని, మేలురకపు గ్రుడ్లు కావాలన్నా, ఎక్కువగా మాంసం లభించాలన్నా, కోళ్లకి సరి అయిన మేత, సంరక్షణ చాలా అవసరం. "కోడిపెట్ట - ఒక గ్రుడ్డు నుంచి మరొక గ్రుడ్డు ఉత్పత్తి అవడానికి సాధనం మాత్రమే" అని ఒక నానుడి.

కోళ్ల యొక్క ఆరోగ్యసరణి విచిత్రంగా ఉంటుంది. కోళ్లు ఎప్పుడూ ఆకలితో ఉన్నట్టు, అస్తమానం ఏదో ఒకటి, తినడానికి వెతుక్కొంటూ న్నట్టు కనిపిస్తాయి. కోళ్ల మేతకి ఎక్కువ ఖర్చుపెట్టవలసి ఉంటుంది. కోళ్ల పెంపకానికయ్యే మొత్తం ఖర్చులో సగానికిపైగా మేతకే అవుతుంది. అంచేత, గ్రుడ్లకీ, మాంసానికీ - యీ రీతిగా దేనికోసం కోడి ఉద్దేశించబడిందో - దానికి, ఉచితమైన మేత పెట్టాలి. తొందరగా ఎదిగిరావడానికి పనికొచ్చే మేత, పక్షుల బరువు పెంచడానికీ వాటివల్ల అధికంగా గ్రుడ్లు లభించేటట్టు చెయ్యడానికి పనికివచ్చే మేతకన్నా కొన్ని అంశాలలో భిన్నంగా ఉంటుంది.

కోళ్ల పెంపకం ఎక్కువ లాభదాయకంగా ఉండాలంటే, కోళ్లకి పోషకపదార్థాలు సమపాళంగా ఉన్న మేత అవసరం. పోషకపదార్థాలు సమపాళంగా ఉండడానికి పలురకములైన మేతలను చేర్చి, పెట్టవలసి ఉంటుంది. కావలసిన పోషకపదార్థాలన్నీ సమకూర్చడమే కాకుండా, అవి

సరి అయిన నిష్పత్తిలో ఉండేటట్లు చూసుకోవడం కూడా చాలా ముఖ్యం. ఒక్క మొక్కజొన్న పిండి మేత మాత్రమే పెడితే, మాంసకృత్తులు దుర్వ్యయం అవుతాయి. అందేత పోషకపదార్థాలని సమపాళంలో ఉంచాలి. అలాగచేస్తే, చక్కటి గ్రుడ్లు పొందడానికీ, పక్షులు ఏపుగా ఎదగడానికి మేత అతి ఫలప్రదంగా ఉంటుంది.

కోళ్లకి పెట్టే మేతలో కాయధాన్యాలు, వాటినుంచి జనించిన యితర పదార్థాలు, జంతువులవల్ల మొక్కలవల్ల లభించే ఉపపదార్థాలు, కూరాకులు మొదలైన పచ్చి మేతలూ ఉంటాయి. మాంసకృత్తుల మేతలు, ముఖ్యంగా జంతుసంబంధమైన మాంసకృత్తులు గలవి, చాలా ప్రియం. అయినప్పటికీ, తృప్తికరంగా గ్రుడ్లు లభించాలంటే, కాయగూరల వల్ల లభించే ప్రొటీన్లు, జంతుసంబంధమైన మాంసకృత్తులు కలిపి కోళ్లకి మేపాలి.

అన్ని పోషక పదార్థాలు ఉచితమైన పాళ్లలో కలిపి తయారుచేసిన మేతమిశ్రణము, నవీనపద్ధతులలో, కోళ్లని మేపడానికి విరివిగా వాడుకలో ఉంది. ఇది చాలా సులువైన పద్ధతి. ఇందులో కావలసిన పదార్థాలన్నీ ఉంటాయి. ఇంక గింజలు అవీ వేరేగా పెట్టనవసరంలేదు.

30 పాళ్లు పసుపుపచ్చటి మొక్కజొన్న గింజలు, లేదా, యితర కాయధాన్యాలు, 20 పాళ్లు తవుడు, 10 పాళ్లు బార్లీ లేక ఓట్సు, 10 పాళ్లు గోధుమపొట్టు 15 పాళ్లు పొట్టు తీసిన వేరుసెనగపిండి, 4.5 పాళ్లు జిగటగా ఉన్న మొక్కజొన్న పిండి, 4 పాళ్లు ఆవిరిమీద ఉడికించిన చేపపొట్టు, 3 పాళ్లు ఆవిరిమీద ఉడికించిన మాంసం, ఒక పాలు ఆవిరిమీద ఉడికించిన ఎముకలపొడి, 2 పాళ్లు సుద్దపొడి (కాల్షియం పౌడరు), 0.5 పాళ్లు ఉప్పుకలిపి గ్రుడ్ల కోళ్లకి కావలసిన మేత తృప్తికరంగా తయారుచెయ్యవచ్చును. ఇలాగ తయారుచేసిన 100 కిలోగ్రాముల మిశ్రమానికి 4.4 గ్రాములు విటమిను-ఎ ; 0.5 గ్రాములు విటమిను – బి$_2$, 0.6 గ్రాములు విటమిను – డి, 22 గ్రాములు మాంగనీసు సల్ఫేటు కలపాలి. ఇవిగాక కోళ్లకి కావలసినంత కూరాకుల మేత పెట్టాలి.

కోడిపిల్ల పుట్టిన వెంటనే 36 గంటల వరకు ఎటువంటి మేత అక్కరలేదు. ఈ కాలంలో, గ్రుడ్డులోంచి, సంక్రమించిందే ఆహారంగా పనిచేస్తుంది. గ్రుడ్ల కోళ్లగా ఎదగవలసిన పిల్లలకి ఉచితమైన మేత, 28 పాళ్లు పసుపుపచ్చటి మొక్కజొన్న లేదా యితర కాయధాన్యాలు, 26 పాళ్లు

తవుడు, 7 పాళ్లు బార్లీ లేక ఓట్సు, 5 పాళ్లు ఆవిరి మీద ఉడికించిన మాంసం, ఒక పాలు ఆవిరిమీద ఉడికించిన ఎముకలపొడి, 1.5 పాళ్లు సుద్దపొడి, 0.5 పాళ్లు ఉప్పు కలిపి తయారుచెయ్యవచ్చును. ఇలాగ తయారుచేసిన 100 కిలోగ్రాముల మిశ్రణానికి 2.2 గ్రాములు విటమిను 'ఎ', 0.5 గ్రాములు విటమిను – బి$_2$, 0.3 గ్రాములు విటమిను – డి$_3$, 22 గ్రాములు మాంగనీసు సల్ఫేటు చేర్చాలి. కోడిపిల్ల పుట్టిన ఒక వారం తరవాత దానికి తగినంత కూరాకులు మొదలైనవి మేత పెట్టాలి.

కాల్చుకుతినడానికి ఉపయోగంగా ఉండవలసిన కోళ్లకి, 20 పాళ్లు పసుపుపచ్చని మొక్కజొన్న లేదా యితర కాయధాన్యాలు, 28 పాళ్లు తవుడు, 7 పాళ్లు బార్లీ లేక ఓట్సు, 7 పాళ్లు గోధుమపొట్టు, 20 పాళ్లు పొట్టుతీసిన వేరుశెనగపిండి, 5 పాళ్లు జిగటగా ఉన్న మొక్కజొన్నపిండి, 7 పాళ్లు ఆవిరిమీద ఉడికించిన చేపపొట్టు, 3 పాళ్లు ఆవిరిమీద ఉడికించిన మాంసం, 1 పాలు ఆవిరిమీద ఉడికించిన ఎముకపొడి, 1.5 పాళ్లు సుద్దపొడి (కాల్షియం పొడరు), 0.5 పాళ్లు ఉప్పుకలిపి మేత మిశ్రణము తయారు చెయ్యవచ్చును. 100 కిలోగ్రాముల మిశ్రమానికి 2.2 గ్రాములు విటమిను – ఎ, 0.5 గ్రాములు విటమిను – బి$_2$, 0.3 గ్రాములు విటమిను డి$_3$, 22 గ్రాములు మాంగనీసు సల్ఫేటు చేర్చాలి. పిల్లకి ఒక వారం తరవాత కూరాకులు మొదలైన పచ్చిమేతలు పుష్కలంగా మేపాలి.

భారీజాతుల కోడిపిల్లలకి ఎక్కువ మేత, తేలిక జాతుల వాటికి మేత తక్కువగానూ కావలసి ఉంటుంది. సగటున కోడిపిల్లకి, 4 వారాలయ్యేవరకూ, 100 పిల్లలకి రోజుకి 56 గ్రాముల మేత మిశ్రమం కావలసి ఉంటుంది. 20 మొదలు 24 వారాల ప్రాయం గల వాటికి 900 గ్రాములు కావలసిఉంటుంది. మేత మైదాపిండి ముద్దలాగ మరీ మెత్తగా కాకుండా, కొంచెం ముతుకగా ఉండాలి.

## కోళ్లకు నీరు

కోళ్లు ఆరోగ్యంగా ఉండడానికి, వాటివల్ల లభించే ఫలసాయం బాగుండడానికి, వాటికి, కావలసినంత నీరు ఎప్పుడూ లభింపజెయ్యాలి. పక్షి భారంలో ఎక్కువ నిష్పత్తి నీరు, దాని శరీరభారంలో నీరు 60 శాతంన్నా,

గ్రుడ్డుభారంలో $\frac{2}{3}$ వంతులున్నూ ఉంటుంది. కోళ్లు తిండి లేకపోయినా బతులగలవుగాని, నీరులేకపోతే బ్రతకలేవు. తాగినప్పుడల్లా తక్కువ పరిమాణంలో తాగుతాయి కనక, కోళ్లకి నీరు ఎప్పుడూ లభ్యం అయ్యేటట్టు ఏర్పాటు చెయ్యాలి. కోడిపిల్లలు ప్రతీ 15, 20 నిమిషాలకి తప్పకుండా నీరు తాగుతాయి.

నాలుగువారాల ప్రాయం వచ్చేవరకూ 100 పిల్లలకి సుమారుగా ఆరు, ఏడు లీటర్ల నీరు కావాలి. నాలుగు మొదలు ఎనిమిదివారాల ప్రాయంలో ఉన్నవాటికి 100 కి 9 మొదలు 12 లీటర్ల నీరు కావాలి. గ్రుడ్ల కోళ్లకి 100 కి 20 మొదలు 25 లీటర్ల నీరు రోజుకి కావాలి.

## గ్రుడ్లు పొదగడం

భారతదేశంలో కోళ్ల పెంపకం తక్కువ ప్రమాణాలలో జరుగుతోంది. అంచేత సాధారణంగా గ్రుడ్లు, పెట్టలే పొదుగుతాయి. పొదిగే కోడి 20–21 రోజులవరకూ గ్రుడ్ల మీద కూచుని, పిండం పెరగడానికి కావలసిన వెచ్చ కలిగిస్తుంది. తరవాత, పిల్ల ముక్కుతో గ్రుడ్డుని పగుల్చుకొని బయటకి వచ్చేస్తుంది.

పొదగడం సక్రమంగా జరగాలంటే, పుంజు, పెట్టలతో వారం పది రోజులు తిరిగిన తరవాత, పొదగవలసిన గ్రుడ్లనన్నిటినీ ఒకచోట భద్రపరచాలి. జతకట్టిన తావునుంచి పుంజుని వేరుచేసిన ఒక వారానికిపైగా, పెట్ట, పొదగడానికి పనికివచ్చే గ్రుడ్లు పెడుతుంది. వేసవికాలంలో అయిదు రోజులకి దాచిపెట్టిన గ్రుడ్లను, శీతాకాలంలో అయితే 10 రోజులపాటు దాచిపెట్టినవాటిని పొదిగించకూడదు. మురికి అయిన గ్రుడ్లు పొదగడానికి పెట్టేముందు కడగకూడదు. కడిగినందువల్ల గ్రుడ్డు మీద ఉండే సూక్ష్మ రంధ్రాలు తెరుచుకుపోయి, పొదగడానికి ప్రతిబంధకం యేర్పడుతుంది.

పొదిగే కోడి ఆరోగ్యంగానూ, బలంగానూ, పొదిగే యిచ్ఛకలదిగానూ ఉండాలి. సన్నటి ఎండుగడ్డిగాని, లేకపోతే పచ్చిగడ్డిగాని ఎండుటాకులుగాని వేసి, ప్రశాంతంగా, చీకటిగా ఉన్న ఒక మూల ఉంచిన మెత్తటి పట్టులో పొదిగే కోడి కూచునేటట్టు చెయ్యాలి. ఈ పట్టు నేలకి మరీ ఎత్తుగా కాకుండా దగ్గరగా ఉంటే పెట్ట పట్టెక్కడానికి, బయటకి రావడానికి వీలుగా ఉంటుంది.

పొదుగుతూ ఉన్నప్పుడు పెట్టని అనవసరంగా కలవరపెట్టకూడదు. మంచి పరిమాణంలో ఉన్న పెట్ట ఒక్కొక్కసారి 10, 15 గ్రుడ్లు పొదుగుతుంది. పెట్ట మేత మెయ్యడానికి, నీరు తాగడానికి దాన్ని ప్రతిరోజూ నెమ్మదిగా బయటికి తియ్యాలి. పొదిగే కోడికి రోజూ రెండుసార్లు పెట్టాలి. కావలసిన పరిమాణంలో ధాన్యపు గింజలు, ముతకగా ఉన్న సున్నపురాతి పొడిపెట్టాలి. జావలాగ ఉండే మేతలు పెడితే, వేసే రెట్టలు పల్చగా ఉండి గ్రుడ్లు మలినం అయిపోతాయి కనక, అటువంటి మేత పెట్టకూడదు.

ఇటీవల భారతదేశంలో "ఇన్క్యుబేటర్ల" లో (పొదుగుపెట్టెలు) కృత్రిమంగా గ్రుడ్లు పొదగడం ఎక్కువ అయింది. ఎక్కువగా గ్రుడ్లు పొదగవలసి వచ్చినప్పుడు, యీ కృతిమ విధానం లాభదాయంగా ఉంటుంది. దీనివల్ల శ్రమ తక్కువ అయి, అవసరం వచ్చినప్పుడు పొదగడానికి సౌకర్యం లభిస్తుంది. 'ఇన్క్యుబేటర్లు' 25 గ్రుడ్లు పొదిగే చిన్న మెషినులు మొదలు, కొన్ని వేల గ్రుడ్లు పొదగగల బ్రహ్మాండమైన మెషిన్ల వరకూ ఉన్నాయి. ఉత్తమ ఫలితాలు పొందడానికీ, ఇన్క్యుబేటరును ప్రత్యేకించి వేరు గదిలో ఉంచాలి. ఆ గదికి గాలీ-వెలుతురూ బాగా తగలాలి. గదిలో ఉన్న కిటికీలలోంచి నేరుగా ఎండపడకూడదు.

చిన్న 'ఇన్క్యుబేటర్ల'లో సాధారణంగా 38.3 మొదలు 39.4 డిగ్రీలు సెంటిగ్రేడు వరకూ ఉష్ణత ఉంటుంది. యంత్రసహాయంతో పనిచేసే పెద్ద 'ఇన్క్యుబేటర్ల' లో, వెట్ట గలిగించడం గ్రుడ్లని తిప్పి ఉంచుతూ ఉండడం మొదలైన కార్యక్రమం అంతా విద్యుత్ సాధనాలవల్ల జరుగుతుంది.

గ్రుడ్లలోని తడి ఎక్కువగా పోకుండా, మెషినులో తగినంత తేమ ఉండడం అవసరం. మెషినులో ఉండే తేమయొక్క గరిష్ఠ ప్రమాణం 60 మొదలు 65 శాతం వరకూ ఉంటుంది. వేసవికాలంలో, నీరుగాని, తడియిసుక గాని పోసిన ప్రత్యేకపు పళ్లేల పైన 'ఇన్క్యుబేటర్లు' ఉంచడంవల్ల, సాధనంలో తేమ ఎక్కువ చెయ్యవచ్చును.

పొదగడం పూర్తయేవరకూ, పద్దెనిమిది రోజులు లెక్కప్రకారం అయిపోయేయి కదా అని, 'ఇన్క్యుబేటరు' తెరవకూడదు. పొదగడం పూర్తి అయేక, పిల్లల్ని తీసి "బ్రూడర్సు" అనే పెంపకపు మెషీన్లలో ఉంచాలి.

## కోడిపిల్లల పెంపకం

గ్రుడ్లని పొదిగినపెట్టే, చిన్న పిల్లల్ని పెట్టవల్లగాని, కృత్రిమంగా "బ్రూడర్లు" అనే యంత్రాలవల్లగాని పెంచవచ్చును. బ్రూడరు సాధనం పిల్లలకి పెంపుడు తల్లిలాంటిది. పిల్లపుట్టిన తొలిరోజు మొదలు ఎనిమిది వారాలవరకూ, పిల్లలు పెట్ట సంరక్షణలో ఉంటాయి. కోడిపిల్లలకి ఇది చాలా గడ్డుకాలం.

సహజమార్గంలో కోడిపిల్లల్ని సాకుకురావడానికి ఉత్తమమైన పద్ధతి ఏమిటీ అంటే, పెట్టని ఒక కోళ్ల బుట్టలో ఉంచి, దానితో కలిపి విడివిడిగా ఉన్న చిన్న బుట్టలలోకి పిల్లల్ని వదలాలి. రోజూ యీ బుట్టలుంచే స్థలం మారుస్తూ ఉండాలి. దేశీ పెట్టలకి సామాన్యంగా ఆదర్శప్రాయమైన మాతృగుణం ఉంటుంది. సగటు పరిమాణంలో ఉన్న పెట్ట శ్రమ లేకుండా 10, 15 పిల్లల్ని సాకగలదు.

అయితే, సహజపద్ధతికన్నా, కృత్రిమపద్ధతిలో, కోడిపిల్లల్ని పెంచడంవల్ల చాలా లాభాలున్నాయి. కృత్రిమపద్ధతిలో ఏడాదిలో ఎప్పుడైనాసరే, కావలసిన పిల్లల్ని సాక వచ్చును. జబ్బులవల్ల ; నక్కలూ మొదలైన జంతువులవల్లా ప్రాణనష్టం తక్కువగా ఉంటుంది. చీడలు ఎక్కువగా నిరోధించవీలవుతుంది.

కృత్రిమపద్ధతిలో కోడిపిల్లల్ని పెంచడానికి బ్రూడరు యంత్రాన్ని ఉపయోగిస్తారు. పిల్లకి యీకలు వచ్చేవరకూ 26.7 మొదలు 32.2 డిగ్రీలు సెంటిగ్రేడు వరకూ (80 మొదలు 90 డిగ్రీలు ఎఫ్) ఉష్ణత కావాలి. సహజపద్ధతిలో పెట్ట తన శరీరం వల్లా, శరీరంలో ఉండే యీకలవల్లా కావలసిన వెచ్చదనం కలగజేస్తుంది. కృత్రిమ పద్ధతిలో కిరసనాయిలు దీపాలవల్లగాని, విద్యుచ్ఛక్తివల్లగాని, బ్యాటరీవల్లగాని కావలసిన వెచ్చదనం సమకూరుతుంది. వెచ్చదనం మరీ ఎక్కువ అయిపోతే పిల్లలకి ఎముక బాగా పెరగకుండా, యీకలు మాత్రం త్వరగా పెరిగి అవి నిస్సత్తువ అయిపోతాయి.

## లన పాలన

కోడిపిల్లలకి ఆరు, ఎనిమిది వారాలు వచ్చేవరకూ, అవి పుంజులే వుతాయో, పెట్టలే అవుతాయో తెలుసుకోడానికి వీలుపడదు. నిమిదివారాల ప్రాంతానికి, పుంజు పిల్లలకి తలమీద జుట్టూ, మెడక్రింద లాడే చర్మమూ స్ఫుటంగా కనిపిస్తాయి ; పెట్ట పిల్లలకి కనిపించవు.

పుంజుపిల్లలకన్నా పెట్టపిల్లలకి, సాధారణంగా మంచి యీకెలు ఉంటాయి. వీపుమీద, ముఖ్యంగా, యివి ఒత్తుగా ఉంటాయి. ఇటీవల, జపాను "వెంటో" పద్ధతిద్వారా, కోడిపిల్ల పుట్టిన మర్నాడే అది మగదో ఆడదో పోల్చుకొన సాధ్యం అవుతుంది. కానయితే, యీ పద్ధతి తప్పులేకుండా ఖచ్చితంగా అవలంబించడానికి ముందు, ఎంతో తర్ఫీదు అనుభవం అవసరం. ఈ మధ్య కోడిపిల్లల లింగనిర్ధారణ చేసే సాధనాలు వెలువడ్డాయి. వీటివల్ల పిల్ల పుట్టిన మర్నాడే అది పుంజు అవుతుందో, పెట్ట అవుతుందో తెలుసుకోవచ్చును. ఇలాగ తెలుసుకోవడంవల్ల వెంటనే కలిగే లాభం ఏమిటి అంటే, వాటి జీవిత ప్రారంభదశలోనే వ్యాపార అవసరాలకి పుంజులయ్యే పిల్లల్నీ, పెట్టలయ్యే వాటిని కేటాయించి తదనుగుణంగా మిగతా కార్యక్రమం నడిపించ వచ్చును.

గ్రుడ్ల కోళ్లజాతులు సామాన్యంగా $5\frac{1}{2}$, 6 నెలల ప్రాయంలో గ్రుడ్లు పెట్టనారంభిస్తాయి ; తతిమ్మా భారీజాతి పెట్టలు ఏడు, ఎనిమిది నెలలు వస్తేగాని గ్రుడ్లు పెట్టవు. ఒక ఏడాదికి పైగా బాగా గ్రుడ్లు పెట్టిన పెట్టలికి, ఆ తరవాత గ్రుడ్లు పెట్టడం బాగా తగ్గిపోతుంది. అంచేత పెట్టలని ఏటేటా అమ్మివేసి, చిన్నపెట్టల్ని కొత్తవాటిని సేకరించడం మంచిది.

శీతాకాలంలో వెలుతురు రోజుకి 13 గంటలకన్నా తక్కువ ఉండేట ప్పుడు, దీపాలు పెట్టి వెలుతురు కలగజేస్తే గ్రుడ్లు పెట్టడం అధికం అవుతుంది. వెలుతురు బాగా ఉంటే, పెట్టలు మేత ఎక్కువ మేస్తాయి. గ్రుడ్లు అధికంగా పెడతాయి.

గ్రుడ్లు పెట్టడానికి పుంజు ఉండాలని సామాన్యంగా అనుకుంటారు. కాని, ఇది వాస్తవం కాదు. పుంజు లేకపోయినా పెట్టలు గ్రుడ్లు పెడతాయి. కాని ఆ గ్రుడ్లు నిస్సత్తువగా ఉంటాయి. వీటిని మామూలుగా "శాకాహారపు గ్రుడ్లు (వెజిటేరియన్ గ్రుడ్లు)" అంటారు. ఈ గ్రుడ్లు పొదగడానికి పనికిరావు కాని, వీటికి బాగా నిలవ ఉండే గుణం ఉంది. పుంజుల్నీ, పెట్టల్నీ వేరువేరుగా ఉంచినప్పుడు, ముఖ్యంగా వేసవికాలంలో పొదిగించడానికి గ్రుడ్లు అవసరం లేనప్పుడు, ఈరీతిగా గ్రుడ్లు సేకరించడం మంచిది.

## గ్రుడ్ల నాణ్యత

తాజా గ్రుడ్లు అన్నీ కూడా సామాన్యంగా శ్రేష్ఠంగానే ఉంటాయి. గ్రుడ్డు పెట్టిన వెంటనే దాని వెడల్పాటి భాగంలో గాలి ఉండదు. అది

చల్లారుతున్నకొద్దీ యీ గాలి జాగా ఏర్పడుతుంది. గ్రుడ్ల రుచి, కొంతవరకు, పెట్టకి పెట్టే మేతపైని ఆధారపడి ఉంటుంది. పచ్చిమేతలూ, పసుపుపచ్చని మొక్కజొన్న పిండివలన గ్రుడ్డులోని చందమామ (పచ్చవిభాగం) కి చిక్కటి రంగు వస్తుంది. పాలిపోయిన రంగులో ఉన్న చందమామ కంటె, చిక్కని రంగులో ఉన్నదానిలో విటమినులు అధికంగా ఉండడంవల్ల, ఇవి ఎక్కువ శ్రేష్ఠంగా ఉంటాయి. తాజాగ్రుడ్లకి ఏ అంటురోగాలూ సర్వసాధారణంగా ఉండవు ; కాని కొన్ని పెట్టలు అప్పుడప్పుడు రోగం సోకిన గ్రుడ్లు పెట్టడం కలదు.

కోడిగ్రుడ్డు యొక్క రంగుకీ, దాని నాణ్యతకీ ఏమి సంబంధం లేదు. కోడిజాతిని బట్టి గ్రుడ్డుయొక్క రంగు ఉంటుంది. ఇది గుల్లయొక్క రంగు మాత్రమే. సాధారణంగా లెగ్‌హారన్ పెట్టల గ్రుడ్లు తెల్లగా ఉంటాయి ; ర్హోడ్ అయిలెండ్ రెడ్ జాతి పెట్టలవి మట్టి రంగులో ఉంటాయి.

కోళ్ల జాతులనిబట్టి, గ్రుడ్ల యొక్క పరిమాణం భిన్నభిన్నంగా ఉంటుంది. ఒకే జాతికి చెందిన పెట్టల గ్రుడ్లు కూడా వేరువేరు పరిమాణంలో ఉండవచ్చును. సర్వ సాధారణంగా గుడ్డు యొక్క పరిమాణం, పెట్ట యొక్క పరిమాణాన్నిబట్టి ఉంటుంది. తక్కువ మేతమీద బతికిన పెట్టల గ్రుడ్లు పెద్దవిగా ఉండవు. మేత తక్కువ అయితే నాసిరకపు గుల్లకల గ్రుడ్లు పెడతాయి కూడాను.

గ్రుడ్ల నాణ్యత బాగుండడానికి తరుచుగా గ్రుడ్లు పట్టునుంచి తీసి చల్లగా ఉండే జాగాలో ఉంచాలి. సున్నపునీళ్లలో ఉంచిన గ్రుడ్లు చాలాకాలం ఉంటాయి. ఈరీతిగానే ("వాటర్‌గ్లాసు" అన్నది సోడాసిలికేటు ద్రావణము), వాటర్ గ్లాసులోనూ, సున్నపు నీళ్లలోనూ భద్రపరిచే గ్రుడ్లు కడగకూడదు. వీటిలో ఉంచే గ్రుడ్లు తాజాగా, శుభ్రంగా ఉండి పొదగడానికి పనికిరాని గ్రుడ్లు అయితే కొన్ని నెలల వరకూ చెడిపోకుండా ఉంటాయి. 54.4 డిగ్రీలు సెంటిగ్రేడు (130 డిగ్రీలు ఎఫ్) ఉష్ణత గల నీటిలో 15 నిమిషాలసేపు పొదిగే గ్రుడ్లు వెచ్చజేస్తే, వాటిలోని పిండోత్పత్తిపోయి, అది నిలువ ఉండడానికి వీలుగా ఉంటుంది. ఇలాగ చేసిన గ్రుడ్లు శ్రేష్ఠంగా చాలాకాలం ఉంటాయి. గ్రుడ్డులోని పిండం ఎదగడంవల్ల మనదేశంలో సామాన్యంగా, ముఖ్యంగా వేసవికాలంలో, గుడ్లు చెడిపోతాయి.

## గ్రుడ్ల యొక్క పోషక విలువ

గ్రుడ్లు, ప్రకృతిలో సహజంగా లభించే అతి ఉత్తమమైన ఆహారాలలో ఒకటి. వీటిలో భాస్వరము, ఇనుము, లిపిడ్సు, ఫోస్ఫోలిపిడ్సు, ఎ, బి, డి విటమినులు అత్యధికంగా ఉండడమేకాకుండా, మిక్కిలి పోషక విలువగల మాంసకృత్తులు కూడా గ్రుడ్లలో ఉన్నాయి. గ్రుడ్డు మొత్తంలో ఆరవభాగం మాంసకృత్తులుంటాయి. మాంసకృత్తులు మిగతా ముఖ్యమైన పోషకపదార్థాలూ గ్రుడ్డులో తెల్లటి భాగంలోనూ, చందమామలోనూ వివిధంగా ఉంటాయి. చందమామ యొక్క బరువులో 16 శాతమున్నూ, తెల్లటి భాగము యొక్క బరువులో 10 శాతమున్నూ ప్రోటీన్లు.

ముఖ్యమైన ఏమినో ఆసిడ్సు మిక్కుటంగానూ, మిక్కిలి చక్కని నిష్పత్తిలోనూ ఉండడంవల్ల, చందమామలో గల మాంసకృత్తులకు అత్యధికమైన పోషక విలువ ఉంది. గ్రుడ్డు పూర్తిగా తీసుకుంటే, కావలసిన మాంసకృత్తులు యీ భాగాలలోంచి తృప్తికరంగా లభిస్తాయి.

పోషకరీత్యా చూస్తే, మనం ఇళ్లలో గ్రుడ్లు ఆరగించే విధాలు చాలావరకు శరీర పోషణకి పనికిరాకుండా పోతున్నాయి. ఎంచేతనంటే ఈ విధాలలో గ్రుడ్లలోని మాంసకృత్తులు తప్పనిసరిగా నష్టం అయిపోతాయి. ఉడికించిన గ్రుడ్లలో ప్రోటీను పదార్థం నష్టం కాదుకాని, అట్టు (ఆమ్లెటు) లో 3 శాతం, వేయించిన వాటిలో (ఫ్రయిడ్ గుడ్లు) 3 శాతం, స్క్రాంబుల్డ్ గ్రుడ్లలో 14 శాతం ప్రోటీన్లు నష్టం అయిపోతాయి. పచ్చిగ్రుడ్లకంటె ఉడికించిన గ్రుడ్లు ఎక్కువ సులభంగా జీర్ణం అవుతాయి.

## కోడిపిల్లల దుర్గుణాలు

పెంపకం సరిగా లేకపోతే, ఎదిగే పిల్లలకి అనేకమయిన దుర్గుణాలు అలవడతాయి. వీటిలో అతి సామాన్యం అయినది స్వజాతి భక్షణము. కోడిపిల్లలు, మిగతా వాటి యొక్క పాదాలూ, తలపై నుండే జుట్టూ, గుదరంధ్రం మొదలైన వాటినీ ముక్కుతో పొడుస్తూ ఉంటాయి. అనేకంగా పిల్లలని ఒకేచోట ఉంచే పరిస్థితులలోనూ, ఆహారంలోని పోషకపదార్థాలు సమపాళంగా లేనప్పుడూ, వ్యాయామం తక్కువ అయినప్పుడూ, కోడిపిల్లలో యీ దుర్గుణం ప్రబలంగా కనిపిస్తుంది. ఇటువంటి వాటికి ముక్కు కొంచెం

మొద్దుబారేటట్టు అరగదీస్తారు. ముక్కు మొద్దుబారడం వల్ల, ఇవి మేతమేసి నీరు తీగగలవు కాని, మిగతా పక్షులని ముక్కుతో పొడవలేవు. ఇలా ముక్కుతో పొడిచి అల్లరి చెయ్యకుండా ఉంచడానికి వేరే సాధనాలు కూడా ఉన్నాయి.

పౌల్ట్రీ పక్షులకి సంక్రమించే యింకొక దుర్గుణం యీకెలు పొడుస్తూ ఉండడం. ఇదిగాని అలవాటు అయిపోతే, ఆ తరవాత, తన యీకెలు తనే పొడుకుకోకుండా ఉండేటట్టు చెయ్యడం. ఇతర పక్షుల యీకెలు పొడవకుండా ఉండేటట్టు తిప్పుకోవడం అసాధ్యం అయిపోతాయి. ఆహారంలో, లోపాలు ఎప్పుడూ బంధించి ఉండడం, కోడిపిల్లని చికాకుపరచే తవుటి పురుగులవల్లా ముఖ్యంగా యీ దుర్గుణం కలుగుతుంది. ఇటువంటి కోడిపిల్లలని మిగతావాటినుంచి వేరుపరచాలి.

పెట్టిన గ్రుడ్లు తినెయ్యడం ఇంకో దుర్గుణం. ఈ దుర్గుణం కలిగిన కోళ్లు తమ గ్రుడ్లను తామే పగులకొట్టి తినేస్తాయి. ఇది అరికట్టడానికి గ్రుడ్లుపెట్టే పట్లు (గూళ్లు) ఎక్కువగా ఉండేటట్టు చూడాలి. పెట్టిన గ్రుడ్లు తరుచుగా తీసివేస్తూ ఉండాలి. పెట్టలకి పచ్చికాయగూర మేతలూ, సున్నపురాతిపొడీ లేదా సీపిగుల్లలు ఎక్కువగా పెట్టాలి. పెట్టలు మెసలడానికి ఎక్కువ జాగా ఉండేటట్టు చూడాలి. ఈ దుర్గుణం అలవాటయిన పక్షులని మిగతా వాటినుంచి వేరుచెయ్యాలి.

## కోళ్లకి వచ్చే సామాన్యపు తెగుళ్లు

పౌల్ట్రీ పక్షులకి తెగుళ్లు రాకుండా ఉంచడం చాలా ముఖ్యం. కోళ్లకి తెగుళ్లు వచ్చేక బాగుచేయించడం కంటే, అసలు తెగులు రాకుండా జాగ్రత్తపడడం ఎక్కువ అవసరం. అంచేత కోళ్ల పెంపకంలో ఆరోగ్య రక్షణ సూత్రాలు తు.చ. తప్పకుండా పాటించాలి. కొత్తగా సేకరించిన కోళ్లనన్నిటినీ, కనీసం రెండు వారాల వరకు, వేరుగా ఉంచాలి. పిల్లకోళ్లని పెద్దవాటితో విచ్చలవిడిగా వదిలెయ్యకూడదు. కోళ్లకై వినియోగించే సామగ్రి, మేత నీరు పెట్టే గిన్నెలు వగైరా, ప్రతిరోజూ శుభ్రంగా కడగాలి. కోళ్లని పెంచేతావు చెమ్మగా ఉండడం, ఎక్కువ పక్షులని ఒకేచోట ఉంచడం చేయకూడదు.

తెగులు పట్టిన పక్షికి ఆకలి మందగిస్తుంది. పక్షి మందంగా ఉంటుంది. నీరసించి పోతుంది. జ్వరం వస్తుంది. తలమీదఉండే జుట్టు, మెడక్రింది చర్మం పాలిపోతాయి. పక్షి ముడుచుకుపోయి ఒంటరిగా స్తబ్ధుగా ఉంటుంది.

ఆరోగ్యంగా ఉన్న కోడి శరీరపు ఉష్ణత 40.5 డిగ్రీలు మొదలు 43 డిగ్రీలు సెంటిగ్రేడు (105 మొదలు 109.4 డిగ్రీలు ఎఫ్) ఉంటుంది. సగటున 42 డిగ్రీలు సెంటిగ్రేడు (107.6 డిగ్రీలు ఎఫ్). సాధారణంగా శ్వాసరేటు నిమిషానికి 15 మొదలు 30 వరకూ ఉంటుంది. గుండె నిమిషానికి 300 సార్లు కొట్టుకుంటుంది.

పౌల్ట్రీ పక్షులకి తెగుళ్లు ముఖ్యంగా చీడపురుగులవల్ల సంక్రమిస్తాయి. చీడపురుగు పడితే, కోడి ఎదగడం, దానిగ్రుడ్లు పెట్టే శక్తి గూడా దెబ్బతింటాయి. పేలు, కొణుసు పురుగులు, తవుటి పురుగులు, తుళ్ల పురుగులు మొదలైనవి శరీరానికి పట్టి, కోడిని చాలా చికాకుపరుస్తాయి. వీటివల్ల పక్షి ఫలసాయం దెబ్బతింటుంది. కోళ్లకి పట్టే కొణుసు పురుగు పక్షులకి పెద్ద శత్రువు. కర్రలోను, ఇటుకలలోనూ చెయ్యబడిన పక్షుల గూళ్లలో ఉండే పగుళ్లలోనూ, సందులలోనూ కొణుసు పురుగులు వర్ధిల్లుతాయి. పక్షుల శరీరంలో క్రిములు లేకుండాను, శరీరంపైన పీడపురుగులు ఉండకుండాను ఉండడానికి కోళ్లని తరుచుగా తనిఖీ చేయించాలి.

భారతదేశంలో అతిసామాన్యంగా కానవచ్చే కోళ్లతెగుళ్లు, కొక్కిరి(రానిఖెట్), కోక్సిడియోసిస్సు, మశూచి, కొణుసు పురుగుల వచ్చే పేలజ్వరమున్నూ.

కొక్కిరి (రానిఖెట్) తెగులు భారతదేశంలో కోళ్లకి వచ్చే పెద్ద ఉపద్రవం. ఇది ప్రాణనష్టం కలిగించే తీవ్రమయిన అంటువ్యాధి. ఈ తెగులు వస్తే నూటికి 80, నూటికి నూరు పక్షులు కూడా చచ్చిపోతాయి. ఈ తెగులు యొక్క ముఖ్యలక్షణాలు : ఆకలి చచ్చిపోవడం, బలహీనంగా వేలబడిపోవడం, మత్తుగా ఉండడం, ఈకెలు చిందర వందరగా అక్రమంగా ఉండడం, నీరసమున్నూ, కోడిరొప్పుతూ, శ్వాస పీల్చుకోవడానికి యిబ్బందిపడుతూ ఉంటుంది. రెట్టలు ఆకుపచ్చటి రంగులో అధికంగా వేస్తుంది. క్రమేణా పక్షికి పక్షవాతం వస్తుంది.

ఈ తెగులు రాకుండా ఉండడానికి, చిన్నపక్షులన్నిటికీ ఆరువారాల ప్రాయం వచ్చేసరికి టీకాలు వేయించాలి. తెగులుపట్టిన కోళ్లని వెంటనే వేరుపరచాలి.

కోక్సిడయోసిస్సన్నది పిల్లకోళ్లకి వచ్చే సాధారణపు జబ్బు. ఇది రెండు మొదలు పన్నెండు వారాలు వయస్సుగల పిల్లలకి వస్తుంది. ఈ తెగులు పట్టిన పక్షులలో చావులు ఎక్కువ. ఈ తెగులు యొక్క సామాన్య లక్షణాలు.

రక్తవిరేచనాలు, చురుకులేకుండా ఉండడం, కలతచెంది ఉండడమున్నూ, ఈ తెగులుపట్టిన కోళ్లు ఒక మూల గుమిగూడి ఉంటాయి.

కోడిపిల్లలని, పొడిగా ఉండి, గాలి-వెలుతురూ బాగా ప్రసరించేచోట ఉంచాలి. ఆ పరిసరాలు శుభ్రంగానూ, ఆరోగ్యకరంగానూ ఉంచాలి.

కోళ్ల మశూచి : ఇది తీవ్రమయిన అంటువ్యాధి. సాధారణంగా యిది వేసవి కాలంలో ఎక్కువగా కనిపిస్తుంది. పెద్దా చిన్నా అన్న భేదం లేకుండా యిది అన్ని కోళ్లకి వచ్చినా, పెద్దవాటికంటె పిల్లకోళ్లు యీ వ్యాధికి ఎక్కువగా గురిఅవుతాయి. ఈ జబ్బు వచ్చిన చిన్నకోళ్లలో చావులు ఎక్కువ.

ఈ వ్యాధి సామాన్య లక్షణాలు : తలమీద ఉండే జుట్టుపైన, మెడక్రిందీ చర్మంపైన, కాయలలాంటివి లేస్తాయి. శరీరంపైన బూడిదరంగులో మచ్చలుగాని, పొక్కులుగాని లేస్తాయి. ఒక్కొక్కప్పుడు కళ్లూ, ముక్కూ పసుపుపచ్చగా ఉండే చిక్కని పుసిలాంటి పదార్థంతో కప్పబడిపోతాయి.

నాలుగువారాల ప్రాయానికి పైబడ్డ కోడిపిల్లలన్నిటికీ టీకాలు వేయించాలి. తప్పనిసరిగా యీ పనిచేస్తే, యీ తెగులు నిరోధించవచ్చును. మశూచి గనక వ్యాపిస్తే, జబ్బుపడ్డ పక్షులన్నిటినీ వేరుచేసి చంపెయ్యాలి.

పేల జ్వరం : కోళ్లకి అతి సామాన్యంగా వచ్చే జబ్బులలో ఇది ఒకటి. దీనివల్ల అమితమైన ప్రాణనష్టం కలుగుతుంది. కొణుసు పురుగులు కోడి శరీరానికి పట్టి కరవడం వల్ల ఇది సంప్రాప్తమవుతుంది. ఈ జబ్బు లక్షణాలు : ఆకలి లేకపోవడం, విదాహం, పక్షి ముడుచుకుపోయి ఉన్నట్టు కనిపించడం ; జ్వరం 43.3 డిగ్రీలు సెంటిగ్రేడు (110 డిగ్రీలు ఎఫ్) వరకూ పెరిగి, ఇంక 24 మొదలు 48 గంటలలో చచ్చిపోతుందనగా, మామూలు శరీర ఉష్ణత కంటె కూడా క్రిందికి పడిపోవడమున్నూ, తలపైని ఉండు జుట్టు, మెడక్రింద ఉండే చర్మము పాలిపోతాయి. ఆకుపచ్చని రంగులో పల్చని విరేచనాలు అధికంగా అవుతాయి. క్రమేణా కోడికాళ్లకి, రెక్కలకి పక్షవాతం వస్తుంది; జబ్బు మరీ ప్రమాదించినప్పుడు కోడి విలవిల తన్నుకుంటూ చచ్చిపోతుంది.

ఈ వ్యాధి రాకుండా ఉండడానికి, కోళ్ల గంపలు, గూడేలు మొదలైనవి అన్నీ కొణుసు పురుగులు పట్టకుండా చూడాలి. కొణుసుపురుగులు పట్టనటువంటి కర్రతో, పక్షులు కూచునేటందుకు వీలుగా, కొయ్యలు చేసి పాటించాలి. ఆరోగ్య ప్రక్రియలు అన్నీ ముఖ్యంగా అవలంబించాలి. వ్యాధి వచ్చిన పక్షులకి వెంటనే చికిత్స చేయించాలి.

# పొట్టిబాతులు

భారతదేశంలో పెంచబడే ముఖ్యమైన పౌల్ట్రీ పక్షులలో రెండవది పొట్టిబాతు. ఇవి ఏ నేలలో నయినా బతకగలవు; కాస్త నీరుగల తావు అయితే మరీ మంచిది.

కోడిపెట్టకన్నా, ఆడబాతు ఏడాదికి 30, 40 గ్రుడ్లు ఎక్కువ పెడుతుంది. కోడిగ్రుడ్ల కన్నా బాతుగ్రుడ్లు ఎక్కువ బరువుగా ఉంటాయి. ఒక్కొక్కటి 70 మొదలు 84 గ్రాముల బరువు తూగుతుంది. కోళ్లకన్నా బాతులు దృఢమైనవి. ఇంచుమించుగా వీటికి వ్యాధి సోకనేసోకదు. కోళ్ల పెంపకంలో తీసుకోవలసినంత శ్రద్ధ బాతుల పెంపకానికి అవసరం లేదు

1982 లో మనదేశంలో 16.24 మి. పొట్టిబాతులున్నాయి. వీటిలో 1.484 మిలియన్ పొట్టి జాతుల బాతులు మంచివిగా అంచనావేయబడ్డాయి.

## పొట్టిబాతులలో ముఖ్యమైన జాతులు

పొట్టి బాతులలో ముఖ్యమైనవి మూడు రకాలు; మాంసం కోసం పెంచేవి, గ్రుడ్ల కోసం పెంచేవి. సరదాకోసం పెంచేవిన్నీ. భారతదేశంలో పెంచే పొట్టి బాతులు చాలవరకు, గ్రుడ్ల కోసమే పెంచబడుతున్నాయి.

సిల్హెట్‌మేట్, నాగేశ్వరి అన్నవి భారతదేశపు బాతులలో ముఖ్యమైనవి. ఈ దేశపు వాతావరణ పరిస్థితులలో బాగా పెంపొందించబడిన మేలిజాతులు : ఇండియన్ రన్నర్, కాకీ కేంబెల్ జాతులు.

సిల్హెట్‌మేట్ అన్నది తూర్పు భారతదేశపు పల్లెటూళ్లలో సామాన్యంగా కానవచ్చే బాతు. ఇది లేత మట్టి రంగులో ఉంటుంది. దీని యీకెల కొనలు నల్లగా ఉంటాయి. ముక్కు పసుపుపచ్చగా ఉంటుంది. ఈకలు బాగా బలిసినప్పుడు దీని మెడ, తల నీలిమవర్ణంలో ఉంటాయి. ఆడబాతులు 80 మొదలు 150 గ్రుడల్లి దాకా, సగటున పెడతాయి. గ్రుడ్డు తెలుపు రంగులో ఉంటుంది. సగటున, గ్రుడ్డు 56 గ్రాముల బరువు తూగుతుంది. ఎదిగిన బాతు సుమారు 1.8 కిలోగ్రాముల బరువు ఉంటుంది.

నాగేశ్వరి జాతి బాతులు, చాలావరకు, అస్సాంలో, సుర్మాలోయలో గల కచ్చార్, సిల్హెట్ జిల్లాలలోనూ, తూర్పు బెంగాలులోనూ కానవస్తాయి. ఈ బాతుల వీపూ, శరీరంలో చాలాభాగం, నల్లగా ఉంటాయి; కాని, గుండె, మెడ మాత్రం తెల్లగా ఉంటాయి. దొడ్లలో పెంపకపు పరిస్థితులలో ఈ జాతి బాతు ఏడాదికి 80 మొదలు 150 గ్రుడ్లవరకూ పెడుతుంది. గ్రుడ్డు లేత నీలిమ రంగులో ఉంటుంది. సగటున గ్రుడ్డు 56 గ్రాముల బరువు తూగుతుంది. ఎదిగిన బాతు సుమారు రెండు కిలోగ్రాముల బరువు తూగుతుంది.

ఇండియన్ రన్నర్ జాతి బాతులు భారతదేశపు కొన్ని రాష్ట్రాలలో ఉన్నాయి. కాని కొద్ది తావులలోనే ఇవి సంకరం లేకుండా పెంచబడు తున్నాయి. ఈ బాతులు తెల్లగా ఉంటాయి. నడచి ఎక్కువ బరువుతూగే బాతులతో జత కట్టించి, వీటియొక్క గ్రుడ్లు పెట్టే శక్తిని అధికం చెయ్యడానికి ఇండియన్ రన్నర్ బాతులు విరివిగా ఉపయోగింపబడుతున్నాయి. ఈ జాతి బాతుగ్రుడ్డు తెల్లగా ఉంటుంది. 56 గ్రాములకి పైగా బరువు తూగుతుంది.

కాకీ కేంప్‌బెల్ అన్నది ఎక్కువగా వ్యవహారంలో ఉన్న జాతి. భారతదేశంలో, సాధారణంగా, లాభదాయకంగా గ్రుడ్లు ఉత్పత్తి చెయ్యడానికి యీ జాతి బాతులు పెంచబడుతున్నాయి. ఈ జాతి మగ బాతులకి వీపు, మెడ నల్లగా ఉంటాయి. ఆడబాతు కాకీ రంగులో ఉంటుంది. ఏడాది ప్రాయం వచ్చేసరికి యిది బూడిదరంగుగా మారుతుంది. ఆరునెలల ప్రాయానికి, ఆడబాతు గ్రుడ్లు పెట్టనారంభిస్తుంది. దీని రెండవయేట, ఇది గరిష్ట సంఖ్యలో గ్రుడ్లు పెడుతుంది. సామాన్యంగా, నాలుగేళ్లు వచ్చేసరికి యీ బాతులని అమ్మివేస్తారు. వీటిగ్రుడ్లు తెల్లగా ఉంటాయి. సగటున ఒక్కొక్క గ్రుడ్డు 70 గ్రాములు తూగుతుంది.

## పిల్లబాతుల ఆలన, పాలన

బాతులకు యీకెలు పూర్తిగా వచ్చేక, అవి చెరువుల వద్ద, కొలనుల దగ్గర సంకచరించడానికి సిద్ధం అవుతాయి. ఆ తావులలో వాటికి పచ్చిగడ్డీ, నత్తగుల్లలూ, ఇతరమైన పురుగులూ మేతకి దొరుకుతాయి. చాలావరకు,

# పొట్టిబాతులు

భారతదేశంలో పెంచబడే ముఖ్యమైన పౌల్ట్రి పక్షులలో రెండవది పొట్టిబాతు. ఇవి ఏ నేలలో నయినా బతకగలవు; కాస్త నీరుగల తావు అయితే మరీ మంచిది.

కోడిపెట్టకన్నా, ఆడబాతు ఏడాదికి 30, 40 గ్రుడ్లు ఎక్కువ పెడుతుంది. కోడిగ్రుడ్ల కన్నా బాతుగ్రుడ్లు ఎక్కువ బరువుగా ఉంటాయి. ఒక్కొక్కటి 70 మొదలు 84 గ్రాముల బరువు తూగుతుంది. కోళ్లకన్నా బాతులు దృఢమైనవి. ఇంచుమించుగా వీటికి వ్యాధి సోకనేసోకదు. కోళ్ల పెంపకంలో తీసుకోవలసినంత శ్రద్ధ బాతుల పెంపకానికి అవసరం లేదు

1982 లో మనదేశంలో 16.24 మి. పొట్టిబాతులున్నాయి. వీటిలో 1.484 మిలియన్ పొట్టి జాతుల బాతులు మంచివిగా అంచనావేయబడ్డాయి.

## పొట్టిబాతులలో ముఖ్యమైన జాతులు

పొట్టి బాతులలో ముఖ్యమైనవి మూడు రకాలు; మాంసం కోసం పెంచేవి, గ్రుడ్ల కోసం పెంచేవి. సరదాకోసం పెంచేవిన్నీ. భారతదేశంలో పెంచే పొట్టి బాతులు చాలవరకు, గ్రుడ్ల కోసమే పెంచబడుతున్నాయి.

సిల్హెట్‌మేట్, నాగేశ్వరి అన్నవి భారతదేశపు బాతులలో ముఖ్యమైనవి. ఈ దేశపు వాతావరణ పరిస్థితులలో బాగా పెంపొందించబడిన మేలిజాతులు : ఇండియన్ రన్నర్, కాకీ కేంబెల్ జాతులు.

సిల్హెట్‌మేట్ అన్నది తూర్పు భారతదేశపు పల్లెటూళ్లలో సామాన్యంగా కానవచ్చే బాతు. ఇది లేత మట్టి రంగులో ఉంటుంది. దీని యీకెల కొనలు నల్లగా ఉంటాయి. ముక్కు పసుపుపచ్చగా ఉంటుంది. ఈకలు బాగా బలిసినప్పుడు దీని మెడ, తల నీలిమవర్ణంలో ఉంటాయి. ఆడబాతులు 80 మొదలు 150 గ్రుడల్లి దాకా, సగటున పెడతాయి. గ్రుడ్డు తెలుపు రంగులో ఉంటుంది. సగటున, గ్రుడ్డు 56 గ్రాముల బరువు తూగుతుంది. ఎదిగిన బాతు సుమారు 1.8 కిలోగ్రాముల బరువు ఉంటుంది.

నాగేశ్వరి జాతి బాతులు, చాలావరకు, అస్సాంలో, సుర్మాలోయలో గల కచ్చార్, సిల్హెట్ జిల్లాలలోనూ, తూర్పు బెంగాలులోనూ కానవస్తాయి. ఈ బాతుల వీపూ, శరీరంలో చాలాభాగం, నల్లగా ఉంటాయి; కాని, గుండె, మెడ మాత్రం తెల్లగా ఉంటాయి. దొడ్లలో పెంపకపు పరిస్థితులలో ఈ జాతి బాతు ఏడాదికి 80 మొదలు 150 గ్రుడ్లవరకూ పెడుతుంది. గ్రుడ్డు లేత నీలిమ రంగులో ఉంటుంది. సగటున గ్రుడ్డు 56 గ్రాముల బరువు తూగుతుంది. ఎదిగిన బాతు సుమారు రెండు కిలోగ్రాముల బరువు తూగుతుంది.

ఇండియన్ రన్నర్ జాతి బాతులు భారతదేశపు కొన్ని రాష్ట్రాలలో ఉన్నాయి. కాని కొద్ది తావులలోనే ఇవి సంకరం లేకుండా పెంచబడు తున్నాయి. ఈ బాతులు తెల్లగా ఉంటాయి. నడచి ఎక్కువ బరువుతూగే బాతులతో జత కట్టించి, వీటియొక్క గ్రుడ్లు పెట్టే శక్తిని అధికం చెయ్యడానికి ఇండియన్ రన్నర్ బాతులు విరివిగా ఉపయోగింపబడుతున్నాయి. ఈ జాతి బాతుగ్రుడ్డు తెల్లగా ఉంటుంది. 56 గ్రాములకి పైగా బరువు తూగుతుంది.

కాకీ కేంప్‌బెల్ అన్నది ఎక్కువగా వ్యవహారంలో ఉన్న జాతి. భారతదేశంలో, సాధారణంగా, లాభదాయకంగా గ్రుడ్లు ఉత్పత్తి చెయ్యడానికి యీ జాతి బాతులు పెంచబడుతున్నాయి. ఈ జాతి మగ బాతులకి వీపు, మెడ నల్లగా ఉంటాయి. ఆడబాతు కాకీ రంగులో ఉంటుంది. ఏడాది ప్రాయం వచ్చేసరికి యిది బూడిదరంగుగా మారుతుంది. ఆరునెలల ప్రాయానికి, ఆడబాతు గ్రుడ్లు పెట్టనారంభిస్తుంది. దీని రెండవయేట, ఇది గరిష్ట సంఖ్యలో గ్రుడ్లు పెడుతుంది. సామాన్యంగా, నాలుగేళ్లు వచ్చేసరికి యీ బాతులని అమ్మివేస్తారు. వీటిగ్రుడ్లు తెల్లగా ఉంటాయి. సగటున ఒక్కొక్క గ్రుడ్డు 70 గ్రాములు తూగుతుంది.

## పొట్టిబాతుల ఆలన, పాలన

బాతులకు యీకెలు పూర్తిగా వచ్చేక, అవి చెరువుల వద్ద, కొలనుల దగ్గర సంచరించడానికి సిద్ధం అవుతాయి. ఆ తావులలో వాటికి పచ్చిగడ్డీ, నత్తగుల్లలూ, ఇతరమైన పురుగులూ మేతకి దొరుకుతాయి. చాలావరకు,

బాతులకు ఇవే ఆహారం. బాతులు తిండిపోతులు; ఏది కంటబడితే దాన్ని తింటాయి. బాతు శరీరపు భారం ఒక కిలోగ్రాము పెరగడానికి, నాలుగు కిలోగ్రాముల మేత మేస్తుంది. సంతతికోసం పెంచే బాతుల విషయంలో, అవి క్రొవ్వెక్కిపోకుండా జాగ్రత్తపడాలి. 35 పాళ్లు మొక్కజొన్నపిండి లేదా యితర కాయధాన్యపు పిండి, 20 పాళ్లు గోధుమపాట్టు లేక తవుడు, 3 పాళ్లు వేరుసెనగపిండి, 5 పాళ్లు చేపపాట్టు, 4 పాళ్లు సున్నపు రాతిపొడి లేక సిపిగుల్లలు, 5 పాళ్లు ఎండిన కూరాకులు, 0.5 పాళ్లు ఉప్పు, 0.5 పాళ్లు చేపనూనె కలిపి చేసిన మిశ్రణంలో పోషకపదార్థాలు సమపాళంలో ఉండి, పిల్లబాతులకీ, ఎదిగినవాటికీ కావలసిన మేత ఏర్పడుతుంది. మేత, తడిగా అంబలి రూపంలో, పెట్టాలి. బాతులు యీ గుజ్జుతో పాటు నీరు కూడా తాగుతాయి. పరిశుభ్రమైన మంచినీరు వాటికి ఎల్లప్పుడూ లభించేటట్టు చూడాలి.

బాతుల పెంపకపు విషయంలో, అయిదారు ఆడ బాతులకి ఒక మగబాతు చొప్పున ఏర్పరచాలి. బాతులు సాధారణంగా రాత్రిపూట, ఉదయాన్ని గ్రుడ్లు పెడతాయి. మామూలు బాతు గ్రుడ్లు పొదగడానికి 28 రోజులు పడుతుంది. మస్కోవీ బాతు గ్రుడ్లు పొదగడానికి 35 రోజులు పడుతుంది. కోడిగ్రుడ్లు పొదిగినట్టుగానే బాతు కూడా గ్రుడ్లు పొదుగుతుంది. ఆడబాతుకీ మగబాతుకీ భేదం ఏమిటీ అంటే, మగబాతుకు తోకచివర యీకెలు ఎత్తిపెట్టి ఉంటాయి. మగబాతు గొంతు వినిపించనంత తక్కువగా ఉంఉటుంది. ఆడబాతు కంఠధ్వని నిండుగా ఉంటుంది.

బాతులను కూడా కోళ్లలాగే సంబాళించుకోవాలి. బాతులకి ప్రశాంతి కావాలి. వాటి సంబాళింపులో నెమ్మది అవసరం. బాతుపిల్లలకి 6, 8 వారాల ప్రాయం వచ్చేదాకా ప్రవహిస్తూన్న నీరు అవసరం లేదు. 5 వారాల ప్రాంతంలో అది గడ్డి ఉన్న ఆరుబయట తిరగడానికీ, అక్కడ వాటికోసం కట్టిన గుడెసెలాంటి దానిలోకి యథేచ్ఛగా వెళ్లిరావడానికీ, తగి ఉంఉటుంది.

బాతులకు చెరువులు మొదలైన గట్టున కాని, లేదా నీటితావుల అంచులని గాని, ఒక గుడెసెలాంటిది వెయ్యడం మంచిది. అక్కడ ఏదైనా సాల ఉంటే అదిగాని, లేకపోతే పౌల్ట్రీ పక్షుల కోసం కట్టిన దానిలో ఓ భాగంగాని, యీ పనికి ఉపయోగించవచ్చును. ఈ గుడెసె కప్పుకు చొప్ప మొదలైనది ఏ ్పుపు అయినా వాడవచ్చును. కాని, నేల మాత్రం గట్టిగా ఉండాలి.

సిమెంటు వెయ్యడం శ్రేష్ఠం. కోళ్లని బాతులని కలిపి ఒకేచోట ఉంచకూడదు. 3.6 మీటర్లు పొడవు, 2.3 మీటర్లు వెడల్పు, 1.8 మీటర్లు ఎత్తుగల గుడిసెలో 24 బాతులు పడతాయి.

బాతుల యొక్క సాధారణపు శరీర ఉష్ణత 41.5 డిగ్రీలు మొదలు 42.5 డిగ్రీలు సెంటిగ్రేడు (106.7 మొదలు 108.5 డిగ్రీలు ఎఫ్) వరకూ ఉంటుంది. శ్వాసరేటు నిమిషానికి 15 మొదలు 48 వరకూ ఉంటుంది. బాతు గుండె నిమిషానికి 120 మొదలు 160 సార్లవరకు కొట్టుకొంటుంది.

ఎదిగివచ్చిన బాతులకి సాధారణంగా జబ్బులు రావు. కొక్కిరి తెగులు ఎప్పుడోకాని రాదు. బాతులకి, బాతుపిల్లలకి వచ్చే అంటువ్యాధులు కలరా, డక్ వైరస్ హెపటైటిస్, (పిత్తాశయ సంబంధమైన వ్యాధి యిది), కీల్ జబ్బు, ప్లేగున్నూ, బాతులకి పేలు మొదలైన పురుగులు ఎప్పుడూ పట్టవు.

# పెద్ద బాతులు

భారతదేశంలో కానవచ్చే పెద్ద బాతులు చాలావరకు తెల్లగా ఉంటాయి. ఇవి సుమారుగా చైనాబాతులని పోలి ఉంటాయి. దేశంలో కొన్ని ప్రాంతాలలో, వీపు మట్టిరంగులో ఉన్న బాతులు కూడా ఉన్నాయి. ఈ మట్టిరంగు బాతులకి తెల్లబాతులకీ జతకట్టిస్తే, పుట్టే పిల్లలకి మిశ్రమమైన రంగుగాక, తెలుపో మట్టిరంగో ఏదో ఒక రంగులోనే ఉంటుంది.

మట్టిరంగు వీపుగల బాతు పొట్ట తెల్లగా ఉంటుంది. రెక్కలు, వీపు, తల మట్టి రంగులో ఉంటాయి. గుండె వద్ద లేత మట్టిరంగు ఉంటుంది; మెడ తెల్లగా ఉంటుంది. తెల్ల బాతుయొక్క శరీరం అంతా తెల్లగానే ఉంటుంది.

పెద్ద బాతులలో ముఖ్యమైన జాతులు : ఎమ్డెన్, ఇంగ్లీష్ వైట్, రోమన్, టౌలూస్, వైట్ చైనీస్, ఫారం చైనీస్, ఇంగ్లీష్ గ్రే, ఇండియన్ గూస్ అన్నవి.

పెద్ద బాతులని ముఖ్యంగా మాంసం కోసం పెంచుతారు. ఇవి కావలిపనులకి కూడా బాగా ఉపకరిస్తాయి. మగబాతు 3.5 కిలోగ్రాములున్నూ, ఆడది 3 కిలోగ్రాములున్నూ బరువు ఉంటుంది. సంకరంకాని బాతు 12 వారాల ప్రాయానికి 4 కిలోగ్రాముల వరకున్నూ, 24 వారాల ప్రాయానికి 6 కిలోగ్రాములున్నూ బరువు తూగగలదు. పెద్ద బాతులకి, గడ్డి మేత పెట్టి

పెంచినట్టయితే, తినడానికి శ్రేష్ఠంగా తయారవుతాయి. ఈ బాతులు సాధారణంగా శీతాకాలంలో, డిసెంబరు-జనవరి మాసాల్లో, ఏడాదికి రెండుసార్లు గ్రుడ్లు పెడతాయి; ఒక్కొక్కసారి 10 మొదలు 20 వరకు గ్రుడ్లు పెడతాయి. దినం విడచి దినం, ఉదయాన్ని 8 మొదలు 10 వరకు ఇవి గ్రుడ్లు పెడతాయి. సగటున గ్రుడ్డు సుమారు 128 గ్రాముల బరువు తూగుతుంది.

## పెద్దబాతుల ఆలన, పాలన

కొద్దివారాల ప్రాయంగల బాతుకీ, గడ్డీ, నత్తగుల్లలూ, పురుగులూ మొదలైన ఆహారం, తన మట్టుకు తను వెతుక్కుని తినేశక్తి ఉంటుంది. పెద్ద బాతులు మేత బాగా మేస్తాయి. గడ్డి ఒత్తుగా పెరిగిన ఆరుబయటి ప్రదేశంలో యివి ఎక్కువగా మేస్తాయి. వీటికి ఇతరమేతలు ఏవీ అక్కర్లేదు; గడ్డిపోచల మొదలువరకూ తినేస్తాయి. ఈ జాతులకు, చాలావరకు, పచ్చిగడ్డి పెట్టి పెంచవచ్చును; కాని సౌష్ఠవంగా పెరగడానికీ, ఫలసాయం బాగుండడానికీ, గింజల మేత పెట్టాలి. ఈ మేత కూరాకులు, ధాన్యపుగింజలు, తవుడు, సున్నపురాతి పొడి కలిపి గుజ్జుగా చేసిపెట్టాలి. వ్యాపారం లాభదాయకంగా ఉండాలంటే, బాతులకి యుక్తవయస్సురాగానే, అనగా 9-12 నెలలప్రాయంలో అమ్మివెయ్యాలి.

సామాన్యంగా కానవచ్చే దేశీజాతి ఆడబాతును సంకరంలేని ఎమ్డెన్ లేక టౌలూస్ జాతి మగబాతుతో జతకట్టించాలి. వాటికి పుట్టిన ఆడబాతులను సంకరం లేని యీ జాతుల మగజాతుల చేత మూడు నాలుగు తరాలవరకూ జతకట్టించాలి. ఈ రీతిగా చేస్తే, దేశీబాతు నాణ్యత వృద్ధి పొందుతుంది. సామాన్యంగా ఒక మగ బాతుని 4 మొదలు 6 ఆడబాతులతో జతకట్టించ వచ్చును. చిన్న బాతుల గ్రుడ్లు పొదగడానికి 28 రోజులున్నూ, పెద్దజాతివి పొదగడానికి 34, 35 రోజులకి పైగానూ పడుతుంది. సగటు పరిమాణంలో ఉన్న బాతు ఒక్కొక్కసారి 15 గ్రుడ్లు పొదగగలదు.

10 బాతులను పెంచడానికి 9 చతురపు మీటర్ల పరిమాణం గల జాగా కావాలి.

పెద్ద బాతులకు, పౌల్ట్రీ పక్షులకి వచ్చే జబ్బులు ఏవీ రావు. వీటి ఆరోగ్య విషయమయి ఎక్కువ శ్రద్ధ అవసరం లేదు. ఆరోగ్యంగా ఉన్న బాతు

యొక్క శరీరపు ఉష్ణత 42 డిగ్రీలు సెంటిగ్రేడు (107.6 డిగ్రీలు ఎఫ్). శ్వాసరేటు నిమిషానికి 20 మొదలు 25 వరకూ ఉంటుంది. గుండె నిమిషానికి 110 సార్లు కొట్టుకుంటుంది.

# టర్కీకోళ్లు

ఇటీవల భారతదేశంలో టర్కీకోళ్లు ఎక్కువగా వ్యవహారంలో ఉన్నాయి. వీటిని ముఖ్యంగా మాంసం కోసం పెంచుతారు. భిన్న భిన్నపు శీతోష్ణ పరిస్థితులలో టర్కీకోళ్ల పెంపకం వ్యవహారంలో ఉంది. అమితమైన చలిప్రదేశాలలోనూ, మిక్కిలి వేడిగా ఉండే ప్రదేశాలలోనూ కూడా ఇవి చక్కగా పెరుగుతాయి. టర్కీ కోళ్ల మాంసం, కాల్చుకు తినడానికి పనికివచ్చే కోడిమాంసాన్ని పోలి ఉంటుంది. ఈ రెండింటికీ భేదం ఏమిటీ అంటే, టర్కీకోడి, అమ్మకానికి వీలుగా ఏపుగా ఎదగడానికి ఎక్కువ కాలం పడుతుంది.

భారతదేశంలో సామాన్యంగా వచ్చే టర్కీకోళ్లు "బ్రాడ్ బ్రెస్టెడ్ బ్రాంజ్" జాతికి చెందినవి. తదితర ముఖ్యమైన జాతులు "నార్ఫోక్స్", "కేంబ్రిడ్జి" జాతులు. "బ్రిటిష్‌వైట్" (వైట్‌హాలండ్), "బెల్ట్స్‌విల్‌వైట్" జాతులు పశ్చిమ దేశాల్లో ఎక్కువగా వ్యవహారంలో ఉన్నాయి.

బ్రాడ్‌బ్రెస్టెడ్ బ్రాంజ్ జాతి మిగతా జాతులన్నిటికన్న మిక్కిలి బరువైనది. అమెరికాలో దీన్ని విరివిగా పెంచుతారు. దీని యీకెలు అడుగున నల్లగా ఉండి, ఉపరిభాగంలో, ఆకుపచ్చగానూ, పసుపుపచ్చగానూ, రంగురంగులతో ఉంటాయి. టర్కీకోడి తొలి యేడాది సగటున, 75 గ్రుడ్లు పెడుతుంది; గ్రుడ్లు సుమారు 85 గ్రాముల బరువు ఉంటుంది. ఇది తెల్లగా ఉంటుంది; దాని మీద మట్టిరంగు మచ్చలుంటాయి. ఈ జాతి టర్కీకోళ్లు చిన్నపుంజు 11 కిలోగ్రాములూ, పెట్ట 7 కిలోగ్రాములున్నూ, బరువు తూగుతాయి. మిగతాజాతి టర్కీకోళ్లకన్నా యీ జాతి ఎక్కువగా బలుస్తుంది. దీనికి సంతతినిచ్చే గుణం, పొదిగే గుణం అల్పంగా ఉంటాయి.

## టర్కీకోళ్ల ఆలన, పాలన

టర్కీకోళ్లకు, ముఖ్యంగా ఎక్కువ బరువుతూగే వాటికి, ఉత్పత్తి శక్తి చాలా అల్పంగా ఉంటుంది. ఎక్కువ బరువు తూగే జాతులలో పొదిగే గుణం కూడా తక్కువగానే ఉంటుంది. పెట్ట సుమారుగా, మార్చినెల మధ్యలో గ్రుడ్లు పెట్ట నారంభిస్తుంది. తొలిసారిగా గ్రుడ్లు పెట్టేటప్పుడు, గ్రుడ్లు పెట్టేకాలంలో, టర్కీ పెట్ట 70 గ్రుడ్లవరకూ పెడుతుంది. పెట్టలకి ఎనిమిది, తొమ్మిది నెలల వయస్సు వచ్చేసరికి, కృత్రిమపు దీపాల ద్వారా, వాటియొక్క గ్రుడ్లు పెట్టే శక్తిని ఉత్తేజింపజేస్తారు.

టర్కీకోళ్ల పెంపకం విషయంలో, కృత్రిమ పద్ధతిని, ఇంజక్షను ద్వారా సంతతి కలగజెయ్యడం సామాన్యంగా వాడుకలో ఉంది. జతకట్టేకాలంలో, యీ కృత్రిమ పద్ధతి వల్ల కలిగే ఫలసాయం 70, 80 శాతం వరకూ ఉంటుంది. టర్కీకోడి గ్రుడ్లు పొదగడానికి 28 రోజులు పడుతుంది. బ్రాడ్‌బ్రెస్టెడ్ బ్రాంజ్ జాతి విషయంలో, 80 గ్రాములకి పైగా తూగిన గ్రుడ్లనే పొదగడానికి ఎంచుతారు.

టర్కీకోడి మూడేళ్ల ప్రాయంలో యుక్తవయస్సుకి వస్తుంది. సాధారణంగా ఒక కోడిచేత అయిదు పెట్టవరకూ జత కట్టిస్తారు. సామాన్యంగా మూడు నాలుగేళ్ల వరకూ టర్కీకోళ్లవల్ల సంతతి లభ్యం అవుతుంది.

టర్కీకోడిపిల్లల పెంపకం, సంబాళింపూ, మామూలు కోడిపిల్లలకు లాగే జరిగించాలి. వ్యాపారరీత్యా గరిష్ట లాభాలు పొందడానికి, టర్కీకోళ్లని 20 మొదలు 21 వారాల ప్రాయంలో అమ్మాలి. టర్కీకోడి తాలూకు క్రొవ్వు, దాని గుండె దగ్గిర ఉన్న చర్మపు దళసరిని బట్టి నిర్ణయిస్తారు.

పొలాలమీదా, తోటలలోనూ, సాధ్యమైనంతవరకు, టర్కీకోళ్లని స్వేచ్ఛగా వదిలివెయ్యాలి. వాటికి, యితరత్రా లభించే మేతకాక, ప్రతీరోజూ ఉదయం, సాయంకాలం, అదనంగా, గోధుమపొట్టు, దంపినధాన్యం, సన్నగా కోసి ఉండికించిన కూరగాయలూ పెట్టాలి. సామాన్యంగా వీటి మేత అలవాట్లు, కోళ్ల అలవాట్లలాగే ఉంటాయి. చిన్న వయస్సులో ఉన్న టర్కీకోళ్లకి లెట్యూస్ ఆకు, ఉల్లిపాయలు, సన్నగా తరిగిన మాంసం అంటే ఎక్కువ ప్రీతి.

తిగవంట లవరణగాఉన్న పెద్దసాల ఉంటే ఎదిగిన టర్కీకోళ్లు ఉంచడానికి చాలును. అందులో, ఇవి ఎగిరి కూచోడానికి వీలుగా, నేలకి ఒక మీటరు

ఎత్తులో వెడల్పాటి కొమ్మలలాంటిది పాతి ఉంచాలి. టర్కీకోడిపిల్లలను అడుగున తీగవలన వేసిఉంచిన స్థలంలో పెంచడం శ్రేష్ఠం.

టర్కీకోళ్లు దృఢమైన పక్షులేకాని, పెంపుడు కోళ్లకి వచ్చే జబ్బుల్లో చాలావరకు వీటికి వస్తాయి. నల్లకప్పు (బ్లేక్‌హెడ్) అనేది టర్కీకోళ్లకి వచ్చే తీవ్రమైన వ్యాధి. పేలు, టర్కీకోళ్ల పెంపకంలో, ఇంకొక ప్రమాదం, కోడి పిల్లల విషయంలో లాగే టర్కీకోడి పిల్లల విషయంలో కూడా, ఆరోగ్యకర చర్యలు తీసుకోవడం చాలా ముఖ్యం. టర్కీకోడి సామాన్యపు శరీర ఉష్ణత 42 డిగ్రీలు సెంటిగ్రేడు (107.6 డిగ్రీలు ఎఫ్).

# గినీకోళ్లు

పౌల్ట్రీ పక్షుల వ్యాపారంలో గినీకోళ్లకి ఎక్కువ ప్రాధాన్యం ఉంది. వీటిని ముఖ్యంగా మాంసంకోసం పెంచుతారు. అయితే ఇవి యించుమించుగా అడవి పరిస్థితులలలోనే ఉంటే శ్రేష్ఠం. మేతకోసం అవి విచ్చలవిడిగా చాలాదూరం తిరుగుతాయి. వాటిని కోళ్లలాగే, తిండిపెట్టి సంబాళించుకో వీలవుతుంది.

సామాన్యంగా ఒక మగకోడిని, మూడు నాలుగు పెట్టలతో జతకట్టిస్తారు. గినీ కోళ్ల గ్రుడ్లు పొదగడానికి 28 రోజులు పడుతుంది. సాధారణంగా, గినీకోడి శరీరపు ఉష్ణత 42 డిగ్రీలు సెంటిగ్రేడు (107.6 డిగ్రీలు ఎఫ్).